# నిరంతరత్రయం

## బుచ్చిబాబు

పల్లవి పబ్లికేషన్స్
ఏలూర్ రోడ్ విజయవాడ-2

# నిరంతరత్రయం

బుచ్చిబాబు కథలు – 2

మలి కూర్పు
జనవరి 1994

పల్లవి పబ్లికేషన్స్
ఏలూరురోడ్, విజయవాడ – 2

ముద్రణ :
మహాలక్ష్మి ప్రింటర్స్
కొత్తపేట, విజయవాడ – 1.

వెల : 30-00
గ్రంథాలయ ప్రతి : 50–00

# ఇందులో

# పొగలేని నిప్పు

ఇది మామయ్య చెప్పిన కథ. అనేక పల్లెటూళ్ళలో ఉద్యోగం చేసి నాలుగైదేళ్ళ క్రితం రిటైరయ్యాడు మామయ్య. వెనుకటి తరం, అంటే పాతిక, ముప్ఫైయ్యేళ్ళ క్రితం నాటి పల్లెటూరి జీవితం, ప్రజలూ ఆయనకి బాగా తెలుసు. ఆనాటి వ్యక్తుల్ని గురించి చిత్రమైన కథలు చెప్తూంటాడు. అవి వింటున్నంతసేపూ, ఆ కాలపు జగత్తులోకి ప్రవేశించి ఆ వ్యక్తుల ప్రవర్తనద్వారా జీవితాన్ని అర్థంచేసుకున్నట్లు భావించి ఆనంద పడుతూంటాను.

మామయ్య చెప్పే కథల్లో హుందాతనం తక్కువ. కొంచెం వస్తువు—అత్తయ్య దూరంగా వంటింట్లో వున్నప్పుడు కాస్తంత చిలిపి మాటలు; అటూ ఇటూ చూసి, వొకపాలు బూతు వాడతాడు. నాగరికత ప్రబలి, నాజూకు వ్యాపించిన తర్వాత బూతు, అశ్లీలం కుంటుపడ్డాయను కుంటాను. ఈ రెండూ, వెనుకటి తరం గ్రామీణ జీవితంతో మనకున్న లంకె. జీవితంలో కోరినవాటిని పొందలేనివారికి బూతేశరణ్యం అన్న వాదం కూడా వొకటుంది. లలితకళల్ని వొక పంటభూమిగా పరిగణిస్తే, బూతుని దానికి ఎరు వనొచ్చు.

"పొగ లేకుండా నిప్పు రాజేసి వంట చేస్తుందిరా మీ అత్తయ్య" అన్నాడు మామయ్య.

"అదేమిటి మామయ్యా – నిప్పు లేకుండా పొగ రాదన్న సామెత నెరుగుదుం గాని, పొగలేని నిప్పేమిటి ?" అన్న ప్రశ్నకు సమాధానంగా మామయ్య చెప్పిన కథ యిది.

ఇది పాత కాలపు కథ గావున ఆ ధోరణిలోనే మొదలెడతాను.

అన గనగా వొక ఊరు. ఊరు చివర కోనేరు. గట్టున పెద్ద రావి చెట్టు. దాని వెనుక ఆలయం. ముందుగా ఎడమవైపు రెండిళ్ళు. ఒకింట్లో నాగయ్యా, ఆయన భార్య సీతారత్నం కాపుర ముంటున్నారు. రెండో దాంట్లో పార్వతీ ఆమె భర్త భాస్కరం వుంటూన్నారు. ఇద్దరూ వ్యవసాయం చేస్తారు. నాగయ్యకి ఏదో వ్యాపారంకూడా వుంది. భాస్కరం కంటె స్థితిపరుడు. కాని భాస్కరం, నాగయ్యకంటె ఎక్కువ చదువుకున్నవాడు. కళాశాలలో ఒక ఏడు చదివి పరిస్థితుల వొత్తిడివల్ల మానేసి, భూములు చూసుకుంటున్నాడు. ఈ కథ ప్రారంభమైనప్పుడు ఆయన వయస్సు ఇరువై తొమ్మిది పెండ్లయింది; ఇద్దరు సంతానం, కిష్టయ్యకి ఏడేళ్లు. 'పాపాయికి' మూడేళ్లు. భార్య పార్వతమ్మ చాలా చక్కందని ఊళ్ళో చెప్పుకుంటారు. భాస్కరం లోలోన నవ్వుకుంటాడు.

అసలు, ఈ విషయం ప్రస్తావించింది. సీతారత్నం — పక్కింటి నాగయ్య భార్య. రెండిళ్ళకీ మధ్య మట్టిగోడ ఒకటుంది. భాస్కరం ఎత్తరి. కాలి బొటనవ్రేళ్ళమీద నిలబడితే, పక్కింట్లో జామచెట్టుకింద పనిచేసుకుంటున్న సీతారత్నం కనబడుతుందికూడా. అరుగెక్కి గుమ్మంమీద నిలబడితే, సీతారత్నంని బాగా చూడొచ్చు. వీలున్నప్పుడల్లా ఆమెను అలా చూస్తోండడం అలవాటయిపోయింది భాస్కరంకి. ఆమె కూడా అతనికేసి చూస్తూ వుండేది. అప్పుడప్పుడు కొంత కాలానికి రెండిళ్ళకీ మధ్యనున్న గోడలో ఒక మూలగా, ఒక రంధ్రం యేర్పడింది. ఆ పని భాస్కరం చేశాడో, ఏ పాలేరేనా చేశాడో, యెద్దుకొమ్ము తగిలి కంత పడిందో చెప్పడం కష్టం. ఆ కంతద్వారా సీతారత్నాన్ని పలకరించడంతో ప్రారంభమయి, పిచ్చాపాటి చెప్పుకోవడం మామూలైంది. మరికొన్నాళ్ళకు ఆ కంత పెద్దదైంది. అవతల వ్యక్తి మొహం బాగా కనబడుతుంది. ఒక పాత 'రంబు' మీద కూర్చుని, సావధానంగా మాట్లాడుకునే అవకాశం కలిగింది. మరికొన్నాళ్ళకి ఆ కంత మరింత పెద్దదయింది. కాస్త పక్కకితిరిగి,

ముడుచుకుని తోసుకొస్తే ఇవతల దొడ్లోకి రావొచ్చు. కొన్నాళ్ళు నాగయ్య దొడ్లో జామచెట్టుకింద, మరికొన్నాళ్ళు భాస్కరందొడ్లో రంబు పక్కనా కూర్చుని భాస్కరం, సీతారత్నం సాయంత్రం కబుర్లు చెప్పుకుంటూ వుండే వారు. ఎర్ర నాలుక బైటపెట్టి ఆకాశం వెక్కిరించినట్టుగా, సంధ్యచీకటి వారిని చుట్టుముట్టేది. పైన చెట్టుకొమ్మలనడుమ ఒక నక్షత్రం కన్ను మీటేది.

"నీ పెండ్లాం సక్కంది" అంది సీతారత్నం.

"పార్వతేనా?" అన్నాడు భాస్కరం.

"కాక–మరో పెండ్లాన్ని కూడా కట్టుకున్నావా ఏం?"

భాస్కరానికి ఆ కంఠం యిష్టం. కాస్త జీర వుంది – జలుబుచేసి తగ్గినప్పుడూ, తలంటుపోసుకుని, నిద్రనుంచి లేచి నప్పుడూ, వొకరకంగా కంఠం మారడం అతను గమనించాడు. ఆ మాదిరిగా వుంటుంది సీతా రత్నం కంఠం. ఎప్పుడూ. కొన్నిచోట్ల 'చ'కి బదులు 'స' వాడుతుంది. వాక్యం చివరలో 'ఏం' అన్న ప్రశ్న యిముడుస్తుంది – 'కాదా ఏం ?' 'రాదా ఏం ?' 'ఇంతేనా ఏం ?'–లాంటి వాడకం వింతగా వుంటుంది. తన భార్య పార్వతి మాటాడేటప్పుడు, ఇలాంటివి ఏమన్నా వుంటాయేమో నని గమనించడంలో ఒక వింత ఆనందం పొందుతాడు భాస్కరం.

"ఏం తప్పా. అటుకేసి చిత్తూరు, కడప, బళ్ళారి – అక్కడ ఇద్దర్ని ముగ్గుర్ని కట్టుకోడం మామూలే నీకు తెలవదు."

"పోషిం చొద్దా ఏం ? కట్టుకోంగానే సరా. ఏం, పార్వతి బాగుం దిగా"

"కట్టుకున్న వాళ్ళందరూ పెళ్ళాలు బాగలేకనే కట్టుకున్నారా ఏం. అదో సరదా–ఒక మోజు"

సీతారత్నం నవ్వింది.

"పిల్లలు లేకుంటే మరొత్తిని కట్టుకుంటారు కాబోసు. నీకేం-పిల్లలున్నారుగా" అన్నది సీతారత్నం. కాసేపు నిశ్శబ్దం.

"పార్వతమ్మ ఎంత మంచిది!"

"మంచిదే ననుకో. ఒక్క మంచితనం చాల్తుందా ?"

"ఏం, సక్కందేగా. ఊరోళ్లు సాలాసక్కందని సెప్పు కుంటారంట. ఆ చలమయ్య చెప్పాడు. మా నాగయ్య ఒకటే నవ్వు".

"ఎందుకో"

"అందరికీ తెల్సిన విషయం సెప్తాడేంటా అని—"

"ఓ, అదా"

ఇద్దరూ నవ్వుతున్నారు.

ఇంతలోకే దొడ్లోకొచ్చింది పార్వతమ్మ. గోడ కంతలోంచి వారిద్దరూ మాట్లాడుకోవటం చూసింది. ఆమెను వారూ చూశారు.

"నీ మాటే చెప్తోంది—సీతారత్నం" అన్నాడు భాస్కరం, భార్యని సంబోధిస్తూ.

"ఏం కథ— చీకట్లో నేల బాగాలేదు. పురుగూ పుట్రా లాంతరు తెచ్చేదా ?" అంది పార్వతి.

"నువ్వు సక్కందానివని ఊళ్ళో చెప్పుకుంటారంట. చలమయ్య చెప్తాడు" అంది సీతారత్నం.

"చలమయ్యకి నోటి దురద జాస్తిలె. తెస్తా—" అని లోపలికెళ్ళింది పార్వతి.

"ఇదిగో, ఇటుచూడు. చక్కందని దానికి తెలిస్తే చిక్కు. నేను లొక్కవుతాను, ఇంకెప్పుడూ అనమోక—"

"నిజం సెప్పకుండా వుండలేనుగా నీకు తెలీదా ఏం ?"

రెండు మూడేళ్ళలలో వారి అన్యోన్యం ప్రబలింది. వేర్వేరు యిళ్ళయినా, ఒక కుటుంబంలో వారిలాగే మెలగ సాగారు. భాస్కరం

అమాయకత్వం, మతిమరపు, వెఱ్ఱి ఊహలు భార్య చెప్తుంటే విని, నాగయ్య విరగబడి నవ్వేవాడు. నాగయ్య వ్యవహార దక్షత, లౌకిక విషయాల పట్ల శ్రద్ధ, ఖర్త చెప్తుండగా విని, పార్వతి మెచ్చుకునేది. ఆ నలుగురూ వొకర్ని వొకరు, హేళన చేసుకొనేవారు; మాటలతో దెప్పి పొడుస్తుండే వారు; వెక్కిరించుకునేవారు నలుగురూ. ఏదో సమయంలో కలిసి కబుర్లు చెప్పుకోకుండా ఏ రోజూ గడిచేది కాదు. ఒకరింటికి బంధువులు, స్నేహితులు వస్తే, రెండోవారు ఆ వచ్చినవారికి సదుపాయాలు సమకూర్చేవారు. వంట పదార్థాలు ఇచ్చిపుచ్చుకోడాలు, చేబదుళ్ళు పొలం వ్యవహారంలో సహాయపడ్డం— యివన్నీ జరుగుతూ వచ్చాయి.

పార్వతికి ఏడో మాసం— "కాన్పుకి పుట్టింటికి వెళ్ళ నక్కర్లేదు. పురుడు నేనే పోస్తా"నంది. సీతారత్నం— ఆనాటి సంభాషణ, భాస్కరం ఇంట్లో మండువా గదిలో పార్వతి పేరంటాని కెళ్ళింది.

"ఆళ్ళ ఊరు వెళ్ళడం దేనికేం— మేం అంతా లేమా ఏం ?" అంది సీతారత్నం.

"దానికి అక్కడే పోసుకోవాల నుంది. అమ్మా, నాన్నా దగ్గరుంటే ప్రాణం కుదుటపడ్తుందిట. దానిష్ట ప్రకారం చెయ్యవల్సిన వాణ్నేగా" అన్నాడు భాస్కరం.

"నువ్వు కానా మంచి మొగుడువేగా. నాగయ్యలాగ పీకులాట మనిషివి కావులే" అంది సీతారత్నం.

"అట్లా గుండటం— నీ ముంగలే ననుకో రత్నం—" అన్నాడు. రత్నం అని సంబోధించడం అదే మొదటి మారయినట్లు ఆమె ఆశ్చర్యం ప్రకటించలేదు.

"నాకు తెలువదా ఏం, భాస్కరం ?"

"తెలిస్తే, ఎప్పుడూ చెప్పలేదేం ?"

"ఏముందీ సెప్పానికి ?"

'సెప్పానికి' అనేవిధం, అతని కిష్టం. సీతారత్నం కేసి పరీక్షగా చూస్తున్నాడు- పరాయి దేశం స్త్రీ కేసి చూస్తూనట్లు. ఆమెది మధ్య పాపిడి- ముక్కుకి తిన్నగా, స్కేలు పెట్టి కొలిచినట్లు- మధ్యగా పాపిడి తీసి, జుత్తుని కిందికి బిగించి లాగి, జడగా అల్లి కొప్పుగా బిగిస్తుంది. ఆ పాపిడి కాస్తంత పక్కకుంటే, కాసిని వెంట్రుకలు, ఆ చెవుల మీద కమ్మితే బాగుంటుంది కదూ. కాని ఆ మాట పైకి అనలేదు భాస్కరం. ఆమెది పెద్ద బొట్టూ- రూపాయి- బిళ్ళంత. చెవులకి బుట్టలా వ్రేలాడే జూకాలు, మెదనిండా మూడు గొలుసులు, జిగిణీ నల్లపూసలు, బంగారు తొడుగు పగడాల ఆ గొలుసు బరువు రాపిడీ మెడమీద గీతలు పడ్డాయి.

ఏడు గజాల గళ్ళ చీర, చుట్టలు వేసి, బొత్తి కడుపు మీద అరటిపండులా మడిచి బిగించి ధరించింది. బిగుతుముడి చుక్కల రవిక; ఆ ముడి విప్పడం ఆమెకి సాధ్యపడుతుందా ? పార్వతి రవికా అట్లాంటిదే. ఆమె బొత్తాములు, పిన్నులు వాడుతుంది. స్త్రీల వేష ధారణ చిత్రంగా తోస్తుంది భాస్కరంకి. వయస్సులో తనకంటె సీతా రత్నం ఐదారు నెలలు పెద్ద. కాని ఆ విషయము మర్చిపోతాడు భాస్కరం.

"పార్వతి లేకుంటే తోచదు- నీకు దిగులు- కాదా ఏం ?"

"అవు ననుకో; అదోరకం దిగులు. నువ్వుంటే నాకేదిగులూ వుండ దనుకో"

"ఇ దేరకందో ?"

"ఇది అదో రకందిలే"

కాసేపు ఎవ్వరూ మాటాడలేదు. అతను బెంచి మీద నుండి లేచి, ఆమె కూర్చున్న చాప మీద కూర్చున్నాడు. అంధెలు, మట్టెలతో

బరువుగా కనబడుతున్న పాదాలమీదకి చీర మడతలు లాగి, వెనక్కి జరిగింది సీతారత్నం.

"మరిచాశ్మా రత్నం !" అని నిట్టూర్చాడు భాస్కరం.

"పార్వతి మతిమరుపు బాగా నేర్పింది నీకు. కావల్సిన వన్నీ సేసి పెడుతుంది. మారాజు బిడ్డ. మరి మరుపు లేకుండా పోతుందా ఏం? అయినా, ఏమిటి మరిశా ?"

"పార్వతిని మరిచా... అవును— నాగయ్యనీ."

"ముందుముందు నన్ను మరుస్తావా ? ఎప్పుడూ నీ ఎదురుంగా వుండాలి నేను కాదా ఏం ?" కనురెప్పలు దించేసింది సీతారత్నం. ఆమె కళ్ళకి కొంటెతనం ప్రకటించే అపురిక వుంది. ఆమె మాటలు వింటూ, ఆమె భావ ప్రకటన గమనించడానికి అలవాటు పడుతున్నాడు భాస్కరం.

"నీకు మాత్రం అట్లా వుండదా ?"

సమాధానం చెప్పదు. నవ్వుతుంది.

"ఏం, నేనంటే వేళాకోళమా ?"

కాస్త ముందుకి జరిగాడు.

"మీదిమీది కొస్తావేం, పాడుపిల్లడ" అని చివాలున లేచి, మెళ్ళో నగలు, వడ్డాణం సర్దుకుంది సీతారత్నం. ఒక్క గంతుతో దొడ్డివైపుకి నడిచింది. నగల ధ్వనిలో కూడా ఒక క్రమం, లయ వున్నట్లనిపించింది అతనికి.

ప్రతిరోజూ కలుసుకుని అట్లా మాట్లాడుకుంటారు. ఒక్కొక్క సారి అది వీలుపడకపోయినా చూసుకునేనా తృప్తిపడేవారు. ఈ రోజైపోయింది — రేపు, మరోసారి వొకర్ని వొకరు చూసుకుంటాం కదా అన్న తలంపుతో ఆ రాత్రికి కన్ను మూస్తారు. నలుగురూ వున్నప్పుడు, చూపులతో మాట్లాడుకుంటారు. ఆమె నవ్వినప్పుడూ, మూతి వంకరై

పెదాల చివర పళ్ళమీద ఎర్రరచిగుళ్ళు తళుక్కుమన్నప్పుడూ తనకేదో గొప్ప సందేశం యిచ్చినట్లు భావించేవాడు.

"మెడమీద – అదుగో అక్కడే ఆ చెవికింద ఆ మచ్చేమిటి ?"

"సిన్నప్పుడు, అటకమీదనుంచి మావయ్య తోస్తే పడ్డాగా."

ఇట్లాగ ముందువెనుక, సందర్భం లేకుండా, కంతులిచ్చుకున్నట్లు. ఒక్క నిమిషం సంభాషించుకునే సందర్భాలూ వుండేవి. పై వూళ్ళో టెంట్ సర్కస్ ఒకటొచ్చింది – నాలుగైదు మైళ్ళు. పార్వతి లేదు – పురిటికి పుట్టింటికెళ్ళింది. ఆ ముగ్గురూ, స్నేహితుడు చలమయ్య – అందరూ కలిసి రెండెడ్ల బండిమీద ప్రయాణమయ్యారు. సర్కస్ చూచి రాత్రి పదింటికి ఇంటికి బయలుదేరారు. బండిలో కునికిపాట్లు పడుతున్నారు. బండివాడి కేకలు, ఎడ్ల మువ్వలు, బయట కీచురాళ్ళ నాదం వినబడుతున్నాయి. బండి ఏదో గాట్లో పడింది. భాస్కరం ముందుకి – సీతారత్నం వైపు వొరిగాడు. ఆమె త్రుళ్ళిపడి, భాస్కరం చెయ్యి పట్టుకుంది. అదొక వింత స్పర్శ – పదిక్షణాలు. మళ్ళా దూరంగా జరిగి సర్దుకున్నారు.

ఆ పది క్షణాల స్పర్శవల్ల వారి అన్యోన్యం పెరిగింది. కాని ఆ మర్నాడు, తరువాత నాలుగైదు రోజులవరకూ, వారు సిగ్గుపడి, కలుసుకుని మాట్లాడుకోలేకపొయ్యారు – దూరంగా ఓ క్షణం, ఒకర్నొకరు చూసుకుని, ఏదో తప్పిదం చేసినవారికిమల్లే చూపు తప్పించి క్షమాపణ చెప్పుకున్నట్లు మసలేవారు. ఓ వారం జరిగాక తమింటికొచ్చి భోజనం చెయ్యవలసిందిగా, నాగయ్య కబురెట్టాడు. భాస్కరం రానన్నాడు – ఒకటి రెండు రోజులు తినొచ్చుగాని, నెలలు తరబడి అక్కడకొచ్చి తినడం భావ్యంకాదన్నాడు. సీతారత్నం వండి అతనింటికి పంపించేది.

సీతారత్నం గర్భవతి అయింది. ఐదోమాసం చూడాలనుంది ఒకసారి కనిపించమని భాస్కరానికి పసిపిల్ల చేత కబురంపింది. నాగయ్య

పొలంనుండి ఇంకా రాలేదు. సాయంత్రం అరైంది — మండువా గదిలో పరుంది. గోడమీద ఉడతల జంట పరుగులెడుతోంది. భోషాణం పక్క పంజరంలో రామచిలక ఏదో వాగుతోంది — పనిపిల్ల లాంతరు చిమ్నీ తుడుస్తోంది.

"ఏం పడుకున్నావే?" అన్నాడు భాస్కరం. ట్వీల్షుహోఫారం — కంటిమెడది; ధోవతి, పైన తువ్వాలు వేసుకున్నాడు, చామనఛాయ, స్ఫుటమైన ముక్కు, నుదిటిమీద ఒంపుతిరిగిన చోటు, రెండు గీట్లు, క్రమమైన పళ్ళ వరస - అక్కడక్కడ తాంబూలం డాగులున్నా, చిన్న మీసం, మధ్య పాపిడి — ఒంకులు తిరగక, సాఫీగా మొహాన అటూ ఇటూ జారిన క్రాపింగు.

"నిజమేట — వైద్యుడు చెప్పాడు." అన్నది సీతారత్నం. లోపలున్న కుర్చీ లాక్కొచ్చి, మంచం ప్రక్కనే వేసి కూర్చున్నాడు భాస్కరం.

"విన్నా."

ఆమె సిగ్గుతో మొహం పక్కకి తిప్పేసింది.

"ఆడదానికి ఇటాంటప్పుడు ఎయ్యో మనసులు పుడతాయి గాదా ఏం?"

"అవునవును."

"పార్వతిని సూడాలనుంది. తోసదంలా. వెంటనే రమ్మని మజూబూతిగా రాయి."

"మజూమూ తంటే?"

"తెల్దా ఏం—గట్టిగా అన్నమాట."

"ఓ."

"మరోటి. సర్కసులో ఖపూనోణ్ని చూస్తిమే — అడిషూదిరి మీసం తగిలించి కనబడరాదా ఏం?"

నవ్వుతున్నాడు. అదేం కోరిక?

రత్నం అదోకలా గుంది. మొహం విప్పారుకున్నట్లు కాస్తంత పెద్దదయినట్లు – మంచి దబ్బపండులా... యింతలోనే వచ్చాడు నాగయ్య – మొహానికి మీసాలు, ఎర్ర కోతిముక్కు, మూతిచుట్టూ తెల్ల రంగూ చిత్రాలుగల అట్టని తగల్చుకుని.

"బూచ్ అన్నాడు నాగయ్య.

"అదేం ఏషం?" అని అడిగింది.

"ఆనాడు సర్కస్‌లో చూసిన బఫూనోడి వేషం. గురవయ్యగారి తమ్ముడు తయారుచేశాడు ఈ అట్టని" అని అట్ట తొలిగించాడు.

"ఇహనేం – ఒక మనసు తీరిందిగా" అన్నాడు భాస్కరం.

"ఆ అట్ట నీ మొహానికి తగిలించుకో" అంది రత్నం.

భాస్కరం అట్టని తన మొహానికి తగిలించుకుని సర్కసులో బఫూన్‌లాగా గంతులు వేస్తున్నాడు. నాగయ్య, రత్నం నవ్వుకుంటు న్నారు. పనిపిల్ల దీపం వెలిగించింది.

తనకి తోలుబొమ్మలాట చూడాలనుంది. అంది సీతారత్నం భర్తతో.

'అయత్తు పరుస్తాలే' అన్నాడు నాగయ్య. ఆ రాత్రి అక్కడే భోజనం చేశాడు భాస్కరం. తనింటి కెళ్ళి పరున్నాడు.

నాలుగోనాడు ఏర్పాటు చేశారు తోలుబొమ్మలాట. పందిరి ముందు స్తంభాలకు తెర కట్టారు. వెనక కాగడాలు వెలిగించారు. బొమ్మల నీడలు తెరమీద పడుతున్నాయి. ఊళ్ళో జనం– ఆడా మగా, పిన్నా పెద్దా మూడొందల మంది మూగారు. రావిచెట్టు కింద, ఇంటి చూరుల కింద కూర్చున్నారు. మధ్య మధ్య గాడిదలు నిలబడి నిద్రపోతున్నాయి. అక్క డక్కడ కిటికీలోంచి లాంతర్లు సన్నగా వెలుగుతున్నాయి. రావిచెట్టు ఆకులు గాలికి రెపరెప లాడుతున్నాయి. ఆకాశంలో పల్చటి చందమామ ప్రసవించిన స్త్రీ మంచం మీద నుండి లేచినట్లు– మేఘం పొరలోంచి

లేస్తోంది. సీతారత్నం వినోదిస్తుంది. జుట్టు పోలిగాడు వచ్చినప్పుడల్లా విరగబడి నవ్వుతోంది. తన సంతోషాన్ని తెలియబరుస్తూ మధ్య మధ్య భాస్కరం కేసి చూస్తోంది. అతను రావిచెట్టు ప్రక్క దిమ్మమీద చాపేసుకుని, మరో దిమ్మకి జార్లబడి చూస్తున్నాడు నాగయ్య ఎదురిల్లు అరుగుమీద పడుకుని చూస్తున్నాడు. అప్పుడప్పుడు లేచికూర్చుని ఆవు లించి, మళ్ళీ పండుకుంటున్నాడు.

తెరమీద పోతురాజు, బంగారక్క వాదించుకునే ఘట్టం సాగు తోంది. రావిచెట్టు మీద పిట్టలు, కూస్తూ చెలరేగాయి. సీతారత్నం అటు కేసి చూచింది. దిమ్మమీద భాస్కరం లేడు. అక్కడ జనం పల్చబడ్డారు? పై నుండి పిట్ట రెట్టలు భరించలేక జనం మరోచోటికి తొలుగుతున్నారు. పక్కింటి అరుగు మీద జనం ఒక గుంపుగా లేచి, రోడ్డు మీద నడుచు కుంటూ పోతున్నారు. ఆ చూరుకింద భర్త నాగయ్య కూడా లేడు. ఆట నిలచిపోయింది. జనం అటూ ఇటూ వెడుతున్నారు. ఇదంతా ఏమిటని అడిగింది సీతారత్నం. తిమ్మడు పొలంకాడ గుడిసెలు, గడ్డివాములు తగు లడ్డాయట ఆర్పడానికి వెడుతున్నా రన్నా రెవరో. భాస్కరం కూడా అక్కడికే వెళ్ళాడా ? గబ గబ దొడ్లోంచి గోడ కంతలోంచి భాస్కరం ఇంటికెళ్ళింది సీతారత్నం. మండువాలో మంచం మీద నిద్రపోతున్నాడు భాస్కరం– ఆకాశంలో మబ్బులు దుప్పటిలా కప్పాయి చందమామని. చీకటిగా వుంది. లోపల గదిలో గాలికి లాంతరు ఊగిసలాడుతోంది. వొత్తి పెద్దది చేసింది. భాస్కరం మసగ్గా కనబడుతున్నాడు. మొహం నవ్వుతున్నట్లుగా వుంది. ఒక కంటిమీద రెప్ప పూర్తిగా వాలలేదు. శ్వాస బలంగా వినబడుతోంది. వేలుతో అతని కంటిమీదికి రెప్పను దించింది. అతను లేవలేదు. మంచం ప్రక్కనే కింద కూర్చుని అతనికేసి పరీక్షగా చూసింది. గాఢనిద్రలో వున్నాడు. లేపడం ఎందుకేం అనుకుంది. ఆమె కళ్ళంట నీళ్ళు తిరిగాయి అప్రయత్నంగా. తుడిచేసుకుంది– గాలి పెద్ద

దైంది. లాంతరు ఆరిపోయింది. దిండుకింద వున్న దుప్పటిని లాగి, దులిపి, అతని మీద కప్పింది.

'ఐండనిద్ర' అంది పైకి వినబడేటట్లు. అగ్గిపెట్టి కోసం అటూ, ఇటూ చూసింది కనబడలేదు. దొడ్డిదాటి యింటి కొచ్చేసింది. పెద్ద గాలీ, వర్షం ప్రారంభమైంది. తోలు బొమ్మల వాళ్ళు తెర మడిచేసి, సామానులు చూరు కిందకి జేరవేశారు. గాడిదలు నిద్రపోతూనే వున్నాయి. జనం తిరిగి వచ్చేస్తున్నారు.

"మనం ఆర్పేదేమిటి– భగవంతుడే ఆర్పేశాడు మంటల్ని– ఏం లేదు. గడ్డివాము– సూరపరాజు గొడ్లపాకాను–" అన్నాడు నాగయ్య.

భాస్కరం తడుస్తాడేమో– లోపల పండుకోమని చెప్పరాదా ఏం ?" అంది రత్నం.

నాగయ్య వెళ్ళాడు 'అవునుస్మా' అనుకుంటూ.

ఐదారు మాసాలు గడిచాక, పుట్టింటి నుంచి తిరిగొచ్చింది సీతారత్నం మొగపిల్ల వాణ్ని ఎత్తుకొని. ఆడపిల్ల నెత్తుకొని పార్వతమ్మ రెండు నెలల క్రితమే వచ్చింది. కొన్నాళ్ళకి ఆ పిల్లకి 'అలివేణి' అన్న పేరెట్టారు. సీతారత్నం కొడుక్కి 'సంగయ్య' అన్న పేరెట్టారు.

ఆ రోజు శుక్రవారం. భాస్కరం క్రాపింగ్ కత్తిరిస్తున్నాడు మంగలి. అద్దం చేతులో పెట్టుకొని చూస్తుంటే, సీతారత్నం తలంటు పోసుకొని జుట్టు ఆరబెట్టుకుంటున్న దృశ్యం కనబడుతోంది అందులో. చెవుల మీదికి వెంట్రుకలు జారాయి. అలా చెవులని కప్పిన జుట్టంటే భాస్కరానికి యిష్టం. ముందుకు తిరిగి దొడ్లో తిరుగుతున్న సీతారత్నం కేసి చూస్తూ కూర్చున్నాడు. ఇంకా మెడ నిండా నగలు అమర్చుకోలేదు. రెవిక కూడా తొడుక్కున్నట్లు లేదు. భుజాల వొంపు, స్థనాల ఎత్తు పిరుదుల గుండ్రదనం ఇవన్నీ వింతగా కనిపిస్తున్నాయి. ఆమె మరొక మనిషిలా కనబడుతోంది.

పార్వతీ అలాగే వుంటుందా ? తాను ఊహిస్తేనా పరీక్షగా

చూడాలి. స్నానం చేసి, బయట ఖాళీ స్థలంలో వేస్తున్న పాకవైపు కొచ్చాడు. దాన్నిండా నాగళ్ళు, బస్తాలు ఇటుకల గుట్టలు, పిడకలు, కట్టెలు వున్నాయి. ఒక మూలగా పాత నులక మంచం ఒకటుంది. దానిమీద కూర్చున్నాడు. కొత్తగా వేస్తున్న పాక పాత గోడని అనుకుని వుంది— నాగయ్యగారి పనిపిల్ల. అమ్మగారు రమ్మంటున్నారని కబురు తెచ్చింది— భాస్కరం వెళ్ళాడు.

పిల్లాడు సంగయ్య ఉయ్యాలతొట్టిలో వున్నాడు. కుర్రాడు ఊపుతున్నాడు. నాగయ్య ఊళ్ళో కెళ్ళాడు. సీతారత్నం మంచంబద్దీ మీద కూర్చుని వుంది. మెడలో రెండు మూడు గొలుసు లున్నాయి, రెవికతొడుక్కుంది. చెవులకి మాత్రం ఇంకా గొడుగుతోలకులు తగుల్చుకోలేదు. జుట్టు మెలితిప్పి సగం తవాలుతో బిగించి వెనక్కి తిప్పి కట్టింది. నుదిటి మీద వ్రేలాడే చిరు వెంట్రుకలు లేవు. నవ్వుతోంది.

"సూడాలనిపించింది- నీకు- నాకూ అంతే కబురంపా-"

అతనికి ఏమనాలో తెలీదు.

"తలంటుబోసుకొంటే జులాయిస్తుందిలే."

"అంటే ? !

"మైకంగా వుంటుందనుకో"

"ఎక్కడిదీ మాట ! పుట్టింటి నుంచి వొచ్చాక, ఏవో కొత్త కొత్త మాటలు వాడుతున్నావ్" అన్నాడు భాస్కరం.

"అక్కడ మా ఊళ్ళో మాటలు అట్లాగే వుంటాయి. దానిప్పగారు భలే కబుర్లు సెప్తుండాడు.

అతను నిలబడే వున్నాడు.

"యెండగొట్టబడి నట్టుండావు — ఇలా అసోదా వేసుకో" అంటూ చాపేసి, దానిమీద కంబళీవేసి, కూర్చోమని సంజ్ఞచేసింది. తనూ కూర్చుంది కంబళీమీద — మూలగా జరిగి డబ్బాలలోంచి తినేసరుకులు తీసింది.

"దబ్బా మీ పసివాళ్ళకి — పార్వతికి మిటాయి కొమ్ముంటే భలే ఇష్టం."

"ఈ పూట చాలా సల్తన చూపుతున్నావేం ?"

"అంటే ?"

"'దర్జ' అన్నమాట," అన్నాడు.

"నువ్వుకూడా కొత్త మాటలు వాడుతున్నావు కదా ఏం ?"

ఇద్దరూ నవ్వి, మౌనంగా వున్నారు.

"సెప్పనా, చిత్రం ఇదివరకు మాదిరి కాదు. ఏదో మారిపొయ్యాను. ఈ మధ్య నిన్ను గురించి ఆలోచించడమేలేదు. సూస్తే సూడాలనిపిస్తే - వెంటనే వొచ్చి సూడ్డమో, కబురుపెట్టి సూడ్డయో జరగాల్సిందే — నీకూ అంతేనా ?"

"అవును, ఇందాక తలంటుపోసుకొని జుట్టు ఆరబెట్టు కుంటు న్నావుగా. అప్పుడు సూడాలనిపించింది."

"చూ స్తివా. ఇట్టె గ్రహించా. అందుకనే కబురెట్టా పార్వతిని కూడా తీసుకురాలేకపొయ్యావా ?"

"పని చేసుకొంటోందిగా."

ఆమె లేచి వుయ్యాలతొట్టిలో పిల్లవాణ్ని ఎత్తుకుంది.

"అచ్చంగా నాగయ్య పోలిక కాదా ఏం ?"

"అవునవును. అచ్చంగా నాన్నే."

"కాసేపు ఎత్తుకు ఆడించు." అని పిల్లవాణ్ని అందించింది. తీసు కోవటంలో ఆతని చేతులు ఆమె స్థనాలకు తగిలాయి. సిగ్గుపడి తల పక్కకి తిప్పేశాడు. పిల్లవాణ్ని వదిలేశాడు. ఆమె తొడమీద ఆనింది బిడ్డ. కాళ్ళు నేలకి తగిలి. పిల్లవాడు ఏడుస్తున్నాడు.

"మంచివాడివే - ముగ్గురు బిడ్డల తండ్రివి — ఆడించటం చేత కాదా ఏం ?"

ఆమె తొడమీద వున్న పిల్లవాణ్ని స్పర్శించి సముదాయిస్తున్నాడు.

ఆ క్షణంలో గతాన్ని మరచినవాడివలె, జ్ఞాన తప్పి ఆమె తొడ మీద తన తలను ఆనించి. మొహాన్ని చీరమడతల్లో దాచుకొన్నాడు. తొడ వెనక్కు లాగి, తన చేతులతో అతని ముఖాన్ని పైకెత్తి, కళ్ళలోకి చూసింది.

అతని కళ్ళ నీళ్ళు, ఆమె కళ్ళంట నీళ్ళు తిరిగాయి.

"వొంటో బాగాలేదా ఏం ?"

అతనేమీ మాటాడలేదు.

కొంగుతో తన కళ్ళు తుడుచుకొంది సీతారత్నం. ఒకటి రెండు కన్నీటి చుక్కలు, వొడిలో పిల్లవాడిమీద పడ్డాయి.

"ఎందుకు — నీ కళ్ళు అట్లాగున్నా ఏం ?"

"నీ వెందు కున్నాయి ?"

"ఏమో !"

"నాకూ తెలవదు."

"ఇంక ఇట్లా ఎప్పుడూ జరుగకూడదు. అవునా ? అన్నాడు.

"టీకా వేసుకొందాం, జరుగలేదుగా—ముందూ జరుగదు. ఏం ?" అంది సీతారత్నం.

అదొకలాగయింది. మొగాడు ఏడవటం యేమిటి ?" అన్నాడు.

"పార్వతి ముంగల ఈ మాదిరి చేస్తివా ?"

"ఇలా చూసుకొంటూ కూర్చుంటే బాగుంటుందనుకో."

"నాకు తెలీదా యేం ? సూడకుంటే, ఒక్క రోజు గడవదుగా."

"మరి పుట్టింటి కెళ్ళినప్పుడు ?" అని అడిగాడు.

"ఇప్పుడొచ్చి సూస్తే ఎంత బాగుండును అని అనిపించేది. పైకనగూడదుగా. నా కెలా గనిపిస్తూందంటే — పార్వతీ, చెరొకపక్కా కూకుండి, మద్దెనే పంచుకొని, ఇద్దరి కళ్ళలోకి చూస్తూ కుడికంటితో ఎడమపక్క నున్నవోరిని, ఎడంకంటితో కుడిపక్క నున్న వారినీ, కన్నుసిల్లించి నవ్వించి, యేడ్పించటం అనుకో," అమాయకంగా నవ్వుతోంది. భాస్కరం పసివాడిలాగ నవ్వుతున్నాడు.

"నా కట్టాగ వుండదుస్మా — అటుపక్క నాగయ్య, ఇటుపక్క నువ్వు కూర్చునివుండగా మధ్యనే పడుకొనుండను"

"అనుకోకూడదనుకో - జొరమొస్తే ఏం చేస్తావు — నేనూ నాగయ్యా చెరొకపక్కా కాళ్ళకాడ పార్వతీ ..."

"ఏమో — నాకు ఒంటిగా. ఏ తోటలోనో కాలవడ్డున ఏ పాకలోనో ఆవులకేసీ, పశులకేసీ చూస్తూ కూర్చోవాలనుంటుంది — మనిద్దరం."

"మరి నాగయ్యో ? పార్వతి వద్దా ఏం ?"

"వాళ్ళూ వుంటారు. ఏమిటో నా కంతా గందరగోళంగా వుంది పోదూ" అన్నాడు భాస్కరం.

"నాకూ-బెబంధు నలుగురు వుండగా ఇడిగా వుండాలనుంటుంది — ఇడిగా వుంటే నలుగురూ వుండాలనిపిస్తూంది. యేమిటో చిత్రం."

మళ్ళా మౌనం — గులాబీలోకి ఎరుపురంగు చల్లగా జారిన నిశ్శబ్దం.

"మనకి మొదట్లో ఎప్పుడు కల్సిందంటా ఈ స్నేహం నీకు జ్ఞాపకం వుందా ?"

"లేదు, నేనా విషయం ఆలోచించనేలేదు. మనం ఎప్పుడూ ఇలాగే వున్నాం"

"నాకూ గుర్తులేదు, మొదట్లో గోడ కంతలోంచి అదొకలా చూసే వాడివి — అవున్నా ?"

"జామిచెట్టుకింద కూర్చుని, నవ్వేదానివి కావా ఏం ?"

"ఒకటి సెప్పనా, తోలుబొమ్మలాడినారే — ఆ ర్రేతి గుడిసెలు తగులపడ్డాయని పెద్దోళ్ళు వూళ్ళో కెళ్ళారు. నువ్వు పంశుకున్నావు. ఎట్లా గున్నావో చూద్దామనొచ్చి లాంతరు పెద్దదిచేసి చూశా— గుర్రట్టి నిద్ర పోతుంటే, లేపకుండా, దుప్పటి కప్పి వొచ్చేశా. నీకు సెప్పలా. ఆ రాత్రి కళ్ళంట నీళ్ళు తిరిగినై."

భాస్కరం లేచాడు, బైటికి నడిచి వెళ్ళాడు, పిల్లకోసం ఆమె యిచ్చిన మిఠాయికొమ్ముల డబ్బా తీసుకుని.

అట్లాగ, ఏడెనిమిదేళ్ళు గడిచాయి. ఒడ్డు కోయకుండా, వొడు

దుడుకు లేకుండా, సాఫీగా సాగిపొయ్యే రెండు పిల్ల నదులల్లే గడిచాయి వారి జీవితాలు. జలపాతాలూ, వరదలూ, ఎండిపోవటాలూ లేవు. ఉప్పొంగి వొడ్డుని చీల్చటం లేదు. ఒడ్డున పాతిన చెట్లు పెద్దవై నీడల్ని ప్రసరించినట్లు ఇరువురికీ సంతానం కలుగుతూ వచ్చారు. భాస్కరానికి ఆరుగురు- ముగ్గురు మొగపిల్లలు, ముగ్గురాడపిల్లలు, వొక పిల్లవాడు పోయాడు. ఇప్పుడు ఐదుగురు. సీతారత్నం సంతానం ఏడుగురు – ఇద్దరాడపిల్లలు, ముగ్గురు మొగపిల్లలు. పిల్లలు బండ్ల మీద, మూడుమైళ్ళ దూరంలో వున్న స్కూలుకెడతారు– అక్కడే భోజనాలుచేసి, ఆటలూ అవీ అయ్యాక మళ్ళా బండ్లమీద ఇంటికొస్తారు. కొన్నిరోజులు నాగయ్య, కొన్నిరోజులు భాస్కరం, పిల్లల్ని కూర్చోబెట్టి చదివిస్తారు.

రెండేళ్ళక్రితం, గ్రెగ్ కలెక్టర్‌గారి ధర్మమా అంటూ మైలు దూరంలో, రెండు గ్రామాలకీ మధ్య కొత్తస్కూలు అవతరించింది. గ్రెగ్ కలెక్టర్‌ను గురించి ఎన్నో కథలు చెప్పుకుంటారు. ఆయన విడిదిచేసిన చోటికి ఊరిపెద్దలు ఆయన దర్శనానికొస్తే, వారిమీదికి ఆయన కుక్కని వదిలేవాడట. అది, ఏమనిషి దగ్గరకెళ్ళి, తోకాడిస్తూ నిలబడుతుందో, ఆ మనిషిని దగ్గరకు రప్పించి పరామర్శించేవాడుట. పెద్ద మనుషుల్ని ఇట్టె పసికట్టేస్తుందిట ఆ కుక్క. స్కూలు కట్టించడంకూడా తమాషాగా జరిపాడుట. రెండు ఊళ్ళవాళ్ళూ, ఆ పని తమదికాదని వూరుకుంటే, ఒక ఊరివారి దగ్గర డబ్బు వసూలుచేసి, రెండో ఊరివారికి ఆ డబ్బుతో భవనం కట్టేపని వప్పగించి, నాలుగు నెలల్లో స్కూలు పూర్తి చేయించాడు. అది ఆ రెండు ఊళ్ళకి మధ్యలో కట్టారు.

సత్ప్రవర్తనచే, పేరూ ప్రతిష్టా గడించుకుని, ఊళ్ళో చిన్న చిన్న తగవులను, కోర్టుల కెళ్ళనీయకుండా పరిష్కారం చేస్తూ, పెద్దమనిషిగా ఎవర్ని నలుగురూ నిర్ణయిస్తారో, ఆ వ్యక్తికి ఒక బంగారు పతకం బహూకరించి గౌరవించేవాడుట గ్రెగ్. ఆ పతకం పొంది నాయన్ని,

మూడేళ్ళపాటు, పాఠశాలలో ఉపాధ్యాయుడుగా నియమించే వాడుట. అట్లాంటి వ్యక్తిని గ్రెగ్ మెడలు విరిచిన పెద్దమనిషని వ్యవహరిస్తూండే వారుట.

ఆ సంవత్సరం, ఆ గ్రెగ్ బంగారుపతకం చలమయ్య కొచ్చిందని వినగానే నాగయ్యా, భాస్కరం, ఆశ్చర్యపడ్డారు. వారిద్దరూ చలమయ్యని బాగా ఎరుగుదురు ఓ విధంగా వారికి స్నేహితుడుకూడా. చిల్లర పనులు చేసి పెడుతూంటాడు. ప్రొద్దుపోయి, పిల్లలింకా స్కూలునుంచి రాకపోతే, అతను వెళ్ళి తీసుకొస్తూ ఉండేవాడు. కథలూ, కార్యాలూ వస్తే, సరుకులు చేరవేసి ఆదుకునేవాడు. నిజమే; కాని మాటలపోగు. ఇక్కడి మాట అక్కడా, అక్కడి మాట ఇక్కడా చెప్పి స్పర్థలు పెంచేవాడు — తగవులు సర్దుబాటు చేసే పెద్దమనిషిగా చలామణీ అయి, యీ పతకం తెచ్చుకొని, మూడేళ్ళపాటు పిల్లలకి పాఠాలు బోధించే పరిస్థితి ఏర్పడినందుకు కాస్తంత నొచ్చుకున్నా, పైకి చెప్పే ధైర్యం వారిద్దరికీ లేదు.

ఆనాడు పూర్ణిమ. రాత్రి తొమ్మిదైంది. చిన్నపిల్లలు పడున్నారు. నాగయ్యా, పెద్ద పిల్లలూ, పార్వతీ రంగన్నగారి తమ్ముడూ పెండ్లి కెళ్ళారు. పెండ్లయింది. రాత్రి హరికథా, మేజువాణీ, భాస్కరం వెళ్ళలేదు దొడ్లో గోడ పక్కన కొబ్బరిచెట్ల కింద బెంచిమీద పడుండి ఆకాశంలోకి చూస్తున్నాడు.

"నువ్వెళ్ళలేదేం మేజువాణికి !"

ఉలిక్కిపడి లేచాడు భాస్కరం. సీతారత్నం తెల్లచీర, కొప్పులో మల్లెపూలు—చేతి గాజులు వెన్నెట్లో మెరుస్తున్నాయి.

"రా, రా."

బెంచి పక్కనున్న మంచం ముందుకు లాక్కుని కూర్చుంది.

"ఊరికే తలనొప్పి."

"గంధం పట్టీ వేసేదా ?"

"నువ్వే వొస్తివిగా, వేరే పట్టీ ఎందుకేం?"

"ఓయబ్బ"

"తాకకూడ దనుకున్నాం గాని, లేకుంటే చేతులో చెయ్యి వెయ్యనూ."

"ఇందు – ఏదీ – చెయ్యి." అని చెయ్యి చాచింది అతను చెయ్యి పైకి తీశాడు.

"అమ్మా!" అని చేతిని వెనక్కి లాక్కుంది.

ఈ ఏడెనిమిదేళ్ళల్లోనూ వారిలో కొన్ని మార్పులొచ్చాయి. సీతారత్నం కంఠం కాస్త స్థాయి పెరిగింది. తల్లో అక్కడక్కడ తెల్లవెంట్రుకలు మెరుస్తున్నాయి. రవిక ముడేసి బిగించడం బదులు, బొత్తాములున్న రవిక ధరిస్తోంది. చేతులు జబ్బలమీద కుంటాయి. రవిక మెడ కాస్తంత కిందికి దిగింది. లోలాకులుపోయి దుద్దులు, బొట్టు సైజు తగ్గింది. తల్లో పిన్నులు, చీర ఏడు గజాల్ది, కథా కార్యం వుంటే తప్ప వొడ్డాణం నిత్యమూ ధరించదు. మంగలి హెచ్చు తగ్గులు కత్తిరించాడన్న మిషమీద, మీసాలు తగ్గిస్తూ, ఈనాటికి పూర్తిగా తీసివేశాడు భాస్కరం. ఎడమ వైపు కింది పన్ను ఊడింది. అందుమూలాన బుగ్గకింద కాస్తంత సొట్ట పడింది. 'అట్లా గుంటేనే నీకు బాగుంటుందిలే'– అన్న రత్నం మాట ప్రకారం, ఆ పన్ను కట్టించుకున్నాడు కాడు భాస్కరం. నుదుటిమీద నాలుగో గీటుకూడా కనబడుతోంది, క్రాపింగ్ వెనక్కి జరిగింది. పాపిడి, పక్కకి జరిగింది. చొక్కాకి కాలరొచ్చింది. ధోవతి సైకిల్ కట్టులో కొచ్చింది. భాస్కరాన్ని చూసి; తనూ మీసం కూడా లాగెయ్యాలనుకున్నాడు. కాని నాగయ్యకి యింకా ఆ ధైర్యం రాలేదు. కోరమీసాలు కత్తిరించి, చిన్నసైజు మీసంతో తృప్తిపడ్డాడు. పల్చటి పంచి కట్టి, పొట్ట మీద ఎంత బిగించినా, బొజ్జ దాగదు; అదొక చింత. కాని దాన్ని గురించి ఎప్పుడ సందు చిక్కడంలేదు. నాగయ్య ఆర్థిక సిరి పెరిగింది. ారం సాగించే స్తోమత వచ్చింది.

"ఆ మధ్య ఆ వూళ్ళో వొక సభ జరిగిందిలే. అందులో ఒకాయన ఎంకి పాటలు పాడాడు. ఎంత బాగున్నా యనుకున్నావు! వెనక జన్మలో మనం ఎవ్వరమో అనంగానే కంట నీరు పెట్టుకుంటుందిట మనం వెనకజన్మలో ఎవళ్ళ మంటావు?" అన్నాడు భాస్కరం.

"నేను గాడిదను, నాగయ్య సాకలి. నువ్వేమో, ఒక కామందువి- నీ బట్టలుతుకేటందుకు అయ్యన్ని సాకలిమూట గట్టి నా నడుం మీద యేసి చెంగి చెంగి నడిపేవాడనుకో రాదా యేం?"

"ముందు జన్మలో ఏమౌతామో?"

"ఏం భాస్కరం, ఇవాళ అదోకలా మాట్లాడుతున్నా వేం?"

"మనం ఇలా ఒంటిగా కల్సుకుని మాటాడుకుని చాలా రోజు లయిందికదూ"

"అవును తీరదు. యేదో ఒకటి- పిల్లల స్కూళ్ళ క్తెలమో జబ్బులో- ఈ కొట్లు కట్టడంతో ఎవ్వరికీ వూపిరాడ్డంలా" అంది సీతా రత్నం.

నాగయ్య వ్యాపారం పెద్దదయి, పై వూళ్ళో కొట్లు కటిస్తున్నాడు. భాస్కరం, సీతారత్నం ఏకాంతంగా కలుసుకుని మాటాడుకునే అవ కాశాలు తక్కువ- రోజూ యేదో సందర్భంగా ఒకర్ని ఒకరు చూసు కుంటున్నా, కలిసిమాటాడుకునేటప్పుడు వారి పిల్లలో, వీరిపిల్లలో వూళ్ళో పెద్దలో- ఎవరో ఒకరు వుంటూనే వుంటారు.

"చెప్పవల్సిన నాలుగూ గబగబ చెప్పేయ్యి. మళ్ళా ఎవడో ఒకడు సిద్ధమవుతాడు" అన్నాడు భాస్కరం నవ్వింది సీతారత్నం.

"యేముంటై. మనస్సులో వుండిపోవాలని టీకా వేసు కుంటిమిగా. విను సెప్తా- ముక్కు పుడక తీసేసా- సూ స్తివా?"

భాస్కరం ముక్కుపుడక ఇదివరలో వున్నట్లే గమనించలేదు. అది ముక్కులో భాగమయిపోయింది.

"నిజమేస్మా"

"నువ్వా తీసేవుగా పీసం— నాగయ్యకూడా నరుక్కుంటూ వొచ్చాడు, పాపం..." అని నవ్వుతోంది.

లేచి అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు భాస్కరం.

తనూ లేచింది.

"వెళ్ళిపోతావా ?"

"అక్కడదాకా వచ్చి దిగవెడతావా ?"

"ఓ"

ఇద్దరూ గోడపక్క పాకలో కొచ్చారు. అక్కడ వెన్నెల సోకడం లేదు. చీకటిగా వుంది. కాలి కేదో తగిలి అతను తుళ్ళిపడి ఆమె భుజాన్ని తగిలాడు. ముందుకి పడకుండా కుడి భుజంపై చెయ్యివేశాడు. అతన్ని నిలబెట్టి, ఒకడుగు ముందుకి వేసింది. అతన్ని నులక మంచం మీద కూలబడ్డాడు. తన నడుం చుట్టూ ఉన్న అతని చేతుల్ని తొలిగించి, వెన్నెట్లో నిలబడింది.

"ఎందు కట్లా గయ్యావు ?"

"కాలి కేదో తగిలింది- నిజం."

"నాకు తెలుసు. వొంటిగా వున్నప్పుడు మరీ పదిలముగా వుండాలనుకొంటిమి గాదా ఏం ?"

"పెద్దయినకొద్ది మతిమరుపు జాస్తి అవుతుందిగా"

"కోపమా ?"

"ఆ నిక్కచ్చి చేసింది నేనేగా"

"మరిసినప్పుడలా జ్ఞప్తి చేసింది నేను కాదా ఏం ?"

నిశ్చలంగా పడింది నేలమీద ఆమె నీడ. దాన్ని చూస్తున్నాడు, అచ్చం ఆమెలాగే వుంది ఆమె నీడ అందులో రంగులు, గుండ్రదనం, నునుపు కరుకుదనం— చూపు ద్వారా తెలుసుకున్న స్థూలత్వం— అన్నీ అందులో వున్నట్లు భ్రమపడతాడు.

నాగయ్యకూడా నీ మాదిరే మంచంపైన కూలబడితే లేవలేదు లే," అని పట్టుకోసం చెయ్యిచ్చింది.

"అంత ముసలాన్ని కానులే" అంటూ లేచాడు.

"ఓ యబ్బ ! భాస్కరంగారికి సూర్యుడంత రోషం."

ఇద్దరూ ఆమె ఇంటివైపు నడుస్తున్నారు.

ఇద్దరి నీడలూ తాకుతూ, విడిపోతూ, మళ్ళా రెండూ ఒకటవుతూ— ఒక పెద్ద నీడ ఆకృతి లేకుండా, మబ్బు మేఘాలవలె సాగిపోతున్నాయి. గుమ్మం దగ్గరికి చేరుకున్నారు.

"తలకి పట్టీ వేసేదా ?"

"వద్దులే"

"నిలబడు" లోపలికెళ్ళి సీసా తెచ్చింది. అందులో అంజనం వేలుతో తీసి అతని నుదుటికి రాసింది, వేళ్ళతో కనుబొమలమీద రాస్తూ నొక్కిపట్టి సర్దుతోంది.

"ఇంక చాల్లే" అన్నాడు.

"నిశ్చింతగా పండుకో" అని లోపలికెళ్ళింది. అతని వొంటి నీడని బరువుగా మోసుకొస్తూ పాకదాటి బెంచి దగ్గరకు రాగానే ముందు గోడ తలుపులు తోసుకుని చలమయ్య చక్కావచ్చాడు. అతని వయస్సు నలభైయైదు. యెత్తుగా బొద్దుగా వుంటాడు. పెద్ద మీసం, పెద్ద ముక్కు, పెద్ద కను బొమ్మలు, భీకరంగా కనబడినా, కంఠం సన్నంగా వినబడు తుంది. నిదానంగా మాట్లాడుతాడు. అందువలన సాత్వికుడల్లే కన బడతాడు.

నువ్వు రాలేదేం— మేజువాణికి ?

"దా, దా. కూర్చో తలనొప్పి బద్ధకంగా వుంది. ఇంత దాహం తెచ్చేదా ?" నులకమంచం బైటికి లాగి కూర్చున్నాడు. "పాలికాపును నాలుగు బొండాలు కొయ్యమన్నాను. అడుగో మాటలో వచ్చాడు" పాలేరు కొబ్బరి బొండాలు మూతులు తీసి ఇద్దరికీ యిచ్చాడు. నీళ్ళు త్రాగు తున్నారు.

"రత్నంకూడా రాలేదుగా" అన్నాడు చలమయ్య.

"అవు నవును"

"నే అనుకున్నాలే"

"అంటే ?"

"చూడు భాస్కరం — ఎప్పటినుంచో నీతో చెబ్దామనుంది కాని వీలు చిక్కలా, ఇప్పుడు చెప్పనా ?"

పాలికాపుని పొమ్మన్నాడు. వాడు వెళ్ళాడు.

"ఇప్పుడు నాగయ్య లోపల్నుంచి వస్తున్నావు, అవునా?"

"అవును. రత్నాన్ని దిగబెట్టి—"

"ఇం కింటో ఎవ్వరూ లేరు — పార్వతి లేదు, నాగయ్య లేడు — సరేనా ?"

"చెప్పు"

"ఏమిటర్థం ?"

"ఇవాళ కొత్త కాదుగా"

"అదే వచ్చింది పితలాటం. రావిచెట్టు క్రింద ఊళ్ళో వారికి కాలక్షేపం, మీ ఇద్దరి ముచ్చట్లే."

"నేనూ, సీతారత్నమూనా ? ఎన్నాళ్ళనుండో ఇలా వుంటున్నాం. ఇప్ప డేమొచ్చిందీ ఊళ్ళోవారికి?" అన్నాడు భాస్కరం, బెంచి ముందుకు లాగి దగ్గరగా జరుగుతూ.

"ఇప్పుడే రాలేదు, నాలుగైదేళ్ళుగా వుంది యీ రొద. మొదట్లో నేను నమ్మలా, కూక లేశాను. గుస గుసలల్లా గొంతులు లావయ్యాయి. మర్రిచెట్టు కింద పేపరు చదవడం అయినాక మీ ముచ్చట్లే, మొన్న ఓర్సీలుగారింటి కెళ్ళాను. పై వూర్లో— ఆయకట్టు సందర్భం చేసుకొద్దామని, అక్కడ టోపాత్ గుమాస్తా, లస్కరు, మేస్త్రీ—ఇదే ముచ్చట 'ఆయన భార్య, పార్వతి రూపసిటగా ?' అని ఆశ్చర్యం ప్రకటించాడు ఓర్సీలు. ఇది మీకు మంచి పనేనా—పిల్లల తండ్రివి నాగయ్య మోతుబరి — ఊరి పెద్ద. తలెత్తు—చూడు—మాట్లాడవేం ?"

కాసేపు నిశ్శబ్దం. చందమామ మీది సన్నటి మేఘం పొరలా కమ్మింది వేసంగిలో ఉదయపు చలికి, సిల్కు బట్ట కప్పుకున్నట్లు.

నిట్టూర్చాడు.

"తగునా అంట ?"

"మా యిద్దరి మధ్యా ఏం లేదు చలమయ్యా. ప్రమాణం చేసి చెప్తున్నాను – చేతిలో చెయ్యి వేస్తాను. దైవసాక్షి."

"నిప్పు లేంది పొగ రాదు భాస్కరం."

"నువ్వు నమ్మాలి. గ్రెగ్ మెడలు పొందిన పెద్దవి. నిజంగా ఏమీ లేదు. స్నేహంగా వుంటాం – వాస్తవమే. నువ్వూ ఎరుగుదువు. చూసుకుంటూ, కబుర్లు చెప్పుకుంటాం అంతే. ఇది నాగయ్యకీ తెలుసు, పార్వతికీ తెలుసు. వారెప్పుడూ ఇట్లాంటి మాట అనలేదే !"

"ఊరికే కూర్చుండి, మాట్లాడుకుంటారా గంటలు గంటలు ?"

"అవును– గంటలు గంట లేమిటి ! ఇంచుమించు పన్నెండేళ్ళుగా యిట్లాగే వున్నాం."

"ఇది కలియుగం– నేను నమ్మినా, ఊళ్ళో జనం నమ్ముతారన్నది కల్ల– పిన్నా, పెద్దా, ఆడా, మగా కోడై కూస్తున్నారు. నీకు రత్నం అంటే యిష్టమేనా?" అన్నాడు చలమయ్య.

"చాలా ఇష్టం. ఆమెకీ నే నంటే చాలా యిష్టం. నాకు పార్వతంటే ప్రాణం; రత్నంకి నాగయ్యంటే ప్రాణం; నాగయ్యకి నే నంటే యిష్టం. పార్వతికి నాగయ్యంటే ఇష్టం— అందరం. అందరం అంటే పడి చస్తామనుకో– నువ్వూ ఎరుగుదువు, ఇదేమిటో ఇదంతా తికమక వ్యవహారమనుకో– ఒకర్నొకరు చూసుకోకుండా ఒక్కరోజు గడవదు. మేం బాగుండటం ఊళ్ళోవారికి గిట్టదా ఏం?"

లేచాడు చలమయ్య.

"చెప్పవల్సింది చెప్పాను. ఊళ్ళో యీ గొడవ మాటుమడిగేలాగున నడుచుకునే భారం మీపైన వుంది. అదెలా సరిపెడతారో."

"ఏం చెయ్యమంటావు– చావాలి అంతే."

"అదేవన్నముక్క - బ్రతికి సాధించాలి."

వెళ్ళాడు చలమయ్య.

భాస్కరం కళ్ళల్లో మంటలు రేగుతున్నాయి — కనురెప్పకింద ఎవరో చిచ్చుపెట్టినట్లు.

నూనెతో ముంచిన కాగడా— కళ్ళు గట్టిగా మూసుకున్నాడు. ఈ ముక్కలు చలమయ్య నోటంట వినాల్సి వచ్చినదా? చలమయ్య తలలు మార్చే రకం; ముళ్ళెదతాడు, మనసులు విరిచేస్తాడు. అతని ఆగడాలు, దురంతాలు చెప్పుకుని నవ్వుకున్నారు. గ్రెగ్ మెడలు ఎవరి కియ్యాలి అన్న ప్రశ్న వచ్చినప్పుడు చలమయ్య పేరు చెప్పకూడదని కూడ బలుక్కున్నా, తీరా సమయం వచ్చేసరికి ఇద్దరూ అతని పేరే చెప్పారు అదేం చిత్రమో! ఆ సంగతి తెల్సుకుని ఇద్దరూ నవ్వుకున్నారు కూడా.

తనకీ, రత్నంకీ ఏదో వుందని చలమయ్య చెప్తాడా? వీడేం మంచివాడని! ఆ సూరయ్యగారి కూతుర్ని మరిగి, చెరచలా? ఆ పిల్లకి కడుపు రావడం, లబోదిబోమని పై ఊరెళ్ళి తీయించుకుని గప్‌చిప్ అయిన సంగతి ఎవ రెరగరూ. అట్లాంటివాడు తన నీ మాటంటూడా? వీడికి గ్రెగ్గు దొరగారు బంగారు పతకం యిస్తాడా? ఈ తెల్లవాళ్ళు నమ్మకూడదు గాంధీగారి గుంపులో చేరకుండా, పెద్దల్ని మంచిచేసుకునేందుకు ఈ మెడల్సూ అవీ యివ్వడం. ఈ దొరలు దేశాన్ని పాడుచేసేస్తున్నారు. అందుకనే గాంధీగారు వాళ్ళని తరిమెయ్యడానికి కంకణం కట్టుకున్నారు. ఉపాసాలుట, విదేశీ బట్ట తగలెట్టాలంట; మీటింగులంట— లాఠీచార్జీలు — జైలు కెళ్ళడాలు— ఇవన్నీ ఎందుకు? చలమయ్యకి మెడలిచ్చి మంచి చేసుకున్న గ్రెగ్గు దొరల్ని తరిమెయ్యడానికి; తను కూడా ఈ గాంధీగారి పార్టీలో చేరిపోవాలి.

ఏమిటో ఇన్ని అనుకున్నా భాస్కరానికి సమాధానం కుదరడం లేదు.

చలమయ్య పేరు చెప్పిన వారిలో తనూ వున్నాడుగా గ్రెగ్గునేం లాభం? పైగా కూత కూస్తుంది ఊళ్ళోవారు, చలమయ్య కాడుగా. వాళ్ళ

కెందుకు ? వాళ్ళేం చూశారు ? చలపయ్య బోటిగాళ్ళు చెప్పకపోతే వాళ్ళకేం పట్టింది. మర్రిచెట్టు కింద లోకాభి రామాయణం ?

ఊరికి నిప్పు పెట్టాలి. నిప్పంటేగాని పొగ రాదుట నాగయ్యతో చెప్పాలి. చెప్పి ఏం లాభం ? అతనేమను కుంటాడు- అతని మనస్సు చెడిపోదూ ! రత్నంతో చెప్పాలి. గబ గబ లేచి నాగయ్య ఇంటి కెళ్ళాడు భాస్కరం.

తలుపుతోసి వరండా పక్కగదిలో కెళ్ళాడు. భోషాణం పక్క లాంతరుంది. పంజరంలో పిట్ట కళ్ళు మూసుకుంది. భోషాణం కింద నుంచి రెండు ఎలుకలు పరుగెత్తాయి ఉలిక్కిపడ్డాడు. లాంతరు పైకెత్తి మంచ ముపై పరున్న సీతారత్నాన్ని చూశాడు. నిద్రపోతోంది. పమిట జారింది. రవిక రెండు బొత్తాముల మధ్య బిగుతై ఏర్పడిన రంధ్రం ఆకులా కన బడుతోంది. శ్వాస వినబడుతోంది— లేపడానికి చెయ్యి పైన వెయ్య బొయ్యాడు. ఆమె లేచి ఏమంటుందో— ఆ సమయంలో నాగయ్య వస్తే ఏమనుకుంటాడో— చెయ్యి దించేశాడు. మెల్లగా వెన్నెట్లో కొచ్చేశాడు.

పార్వతీ, పిల్లలూ ఇంటికొచ్చారు.

"ఆ ముక్కుపుడ కేమిటి ?" అన్నాడు.

"రత్నంది— పెట్టుకోమంది- బాగుందా ?" నవ్వొస్తుంది ఆడ వాళ్ళ వ్యవహారాలు చూస్తే. పడుకున్నాడు భాస్కరం. పది నిముషాల్లో ఒకటి రెండు నిర్ణయాలు చేసుకున్నాడు. దానితో బరువు తగ్గింది. కంటిలో కాగడాలు చల్లారుతున్నాయి. నుదుటిమీద అంజనం ఆరి పోతోంది. ఒళ్ళు తెలీని నిద్ర పట్టేసింది.

* * * *

రెండు మూడు వారాలు గడిచాక సీతారత్నంతో ఏకాంతంగా గడిపే అవకాశం దొరికింది. పార్వతి, వాళ్ళ బాబయ్యగారి తాలూకు ఎవ రిదో పెండ్లికి పై ఊరెళ్ళింది చిన్నపిల్లల్ని ఇద్దర్నీ తీసుకుని. వంటకు దూరపు చుట్టం రంగమ్మ, స్కూలు కెళ్ళే పిల్లలూ తనూ వుంటారు. నాగయ్య ఇంజనీరుగార్ని చూడ్డానికి బస్తీ వెళ్ళాడు. సాయంత్రం అయింది. పిల్లలు పెద్దమ్మతో కలిసి నాటకం చూడ్డానికి పొయ్యారు వెళ్ళారు

రంగమ్మ ఆలయంలో పురాణం చెపుతుంటే వినడానికెళ్ళింది. సాయంత్రం ఆరు దాటింది. చీకటి రాత్రుళ్లూ, చలిరోజులు— సంధ్యాదేవి ఎర్ర చీర ధరించి ముస్తాబై గుమ్మంలోకి రాగానే ఎవరో గుమ్మం తలుపులు మూసినట్లు, ఆకాశంలో చీకటి అలుముకుంది. కొబ్బరిచెట్ల కింద పచార్లు చేస్తున్నాడు భాస్కరం. ఏదో చప్పుడయింది. ఎవరో చప్పట్లు కొడుతున్నారు. పక్కకు తిరిగాడు. నాగయ్యగారి దొడ్లో జామచెట్టు కింద రెండు కుక్కలు చేరాయి. ఆడదీ, మగదీ— ఒకటి మీది మీది కొస్తూంది. రెండోది అయిష్టంగా మొఱిగి తప్పుకుంటోంది. వాటిని బయటికి తరిమే ప్రయత్నములో వుంది సీతారత్నం. అవి గోడవతలకి వెళ్ళాయి. భాస్కరాన్ని రమ్మని సంజ్ఞ చేసింది.

మండువా గది దాటి ఖాళీ స్థలంలో కొచ్చాడు. అక్కడ మడత మంచం వాల్చి కూర్చున్నాడు. పంజరంలో పిట్ట వూరికే అరుస్తోంది. సీతారత్నం లోపల్నుంచి, రెండు డబ్బాలు తెచ్చి, వాటిల్లోంచి తినుబండారాలు ఆకులో వేస్తూంది. కొన్ని పూతరేకులు, కజ్జికాయలు, గవ్వలు, లడ్లు—

"తిను. మా వోళ్ళు పంపారు. ఈ డబ్బా అబ్బాయిని తీసికెళ్ళమను"

"సీతో ముఖ్యమయిన విషయం మాటాడాలి రత్నం" అని ప్రారంభించాడు భాస్కరం, గొంతు సవరించుకుని.

"తింటూ చెప్పకూడదా ఏం !"

ఆ పదార్థం ఏమిటో తెలియకుండా— ఒక్కొటొక్కటి నోట్లోవేసుకుంటున్నాడు.

"ఇలా కూర్చో"

"కూర్చుంటాలే" అని ఎత్తు కాళ్ళపీట లాక్కుని మంచం దగ్గరగా కూర్చుంది. అటూ ఇటూ చూస్తున్నాడు.

"ఇది రహస్యం"

"మనకి రహస్యా లేముంటాయి !"

"మనిద్దరి మధ్యనా యేదో వుందిట- ఊళ్లోవారను కుంటున్నారుట..."

తల వెనక్కి వ్రేలాడేసి, పడిపోకుండా— అరచేతులు మెడ వెనక బిగించి నవ్వుతోంది సీతారత్నం.

"నవ్వుతావేం ?"

నవ్వు ఆపుకుంది.

"నీక్కోపం రాలేదూ !"

"ఉందిగా— ఉన్న యిషయమే వాళ్ళు సెప్పుకుంటున్నారు. కోపం దేనికేం ?"

"ఉత్తుత్తి వుండటం కాదు. నిజంగా ఉండటం..."

"అంటె !"

"ఉంచుకోవడం..."

మళ్ళా నవ్వుతోంది.

"ఇది నవ్వుతాలు కాదు. చలమయ్య చెప్పాడు. మనిద్దరి మధ్యనా యేమీ లేదని ప్రమాణం చేసి చెప్పాను"

"ఆఁ ఉంచుకోవడమా ?... చలమయ్య పెట్టుకున్నాడుగా..."

"ఆ పిల్ల వెళ్ళిపోయింది"

"నాకూ తెల్సు- మరోదాన్ని పెట్టుకున్నాడు"

"నిజం !"

"ఈ ఊర్లో యేది జరిగినా, నాగయ్యకి తెలవకుండా జరుగుతుందా యేం ?"

"మన విషయం ఊర్లో వాళ్ళు చెప్పుకుంటున్నట్లు నాగయ్యకి తెలుసా ?"

"నే నడగలా— ఆయన చెప్పలా"

"మనిద్దరి మధ్య యేమీ లేదని నువ్వు ఒప్పుకుంటావా ?"

మళ్ళా నవ్వుతోంది. కొప్పు వూడింది. జడపాయలుగా భుజంమీధికి

జారింది. దగ్గరగా చేర్చి, అర్లీ ఒకటిగా సర్దుతోంది. ఆ మసకలో తెల్ల వెం(డుకలు కనబడ్డంలేదు.

"ఉండు— దీపం తెస్తా" అని లేవబోయింది సీతారత్నం. "తేవద్దు" అని చెయ్యి పట్టుకుని కూర్చోపెట్టాడు.

"చెయ్యి చేసుకుంటున్నావే!"

"చేసుకుంటాను. ఆ నిర్ణయాని కొచ్చా".

"అంటే ?"

"చూడు రత్నం. మనిద్దరి మధ్య యేమీలేదు— స్నేహముగా ఉంటున్నాం— చూసుకుంటున్నాం— కబుర్లు చెప్పుకుంటున్నాం... పది పదిహేనేళ్లుగా ఏదో వుందని నోరు పారేసుకుంటున్నారు, ఊరి జనం— వాళ్ళని మనం యేమీ చెయ్యలేం. వాళ్ళు అలా చెప్పుకోటం ఎలానూ మానరు— కాబట్టి మనిద్దరి మధ్య యేమీ లేకుండా ఎందుకుండాలి ?"

"మనం ఇట్లా ఉండటం వాళ్ళకోసం కాదుగా" అంది.

"వాళ్ళు అలా అనుకుంటున్నారు గనుక— మనం మాత్రం ఎందు కూరుకుంటం? మంచివాళ్ళమన్న పేరు దక్కలేదు— ఇదీ దక్కలేదు..." ఆమె రెండు చేతులూ పట్టుకున్నాడు.

"ఇప్పుడే వొస్తా" అని విడిలించుకుని లోపలికెళ్ళి లాంతరు తెచ్చింది. దాహం తెచ్చి తాగమంది.

"ఏం నేనంటే ఇష్టంలేదా ?"

అతనికేసి విగులుగా చూసింది. అతని కళ్ళల్లో తడి మెరుస్తూంది.

"ఇష్టమూంది. అందుకనే ఒద్దనుకుంటిమి—"

"అదేమన్న మాక్క ?"

"టికా చేసుకుంటిమిగా. ఇదే బాగుంది మనకి సీకూ సింతాలేదు. ప్రాణం సహాయమనుకో, ఊళ్ళో వోరేమనుకుంటె మనకెందుకు—మన మనఘ్సులే సాక్షం."

"కాదు. నా మనస్సు పాడయింది. నిన్ను ఒదులుకో లేను. ఒచ్చిన

పేరెల్లానూ ఒచ్చింది. ఇంక తెగిద్దాం..." అంటూనే భాస్కరం తన మొహం ఆమె ఒడిలో వాల్చాడు. చీర మడతల్లోంచి పొత్తికడుపు మందం తెలుస్తూంది కాని— చర్మం స్పర్శ తగలడంలేదు. కంగారుపడి సర్దుకుని అతని తలని పైకెత్తి తను లేచి నిలబడింది సీతారత్నం.

"పసివాడివా భాస్కరం?"

దూరంగా వెళ్ళి ప్రక్కకు దిరిగి, చీరబిగిస్తూంది. దీపం వెలుగులో పొట్టమీద చారలు కనబడుతున్నాయి— రేగడి గట్లను వరదనీరు పాయలుగా కోసినట్లు—

"ఏం, ఇష్టంలేదా ?"

"కానా ఇష్టం— అంటావుగాని నీకు మట్టుకు ఈ మాదిరుండటం, యిష్టంలేదని, నాకు తెల్దా ఏం! ఊళ్లో వారిమీద కోపంవల్ల, మనం కోతు లవుతామా, ఏమరపాటున యే చెయ్యో, భుజమో తగిలితే నువ్వు మాత్రం ఇదిలించి పారెయ్య లేదా ఏం ?"

పని పిల్లొచ్చింది— కిరసనాలు డబ్బాతో.

బట్టల మూట దించాడు చాకలి.

దూడల్ని కట్టేస్తున్నాడు చిట్టిగాడు.

"పనులు చూసుకురానా ?"

భాస్కరం తనింటి వైపు వెళ్ళాడు.

ఆ ఏడాదిలో పది పన్నెండుసార్లు వారిద్దరూ ఒంటిగా కల్సుకుని మాటాడుకునే అవకాశా లొచ్చాయి. ఊర్లో ఆ రకం అపవాదు ప్రబలింది గనక, అన్న ప్రశ్నని ఎన్నోసార్లు వితర్కించుకున్నారు.

"ఈ వయస్సులో యేమిటి?" అంటూంది సీతారత్నం.

"యిప్పుడే కావాలి. చిన్నప్పుడు అదేమిటో తెలీదు" అంటాడు భాస్కరం.

"పిల్ల లెదుగుతున్నారు" అంటుంది.

"వారికి మన గొడవ లేదుగా" అంటాడు.

"మననులు పాడుచేసుకుంటామా ?" అంటుంది.

"ఊర్లోవాళ్ళు ఎలానూ చెడగొట్టారుగా" అంటాడు.

తన ఉద్దేశం ప్రకారం ఆమె నడచుకోదలచకపోతే తనకి ఊళ్ళోంచి వెళ్ళిపోవడంతప్ప గత్యంతరం లేదన్న నిర్ణయం బైటపెట్టాడు భాస్కరం, మరుసటి సంవత్సరం.

"వాకబు చేశా- ఒకాయన పట్నంలో ఉద్యోగం ఇప్పిస్తానన్నాడు. ఇక్కణ్నించి మకాం ఎత్తేస్తా. వీళ్ళ నోళ్ళు కట్టడుతై. పీడ విరగడై పోతుంది" అన్నాడు.

ఆమె నవ్వింది.

"ఆళ్ళకి మరీ అలుసైపోదూ- యేదో వుండబట్టే, హూవలి పారి పొయ్యారనుకోరా యేం?" అంది రత్నం.

మరో నాలుగు నెలల తర్వాత.

"పార్వతితో చెప్పేసి- ఒప్పించి ఉద్యోగంలోకి పోతా అన్నాడు.

"పార్వతి ఒప్పుకోదు. నేను ముంగలే చెప్పేశాను- మీ రెల్తానికి వీల్లేదని"

"యేమంది ?"

"ఇప్పుడెక్కడికి పోతం- ఎందుకు పోతం అంది - ఊ ఒకటే నవ్వులు"

మరో రెండు నెల లయ్యాక.

"ధరకాస్తు పడేస్తున్నా"

"నన్ను విడిసి నువ్వెళ్ళగలవా ఏం మహా-"

"లేకపోతే. గాంధీగారి గుంపులో చేరి లాఠీ దెబ్బలు తిని జెలుకు పోతా."

'అమ్మో- జైలే : మరి సూడ్డం ఎల్లాగా ?"

'అప్పుడప్పుడు చూడడానికి రానిస్తారుట.'

భాస్కరం తెగించి ఏదీ చెయ్యలేకపొయ్యాడు. కొత్త పనులు

కల్పించుకుని వాటిల్లో నిమగ్నుడయి అన్నీ మరిచిపోవడానికి కృషి చేస్తున్నాడు. ఊళ్లో పిల్లల్ని పిలిచి, 'రాత్రి బడి' పెట్టి పాఠాలు చెప్పడం మొదలెట్టాడు. ఒక రాట్నం కొని నూలు తీయడం పెట్టుకున్నాడు. ఖద్దరు దుస్తులు ధరిస్తున్నాడు కాలవమీద వంతెన వేయించాలని, నలుగుర్నీ కలుసుకుని, 'అర్జీలు' పెట్టిస్తున్నాడు. ఒకటి రెండు నెలలయ్యాక నాగయ్యకి జబ్బుచేసి నిమ్మళించింది.

ఏదో వనసంతర్పణ ఏర్పాటు చేశాడు నాగయ్య. వోమారు భాస్కరం వెళ్లి, యేదో పనుందంటూ గంటలో ఇంటి కొచ్చేశాడు. ఇంట్లో ఎవ్వరూ లేరు—గొడ్లపాక దగ్గర నాగన్న తప్ప మండువాగది మంచం మీద పడున్నాడు భాస్కరం. నిద్ర పట్టేసింది ఎవరో పలకరించి లేపినట్లయింది. కళ్ళు నులుముకుంటూ లేచాడు. సీతారత్నం మంచంపక్కన బల్లమీద కాళ్ళవైపు కూర్చుని, మంచం బద్దెమీద చేతులానించింది.

'ఏం అప్పుడే అయిపోయిందా'

'ఒచ్చేశావేం ?'

'పనుందిలే'

'నిద్రేగా. నాకు తెల్సులే ! నీకు కోపం మామీద'

'మీమీ దెందుకు ?'

"నాకు తెల్సు, నీకూ తెల్సు. ఊళ్లోనుంచి పోతానంటావుగా."

"మళ్లా ఇప్పుడు ఆ మాటలన్నీ ఎందుకులే" అన్నాడు. కొంచెం దగ్గరగా జరిగింది తొలిగి, దూరంగా కూర్చున్నాడు. కాసేపయ్యాక లేచి, బద్దిమీద ఆనుకుని నిలబడ్డాడు.

"కోపం పోగొట్టేదా" అంది సీతారత్నం.

"నాకు యే కోపమూ లేదు – నువ్వు పోగొట్టనా వద్దు."

"నే నిక్కడ కొచ్చి చాలా సేపయింది తెల్సా—నువ్వు తోటలో కనబడలేదు. యిక్కడుంటావని – వచ్చాను. అట్లా రెప్ప వాల్చకుండా చూస్తున్నా – నీకేసి..."

"యెందుకో ?"

"నీకూ నాకూ ఊహలు చేతకావు. అదే పేకులాట" కళ్ళు చిట్లించి ప్రశ్నార్ధకంగా చూస్తూంది. ఊపిరి తీసినప్పుడల్లా వక్షం పైకి లేచి, మంచం బద్దిమీదున్న పరువుని వంచుతోంది. అతనికేసి జరిగింది. అతను తొలిగి అవతల వైపు కెళ్ళి నుంచున్నాడు.

"సరేలే, తెల్సిందిలే," అంటూ కోపంగా మూతి ముడుచుకొని లేచి వెడుతోంది.

"దిగబెడుదువుగాని రా," అంది.

అతనూ వెనకాలే వెళ్ళాడు. ఎవ్వరూ మాటాడలేదు. దొడ్లో, ఒక్క పుంజు పెట్టని గదుముతోంది. అది భయపడి పరుగెడుతూ, వాళ్ళ కాళ్ళ మధ్య కొచ్చింది. పుంజు పక్కగా వొంగి వొదిగి, రెక్కలు విదిలించి దాబాయిస్తోంది. రాయి తీసి పుంజును కొట్టాడు భాస్కరం "రాతి గుండెస్కా" అంటూ వెళ్ళి తలుపు జార్లవేసింది. తను మాత్రం ఎందు కిష్టపడాలి ? బెట్టు చేయటం తనకీ చేతనవును.

ఆరేడు నెలల తర్వాత, సీతారత్నంకి జబ్బుచేసింది. తనూ, పార్వతీ, పిల్లలూ, రోజల్లా ఆమె దగ్గరే గడిపి కావల్సినవి కనుక్కుని ఆదరించేవారు. ఆమెకు పొద్దుపోయేది కొన్ని రోజులలో కోలుకుంది.

నాలుగో నెలని స్థిరపరిచారు.

రాత్రి పదయింది. గాదికొట్ల చూరుమీదనుంచి చందమామ లేచింది నిలబడ మన్నట్లుగా నాలుగయిదు మేఘాలు చుట్టుముట్టాయి బెదిరి చంద మామ పూలమొక్క వెనుక దాక్కుంది. సిగ్గుతో పుష్పాలు ముడుచు కున్నాయి. నాగయ్య ముందు గదిలో నిద్ర పోతున్నాడు. భాస్కరంగా రింట్లో దీపాలు తియ్యలేదు. ఎవరో ఇద్దరు ముగ్గురు పై ఊళ్ళ వాళ్ళొచ్చి జాతకాలు తిరగేసి కబుర్లు చెప్పుకుంటున్నారు. పావుగంటలో సద్దుమణి గింది. నిద్రరావడం లేదు. సీతారత్నం దొడ్లోకి వెళ్ళింది. గోడదాటి

సామానుల గదిదాటి, బస్తాల మూటల వెనుక మంచం మీద పడుకొన్న భాస్కరంని లేపింది. తన వెనకాల రమ్మని సంజ్ఞ చేసింది. అతని కర్థం కాలేదు.

"ఉండు. లోపల కెళ్ళి కర్రట్టుకొస్తా."

"ఇస్, అరవమాక...తోచటంలా. కబుర్లు చెప్తువు కాని, అందుకే పిల్చా."

మండువా పక్కన అరుబైటచాపేసింది. కూర్చుంది. తల సగం వెన్నెట్లోనూ, సగం నీడలోనూ వుంది – రెండుగా చీలినట్లు.

"ఊరికినే – సాలా రోజులయింది. నీతో కబుర్లుసెప్పాలని మనసోయింది పార్వతి చెప్పిందా ?"

"ఏమని ?" అని ప్రశ్నించాడు ఆశ్చర్యం కనబరుస్తూ.

"మొదటిసారి, జ్ఞాపకముంటే, నాలుగో నెలవంగానే, సూడాలని మను సేసి కబురంపాను. ఇప్పుడూ అదే." అని పళ్ళు ప్రదర్శించకుండా నవ్వుతోంది. అరిచెయ్యి విప్పి, చిటికిని ప్రేలు మడిచి మిగతా నాలుగు వేళ్ళను చూపింది. చిటికిన ప్రేలు ప్రక్కనున్న ఉంగరం ప్రేలుకూడా కాస్త మణిగింది.

"నువ్వు మణచగలవా ? – వుంగరం వేలు కదలకుండా చిటికిన ప్రేలు మాత్రం వొంచాలి ఏది చూపియ్యి."

అతను యత్నించాడు సాధ్యంకాలేదు.

"నువ్వూ అంతేనా – నామాదిరే – ఒక్క వేలు మడవలేవు. ఆ రెండు వేళ్ళు మనలాంటి జంటనుకో. ఇది వొంగకుండా అది వొంగదు. తమాషా"

అతను వేళ్ళతో ఆట నిలిపేశాడు.

"ఈ మధ్యనేగా జబ్బుచేసి తేరుకొన్నది – మళ్ళా నాలుగోమాసం– ఏమిటి ? జబ్బు అబద్ధమా. ఇదబద్ధమా ?" నవ్వుతూంది.

"నాగయ్యకి మళ్లనే నీకూ ఫలే రోసం. నువ్వన్నదే రైటు. మన

సులో వున్నాక వొంటిలో వుంచేనేం - శాతనైతే అదీ వుండకూడదు-ఇదీ వుండకూడదు. అవునా ?"

"మన మనస్సులూ బాగున్నై వొంటినీ భద్రం చేసుకున్నాం. ఊళ్ళోవాళ్ళు గొడవచేస్తున్నారు. ఇంకెందుకు భద్రంగా వుంచటం ?"

"నువ్వు చెప్పింది, నాకూ నచ్చింది. వొంటినిభద్రం చేసుకోవద్దులే — మనసుని పదిలం చేసుకొందాం - అది వీలేనా ?"

"మనసులో ఏముందో ఎవడు చూడొచ్చాడు ? ఊళ్ళో వాళ్ళు చూశారా ? భద్రంచేసుకోడం మాటపద్దం రెండూ దేని కని ?"

"నేనూ అదే అడుగుతుండ. మంచిరోజు చూడు మరి..."

చెయ్యిజాపి ఆమెను తాకబోయాడు.

"ఆ రోజున గణిశావుగా. ఇప్పుడకూడా ఇష్టంలేకుండానే ఊళ్ళో వాళ్ళమీద కసొచ్చి రంకె లేస్తావా భాస్కరం. ఇంటికాడ జాతకాలు చూస్తానన్నారుగాశాస్తుల్లు. మూర్తం పెట్టించు."

లేచింది చాప చుట్టింది.

"పొద్దోయింది పొద్దునే వొపాలి పార్వతిని కనబడమనేం." లోపలి కెళ్ళింది. మెల్లగా తన మంచంమీదికి చేరుకొన్నాడు భాస్కరం. ప్రాణం కుదుటబడ్డట్లయింది. ఇంక ఊరుకోకూడదు. ఊళ్ళోవాళ్ళు గొంతుకులు పొయ్యేటట్టు అరచి చావనీ. సీతారత్నం కడుపుకింద చారలు, సనాల మధ్య లోతుసీడ, గుండ్రని పిరుదులు, ఊహిస్తూడంగా నిద్ర పట్టేసింది.

రోజులు, వారాలు, నెలలు గడిచిపోతున్నాయి. మంచి ముహూర్తం కుదరడం లేదు. ఏదో అడ్డు తగుల్తూనే వుంది. ప్రతి రోజు ఎప్పట్లాగే కలుసుకొంటూ వున్నా, కళ్ళతో మాట్లాడుకొంటూ వున్నా వారి మధ్య ఏదోగోడని ఎవరో లేపుతున్నట్లుంది. ఒకపొర ఇటికలు పేర్చారు. దూకేటప్పుడు అవి కాలికి తగిలి, పడ్డం, లేవటం జరుగుతూంది ఇంకా గాయాలు తగ్గలేదు. రాత్రిబడి జోరుగాసాగుతోంది. పెద్దలుకూడా పాటాలు చెప్పమని వస్తున్నారు. గ్రెగ్గు దొర గారికి ట్రాన్స్ఫరయింది.

స్టీవెన్‌సన్ అనే కొత్తాయనొచ్చాడు. కాలవమీద వంతెన శాంక్షనై కట్టడం ప్రారంభించారు.

పొగాక్కి, రావలసిన రంగురాక నాగయ్య కాస్త దెబ్బతిన్నాడు అతని పనులలో తిరుగుతూ భాస్కరంకి తీరికుండడం లేదు. రెండు నెలలు సీతారత్నంగా రమ్మాయి మాణిక్యంకి జ్వరం. మందులు, మరో నాలుగు నెలల తరువాత వాళ్ళ మూడోవాడికి జ్వరం. భాస్కరంగారి మొదటి వాడు కిష్టయ్య –ఏం తిరకా సొచ్చిందో–అలిగి, ఇంట్లోంచి వెళ్ళిపోయాడు. సినిమాలు చూడ్డానికి, పెద్దమ్మగారి గ్రామములో దాక్కొని వారం తర్వాత కనిపించాడు నాలుగు వూళ్ళు గాలించక.

ఐదారేళ్ళు యిట్టే వెళ్ళిపోయాయి – తలలో తెల్ల వెంట్రుకల సంఖ్య పెరగడం వారు గమనించలేదు. భాస్కరం కంటిచుట్టూ నలుపు అలుముకుంటోంది. సీతారత్నంకి మొగపిల్లవాడు పుట్టి నెల తిరక్కుండా చనిపొయ్యాడు. నాలుగు నెల్లకికాని దుఃఖాన్నుండి తేరుకోలేదు. ఆమె మెడ మీద గీట్లు కనబడుతున్నాయి. పొత్తికడు మీద చారలు పెరుగుతున్నాయి. నడుం వెడల్పవుతోంది. దారం తెగినా – గాలి ఒత్తిడికి తక్షణం కిందికి దిగిపోకుండా, పైపైన అల్లలాడుతున్న బుడగలల్లె స్తనాలు బిగిసడిలి వంగుతున్నాయి. రవిక బిగించినచోటు, కిన్న మీద నల్లగా మచ్చ పడుతోంది. యివేవీ వారికి తెలియవు వారి మనసులో ఏముందో వారికి తెలుసు నేమో.

అది వేసంగి ప్రారంభం. ఎండలు మండుతున్నై. దగ్గఱ బంధువులెవరో చనిపోతే పిల్లన్ని తీసుకుని పరామర్శ కెళ్ళింది పార్వతి. పెద్దవాడు స్కూలు పిల్లలతో కలిసి చుట్టుపట్ల చారిత్రక స్థలాలని చూడ్డానికి వెళ్ళాడు. నాగయ్య పనిమీద వూరెళ్ళాడు.

ఆనాడు శుక్రవారం–మర్నాడు పూర్ణిమ. సీతారత్నం తలంటి పోసుకుంది. గుమ్మం ముందు నిలబడి జుట్టు ఆరబెట్టు కుంటోంది. గోడ దగ్గరికి నడిచొచ్చింది. భాస్కరాన్ని చూసి నవ్వింది గాజులు మెరుస్తూ

న్నాయి. భుజాలని పట్టుకున్న పుంల డిజైను రవిక వేసుకొంది. కన బొమ్మలమీద పసుపు పూర్తిగా పీడలేదు. పాపిడి రెండు ప్రక్కలా తెల్ల వెంట్రుకలు మెరుస్తున్నాయి. తెల్ల ఖద్దరు చీరలో నడుం గుండ్రంగా వెడల్పుగా కనబడుతోంది.

'ఖద్దరుచీర బావుందా ?'

అత నేమీ మాటాడలేదు.

'ఇదంతా ఎందుకో తెలుసా ?'

నవ్వాడు భాస్కరం.

'మధ్యాహ్నం ముంజిలు పంపేదా ?'

యేమీ మాటాడలేదు.

'పదింటికి ?'

సమాధానం లేదు.

'ఒంద నిద్ర పోమాక.'

అని వెళ్ళింది. సాయంత్రం ఒక్కడూ పొల మెళ్ళాడు భాస్కరం. మామిడి తోపులో నీడలో కూర్చున్నాడు. మనసు ప్రశాంతంగా వుంది. ఎగురుతూ, ఆడుతూ పాడుతూ గుండ్రని కాయల్ని దొర్లించుకుంటూ వెడుతున్న ఉడుతల్ని దీక్షగా చూస్తున్నాడు. చెట్ల ఆకులమధ్య గాలి గుసగుసలు వింటున్నాడు. ఏదో వెలుగు కనబడి నీడలో అంతర్ధానమైనట్లుంది ఆ వెలుగు తన శరీరంలో జొరబడి నట్లనిపించింది. రక్తం నరాలు కొత్త దోవలు వెదుకుతూ, పీకి పెనుగులాడుతున్నాయి. ఆ శరీరం – ఆ చేతులు– కళ్ళు– నడుం– తనవే... రత్నానికి ఒప్పగించాలి– పార్వతి కొప్పగించినట్లు ఇంతకాలంగా పార్వతికి వప్పగించినా తనవిగా తనవిగా తన దగ్గరే వున్నా యేం? ఒప్పగించటం ఏమిటి ? రత్నం - తన వంటిని వప్పగించేస్తుంది మరో నాలుగు గంటల్లో ఆమె నెరుగునా తను ? ఆమె తనెవరో నెరుగునా ? అంతా గొడవగా వుంది. గట్టు కనబడక ఉబికి, పొంగి, గెంతిపొయ్యే నీటి ప్రవాహంలా.– అతని మనస్సు శరీరంలోని

ఇంద్రియాలు ఏకమై తిరుగాడు తున్నాయి. కాళ్ళు అతన్ని యింటికి ఈడ్చుకెళ్ళాయి.

పిల్లలు చాపలేసుకుని వెన్నెట్లో కూర్చున్నారు. భోజనము చేసి - పాఠాలకి కూర్చున్నారు. కబుర్లు పాఠాలు పూర్తయ్యేసరికి తొమ్మిదైంది.

యింకా గాలి మొదలెట్టలేదు— ఉక్కగా వుంది. దొడ్లో కెళ్ళి నాలుగు చెంబులు చన్నీళ్ళు పోసుకుని— తెల్లటి ఖద్దరు లాల్చీ, పంచ వేసుకొని, తువ్వాలు భుజంపై ఉంచుకుని పాపిడి లేకుండా- క్రాఫింగ్ ఒక ప్రక్కకి దువ్వి, గోడ పక్కన పడక కుర్చీలో కూర్చున్నాడు భాస్కరం. పక్కన మంచం- పరుపూ వున్నాయి. మంచం కింద నీళ్ళకుండ గ్లాసు వున్నాయి. గాలి ప్రారంభమయింది ? శరీరంలోకి జొరబడ్డట్లుంది. లాంతర్లో ఒత్తి పెద్దదిచేసి పత్రిక చదివే యత్నం చేస్తు న్నాడు. గుమ్మంలో తలుపు తోసుకుని ప్రవేశించాడు చలమయ్య.

"సీతిగాణ్ని బొండాలు దింపమన్నాను. అడుగో— అదుగోరా గ్లాసు—— బొండాంపళంగానే ఇయ్యి నాకు మట్టుకు.

నీళ్ళు త్రాగడం పూర్తయింది. సీతిగాడు వెళ్ళాడు. "రేపదెల్లుండికి సంతర్పన చెయ్యాలి భాస్కరం—— సిద్ధపడు" అన్నాడు చలమయ్య.

"ఏం ఎందుకు ?"

"నీ కింకా తెల్దా ? స్టీవెన్సన్ దొరగారు మెడ లిస్తారుట నీకు ? వూళ్ళో పెద్ద లందరూ నీ పేరే చెప్పారు. మంచోడివిట- మంచి పనులు చేస్తూంటావుట— నీతి జాతి గల పెద్ద మనిషి వంట అందుకు మెడల్సు. భలే అదృష్టంలే— నీది. నేనూ నీ పేరే చెప్పినానులే." అన్నాడు చల మయ్య— భాస్కరము ఆశ్చర్యపడ్డాడు. నమ్మలేకపోతున్నాడు.

"నిజంగా- ? నాకు ?"

"అవును నీకే. ఇందాకనే నిర్ణయం జరిగింది— నాగయ్యకి కబు రంపా. దిగువ వంతెన తెరుస్తారంట దొరగారు- ఆ రోజునే మెడ లివ్వడం తంతుట—— పార్వతికి కబురెట్టు. రత్నంకి నే చెప్పే వచ్చాలే."

"నా కంతా తమాషాగా వుంది చలమయ్యా— వెనక ఐదా రేళ్ళ క్రితం— అన్నావు జ్ఞాపకంవుందా- ఇక్కడే— యిలాంటి వెన్నెట్లోనే. ఈ వూరు విడిచి వెళ్ళిపోదామనుకుంటున్నాను కూడా."

చలమయ్య కంఠం బొంగురోయి. మాటజోరు తగ్గింది. వెనకటి చలాకీ, వేగం తగ్గాయి.

"ఏదో కుర్ర సన్నాసులు అనుకొన్నారు. నిజం నిలకడ మీద తెలీకుండా పోతుందా..."

ఇంతలో లాకు దగ్గర పడవలు అవతలకి పోకుండా లాకు సూప రెంటుగారు పేచీ పెడుతున్నారు. తమ రొచ్చి సాయపడాలి— అంటూ బెస్తవాళ్ళు బయట తమకోసం కూర్చున్నారని చిట్టిగాడు చెప్తున్నాడు.

"కనుక్కు నొస్తా" అని చలమయ్య వెళ్ళాడు.

అరు బయట ఉన్న చాపలూ, పుస్తకాలూ లోపల పెట్టడానికి యింట్లో కెళ్ళాడు భాస్కరం. దిండు తీసుకొని బయట కొచ్చాడు. మంచం అక్కడ లేదు. గోడపక్క కొట్టు గదిలోకి యీడ్చా రెవరో. మంచం మీద కూర్చునుంది సీతారత్నం— పక్కన అమ్మాయిని పరుండ బెట్టి జోకొడుతోంది.

"ఇదేవిటి— చీకట్లో కూర్చున్నావ్ !"

"భాస్కరం వుండగా చీకటేమిటి— యింకనుంచి దీపం ముంగ లున్నా, నే కనబడతానా ఏం ? నువ్వు గొప్పోడి వయ్యావుగా— దొర గారు మెడ లిస్తున్నాడంట."

"అవునట. యిదో కుమ్మరాం వొచ్చిపడిందేమిటి— అదిపోనిస్తూ— నీ కోసమె వేచివున్నాను ప్రొద్దుట్నుండి" అన్నాడు భాస్కరం.

"నే మాత్రం వేచివుండ లేదా యేం ?"

"నిజంగా—"

"అవును. ప్రొద్దుట అనుకుంటిమిగా."

"ఒకటి చెప్పనా రత్నం— ఈ పూట నీ వొళ్ళో తలెట్టుకుని ఏడ వాలనుంది." కుర్చీలోంచి లేచి మంచం మీదకి చేరుకున్నాడు.

"ఆ తట్టు పిల్ల— లెగుస్తుంది— యిటు కూకో" అంటూ తనెళ్ళి కుర్చీమీద కూర్చుంది.

పిల్లని దగ్గరకు తీసుకొని ముద్దాడాడు. "అచ్చంగా నీ పోలికె— నిన్ను చూసినట్లె వుంటుంది."

"ఇంక నయం— పార్వతి నాగయ్య మొహం అంటుందిగా— పోలికలు అదోళ్ళకి బాగా తెలుస్తాయిలే" అంది సీతారత్నం మంచం కొంచం ముందుకి జరిపాడు. ఆమె నడుం చుట్టూ రెండు చేతులూ వేయ్యబోతున్నాడు. లేచింది సీతారత్నం— కుర్చీ నీడలోకి లాగింది.

"ఇంకెందుకు భాస్కరం, మన మీ పని సెయ్యనే కూడదు. వూర్లోవోళ్ళు నువ్వు పెద్ద మనిషని మెద లిస్తావుంటే, యింకెట్లా వీలుపడుతుందేం— నింపళంగా ఆలోచించు"

"అవును రత్నం. నాకూ అనిపించింది. మనమీద అందరికీ అంత నమ్మకం కుదిరి మెచ్చుకుంటూ వుంటే ఇంక మనం మునపటి లాగే వుండటం మంచిది— కాని——"

"కానీ లేదు, ఏగానీ లేదు. నువ్వు సెప్పిందే నిజం. మన కే పోకిళ్ళూ వద్దు. హాయిగా, నిచ్చింతగా, భద్రంగా వుందాం యేం ?"

భాస్కరం కళ్ళంట నీళ్ళు కారుతున్నాయి. నీడలో ఆమెకి ఆ దృశ్యం కనబడ్డంలేదు.

"ఏమిటో చిత్రం—— సుఖంగా వుంటే ఏడుపొస్తుంది— చెడిపోతే ఏడుపొస్తుంది— మంచిగా వుంటే ఏడుపొస్తుంది— నీకు రావడంలేదు."

"నిన్ను సూస్తుంటే నాకూ దిగులుగా వుంది. ఎందుకు కంట నీ రెట్టుగుంటా భాస్కరం" దగ్గరగా జరిగి చీరకొంగుతో అతని కన్నీటిని తుడుస్తోంది. అతని గడ్డం ఆమె కొప్పు పీద ఆనించి వొచ్చే కన్నీటిని తల్లో పువ్వులతో తుడిచి ఆమెను విడిచేశాడు.

"నిన్ను తాకనేకూడదు కదూ ?"

"అవును మనస్సు పదిలంగా వుంటే అదే శాన"

పది నిముషాలు మాటల్లేకుండా, చీకటికేసీ, వెన్నెలకేసీ చూస్తూ కూర్చున్నారు. వూళ్ళో కుక్కలు ఒక్కసారిగా పేట్రేగి అరవటం మొదలెట్టాయి.

"ఎందుకలా అరుస్తాయి ?— అరుస్తే దొంగ లడతారంటారు — కొంపలో సూసొద్దామా ?" అంటూ లేచింది. సీతారత్నం పిల్లను భుజాన వేసుకుని, ఇద్దరూ ఆమె ఇంటివైపు నడుస్తూన్నారు. గదిలో మంచంమీద పిల్లని పడుకోబెట్టింది. దీపం పెద్దదిజేసింది పంజరంలో చిలక ఆహ్వా నిస్తూన్నట్లు పలుకుతోంది. దొడ్డివైపు వసారాలో చాపేసింది. రెండుదిండ్లు తెచ్చింది. గంపలో ముంజిలు తెచ్చింది. తినమంది. భాస్కరం తింటు న్నాడు.

"నువ్వేవో మంచి పనులు చేశావంటగా !"

"నా మొహం. నే నేం చేశాను. అదే ఆశ్చర్యంగా వుంది. ఇదంతా నిజమా, లేక చలమయ్యే పుట్టించాడా ?"

"ఇంకా నయం. ఇట్లాంటివి పుట్టించడానికి పీల్లేదుగా. ఐదెట్టి పాఠాలు సెపుతుండావుగా— రాట్నం ఒడుకుతుండా..."

"సరె. యిదేం గొప్ప- ఎందరు చెయ్యడంలా ! తానైతే మనం ఏవీ చెడ్డపనులు చెయ్యలేదు — ఎవణ్ని చంపలేదు — డబ్బుకోసం తలలు ముడెట్టడం లేదు. దొంగతనము లేదు... మరి... మరో ఆకతాయి తిరుగుళ్ళు లేవు... ఏం నవ్వుతావేం !"

సీతారత్నం నవ్వుతూ వెన్ను వాల్చింది. గాలికి చీర రొమ్ముమీద నుంచి తొలుగుతోంది. కొప్పులో దవనం దిండు మీదికి రాలింది.

పక్కకి తిరిగి కొంగు కప్పుకుంది.

"అసలట్టాంటి పోకిళ్ళు బుద్ధులు మనస్సులో కూడా వుండగూడ దంటారు కాదా ఏం ! మరి నీ కుందిగా."

"మనస్సులో యేమున్నది యెవడికి తెలుస్తుంది ? బయటకి కన బడేది చేస్తేనే నలుగురూ చెప్పకుంటారు."

'ఊఁ' కొడుతూ సీతారత్నం నిద్రలోకి జారింది 'ఏంటున్నావా?" యిటు చూడు అంటూ భాస్కరం మాట్లాడుతూనే వున్నాడు.

చిత్రమైన మనిషి సీతారత్నం. ఆమె మనస్సులో ఏముందో తన కర్థమైనట్లుంది కాని, నిజంగా అర్థంకాదు. అల్లా వెన్నెలలో కొమ్మల చివర మెరుస్తున్న చెట్ల ఆకుల్ని చూస్తున్నాడు. మెరుపు తగ్గింది – చంద మామ మేఘం వెనక మరుగుపడింది. ముంగీస చెట్టుపక్క కొచ్చి, అటూ యిటూ చూసి గడ్డిలోకెళ్ళిపోయింది. దూరంన ఎప్పుడో నిశ్శబ్దాన్ని చీల్చుకొచ్చిన నక్క అరుపు వినబడుతోంది. ఆ చప్పుడు కూడా నిలిచి పోయింది. ఒక్క కీచురాయి మాత్రం రోదిస్తూంది. ఎక్కడ? ఆ రోదన వచ్చినవైపు కెళ్ళి ఇస్ మన్నాడు. అదీ నిలిచిపోయింది. సీతారత్నం శ్వాస వినబడుతోంది. గాలికి చీర కొంగు తొలిగింది. ఆమె స్థనాలు లేచిపడుతున్నాయి. బొడ్డుకింద అరటిపండు చీర మడత కిందికి జారింది. లోతయిన బొడ్డు కనిపిస్తూంది— పొరలు పొరలుగా రేగిన పొట్టమీద చర్మం. అల్లా చూస్తూ కూర్చున్నాడు. మనస్సు నిర్మలంగా, శాంతంగా వున్నట్లుంది. మాటలు లేవు, కోర్కెలు లేవు. ఆలోచన లేదు. తనెవరు! ఆమెవరు— వారి మధ్య ఏముంది. ఈ ప్రశ్నలు కూడా నిలిచిపోయి ఏదో గాలిలో తేలి, వెన్నెట్లో కలిసిన ప్రాణంలా— నిప్పులో పొగలా మాయమై కళ్ళు మూతలు పడ్డట్టుకూడా తెలియ దతనికి.

ఏమో, ఎంతైందో ? ఆమె చెయ్యి అతని మొహం మీద పడింది. చివాలున లేచి కూర్చున్నాడు.

'దాహంగా వుందా ? అక్కడ కుండలో నీళ్ళు తెస్తావా అంటోంది సీతారత్నం. కంఠం బరువుగా, బద్ధకంగా వుంది. మాటల్లో జీర వుంది— అతని కిష్టమైన జీర. మంచినీళ్ళు తాగాడు.

"వెళ్ళిపోమాక— నాకు భయం" అంది.

అతనేమీ మాట్లాడలేదు. కోడి కూసింది.

"తెల్లారిం దేమిటి చెప్మా !"

అతను చాపమీద వెన్ను వాల్చాడు.

ఆమె కూర్చుని వుంది.

"నిద్రపోలేదా ! పండుకో" అంది.

"చూడు;" అని ఆమె చెయ్యి పట్టుకున్నాడు. ఆమె గట్టిగా విదిల్చింది. ఆమె ఉంగరాల వేళ్ళమధ్య అతని వేలు నలిగి 'అబ్బ' అన్నాడు.

"నొప్పా" అని అతని వేలు సవరిస్తూంది.

"మాట్టాడు– ఊ పోతునిద్ర" అంది

"ఒక నిర్ణయాని కొచ్చేశాను. నేను గాంధీగారి మనుషుల్లో చేరిపోకుండా యిదంతా ఆ దొర్ల పన్నాగం అనుకో. మెదలిస్తే ఇంక నే నోరు మెదపనుగా. పీళ్ళకి ఒకటే శాస్తి. మనిద్దరం దూర దూరంగా వుండటం– యీ ముసుగులో గుద్దులాటా, ఏమిటి ?"

"అదేమిటి మళ్ళా మొదలెట్టా పాత పోకిళ్ళా— ఇందాక వొద్దని ఖరారు చేసుకుంటిమి గాదా ఏం! నిద్రమైకమా ?"

"కాదు– విను. ఈ మెదలు రావడంతో పెద్దమనిషని మాంచి పేరడిపోయింది. ఇంక మన మేం చేసినా ఫరవాలేదు. ఇది మన మంచికే ననుకో. మెడలూ వద్దు గిడలూ వద్దందా మనుకున్నా – గాని తీసుకుంటా– వద్దనను. దాంతోపాటు నిన్నూ దక్కించుకుంటాను."

"నీ కేదో చేటొచ్చింది భాస్కరం. ఊళ్ళోవాళ్ళ కోసమా మన మట్టాగుంపటం– కూడదనుకుంటిమిగా, ఆ మాటమీదే నిలబడాలి. సూసే దేముడు లేడా యేం !

'దేముడు' అనగానే భాస్కరం మాట ఆగిపోయింది. భయపడ్డట్లు ఉలిక్కిపడ్డాడు. దేవుడు, పాపాలు, నరకం– అక్కడ రంపంతో కొయ్యశ్రమ, సలసల కాగే నూనెలో వెయ్యడం– యివన్నీ ఊహలో కొచ్చాయి

కాబోలు. భయంలోంచి, ఒక మొండిధైర్యం తెచ్చుకున్నట్లు, ఆమెని తన మీదికి లాక్కున్నాడు.

"ఇప్పుడు మన మేం చేసినా ఫరవాలేదు. మంచి పేరడిపోయింది-చచ్చింతర్వాత, ఏమవుతామో ఎవడు చూడొచ్చాడు."

అతని పట్టు విదుల్చుకొంది సీతారత్నం.

"అవునవును. నీకు మెదలిచ్చినట్లు భగవంతుడి చిట్టాలో రాసుకుంటాడా ఏం?" అంటూ విరగబడి నవ్వుతోంది మెడలో హారాలు కదిలి చప్పుడయ్యాయి. గాజులు గలగలమన్నాయి.

"జోకొడతా – పండుకో – పసోడివి – నాకంటె చిన్నేగా..." పక్కకితోసి, జోకొడుతోంది. భాస్కరానికి నవ్వొస్తోంది.

"పండుకో, ఊళ్ళోవాళ్ళూ మంచోడివని మెద లిస్తా వుంటే- ఆ మంచితనం నిలబెట్టుకోవాల. ఇప్పు డనలే కూడదూ నీ పోకిళ్లు."

గోడమీద బల్లి అరచింది.

"చూడు– నే చెప్పింది నిజం, బల్లి కూస్తావుంది. మన మెప్పుడూ ఇట్టాగే మంచోళ్ళుగా స్నేహంగా ఉండాలి. పొగ లేకుండా నిప్పుంటం మాదిరి... తప్పు సెప్పానా ? పొగ లేకుండా నిప్పు, నిప్పు లేకుండా పొగా... ఏమో నాకు తెల్దులే..."

"నిద్రే. కన్ను మూశా... ?" ఇంక తర్వాత ఆమె ఏమందో అతనికి తెలియదు.

కోడి కూసింది. తూర్పు ఆకాశంలో ఆవులిస్తూ సూర్యుడు కనులు నులుముకున్నట్టు ప్రభాతం ఒళ్ళు విరిచి చోటు చేసుకుంటోంది.

ఆ రెండు మూడు నెలలూ, వారిద్దరూ యీ విషయమే చెప్పుకొన్నారు. "మంచిపేరు పడిపోయింది గనుక మనం ఇష్ట మొచ్చినట్లు వుండొచ్చు." అని భాస్కరం, "అది వుందిగావున, పదిలంగా వుండ

కూడదా ఏం?" అని సీతారత్నమూ, "మెడలివ్వనీ–తర్వాత ఆలోచిద్దాం" అనడంతో అతను తృప్తిపడ్డాడు.

మెడలివ్వటం జరిగింది. అందరూ సంతోషించారు. నాగయ్య, వన సంతర్పణ ఏర్పాటుజేసి ఊరిపెద్దల్ని సంతోషపెట్టాడు.

మరో ఏడాది గడిచాక మళ్ళా భాస్కరం, సీతారత్నం పొలంలో కలుసుకొన్నారు. తోటలో చిన్న రెండుగదుల "బంగళా" కట్టించాడు– నాగయ్య. అందులో గృహప్రవేశం జరిగిన సందర్భం. దూరంగా ఇసుక పూరిగడ్డి కుప్పలుగా వేసివుంది. నల్లకుక్క కెలుకుతోంది. అక్కడి కొచ్చింది సీతారత్నం.

"ఏ మంటావ్– మనం పెట్టుకొన్న గడువు తీరిందిగా అన్నాడు భాస్కరం.

"మరో రెండు మూడేళ్ళు పోనిస్తూ– మూడేళ్ళకోపాలంటగా యీ మెడ లివ్వటం. ఈ కాస్తపాటికే పేరు పాడుజేసుకొంటావా ఏం? ఆ రందరూ కూడబల్కున్నారంటే ఆ మెడలు కాస్త లాగేసుకుంటారేమో– పదిలంగా వుండు" అంది రత్నం.

అతనికి నవ్వొచ్చింది. అతని వళ్లు వేడెక్కుతోంది. ఆ చల్లటి ఇసుకలో మరీ వేడిగా కనపడుతూం దతనికి.

"నువ్వు చెప్పింది నిజమేలే" అని సమాధానంగా కుదుర్చు కున్నాడు.

ఆ మూడేళ్లు గడిచినై. తన పెద్దకూతురు 'పాపాయి'కి సంబంధాలు చూట్టంలో గడిచిపోయింది నాలుగో ఏడు. ఆ పిల్లకి వివాహం చేశారు. తరువాతి సంవత్సరం నాగయ్యగారి అబ్బాయి సంగయ్యనీ, తన కొడుకునీ కాలేజీలో జేర్పటం, అందుకోసం ఆ బస్తీలో మకాం చెయ్యడంతో సరి పోయింది. "ఇంకా ఇప్పుడేమిటి పోనిస్తూ పెద్దోళ్ళమైపోయాంగా– నిప్పు లేదు, పొగలేదు..." అంది సీతారత్నం. అల్లా నిష్పేచీగా గడిచాయి

వారి జీవితాలు. పై సంవత్సరం పిల్లని కన్నాక పార్వతి చనిపోయింది. ఆ ఏడాది దుఃఖంతో వెళ్ళింది. నలుగురూ వోదార్చారు. మళ్ళా పెళ్ళి చేసుకోమన్నారు. తనకి అలాంటి అభిప్రాయాలు లేవన్నాడు భాస్కరం.

మరో ఏడాదికి తేరుకున్నాడు. సీతారత్నం తనకి ఎక్కువగా కావల్సి వచ్చినట్లు చెప్పుకున్నాడు ఆమెతో.

"పార్వతికి అన్యాయం ఎట్లా చెయ్యనూ!" అంది. "ఇందులో అన్యాయం లేదు మొదటినుంచీ మనిద్దరము ఇట్లాగే వున్నాం. ఆమె పోయింది- మహాఇల్లాలు. యిప్పుడే నన్ను ఆదుకోవాలి..."

"పార్వతికోసమన్నా సరే నంటాలే" అంది సీతారత్నం. సంతోషంతో ఎగిరి గంతేశాడు, అవకాశంకోసం వేచివున్నాడు. సీతారత్నం కూతురు రాధమ్మకి సంబంధాలు చూస్తున్నారు ఆఖరికి కుదిరింది. ఆ ఏడు పెండ్లి జరిగింది. పెళ్ళివారు, రాకపోకలూ, హడావుడి సందడి.

మరో ఎనిమిది నెలలకి తాను ఒంటరిగా గడిపే అవకాశమొచ్చింది. "రేతిరికి చెప్పుకుందాంలే" అంది సీతారత్నం. ఆ సాయంత్రమే నాగయ్య బండిలో వెడుతుండగా పక్షవాతము వచ్చి, కాలు కదలకుండా పడిపోయాడు. యింటికి తీసుకొచ్చేశారు. వైద్యులు, మందులు... ఎనిమిది నెలల తర్వాత మరోమారు పక్షవాతం ప్రకోపించి చనిపోయాడు. ఆ దుఃఖంనుండి తేరుకోడానికి ఏడాది పట్టింది. పెద్దవాడి చదువు ఉద్యోగంలో ప్రవేశించాడు. తల్లిని తనతో వచ్చి ఉండాలన్నాడు. భర్తతో ఇన్నాళ్ళా గడిపిన ఊరూ, యిల్లూ విడిచి రానంది.

"మనిద్దరికీ ఎవ్వరూ లేరు— కలసి వుంటేనేం!" అన్నాడు భాస్కరం.

"ఇప్పుడసలు కలవనేకూడదు. దూరంగా వుండటములో సిగ్గూ ఫింకా లేకుండా స్థిమితంగా లేదా ఏం?" అని కంట నీరెట్టుకుంది సీతా

"నీ కిష్టం లేకపోతే— బలవంతం చెయ్యనుస్మా.

"కోపమా ? కోపమంటే, సరేనంటా"

"ఆ మాట చాలు..."

ఆ రాత్రే కలుసుకుందామని నిశ్చయం చేసుకున్నారు.

పొద్దుగూకుతూ వుండగా, హృద్రోగంతో చనిపొయ్యాడు భాస్కరం. అతనికోసం వస్తున్న సీతారత్నం ఆ కబురు విని నేలమీద పడిపోయింది.

o o o

కాని ఇట్లా జరగలేదు. నిజానికి మామయ్య చెప్పిన కథ ఇంత ఇప్పుడేమి పోనిస్తూ పెద్దోళ్ళ మైపోయాంగ నిప్పూలేదు, పొగా లేదు" అంది సీతారత్నం. ఇల్లా నిప్పేచీగా గడిచాయి వారి జీవితాలు – అన్న వాక్యంతో ముగిసింది.

మిగతా దంతా, వారి కథను చివరంటా ఊహలో నడిపి, దానికొక ఆకృతి, కళానుగుణమయిన ముగింపు సమకూర్చాలన్న దృష్టితో చేసిన కల్పనే.

కథ ముగిసిన తర్వాత, అత్తయ్య నడిగాను.

"ఏవమ్మా అత్తయ్యా, పొగ లేకుండా నిప్పు రాజేస్తావుట. ఎలా సాధ్యం ?"

"యేముందిరా–కుంపట్లో బొగ్గులు మండాలంటే బాగా విసరాల్తి విసిరినంత సేపూ పొగ రాదుగా" అని అంది.

ఇందులో ఏదో గూడార్థం వుందని కాని, ఇది మావయ్య చెప్పిన కథకి వ్యాఖ్యానం అనికాని అనుకోవడం లేదు నేను.



# ఇప్పటి పావురం రేపటి నెమలి

ఏపని చెయ్యకూడదనుకుంటామో, ఆపనే చెయ్యాల్సి వొచ్చే పరిస్థితి ఏర్పడుతుంది. అదేం కర్మమో, కూడదనుకున్న పనిపట్ల కాస్తోకూస్తో యిష్టంవుండి, ఆ యిష్టాన్ని ఎదుర్కోడం యిష్టంలేక, దూరంగా తోసేసి, అదికూడదు. అని నిర్ధారణ చేసుగోటం జరుగుతుందేమో. కామేశం విషయం చూడండి. కూడదనుకున్న పని చెయ్యాల్సి వొచ్చింది. సొంతింట్లో వొక భాగం అద్దెకివ్వడం. అద్దెకొంపల్లో అగచాట్లుపడిపడి, విసిగెత్తి ఆ రెండెకరాలూ అమ్మేసి, మరో ఆరువేలు అప్పుచేసి ఇల్లు కట్టుగున్నాడు. ఆ అప్పు తాలూకు రెండువేలు వుండిపోయింది. తీరిపోతుంది రేపో, మాపో, బెంగలేదు. చెయ్యవల్సిన కథలూ, కార్యాలూ ఏమీలేవు అమ్మాయి అత్తవారింటికెళ్ళింది. అబ్బాయికి పాట్నాలో ఉద్యోగం, ఇంక తనూ భార్యా ఇల్లంత పెద్దదీ కాదు. తమకి సరిపోతుంది. ఎవరన్నా వచ్చినా మరోగదుంది. దాని వెనకాల మరో చిన్నగది – స్టోర్‌రూమ్‌గా భావించి, పాత మడతమంచం, రెండు పేముకుర్చీలు పడేశాడు. ఆ గది ముందు కాస్తంత వరండా, పడక్కుర్చీ వేసుకు కూర్చోవచ్చు–కూర్చుని దూరంగా కొబ్బరిచెట్ల నడుంగా సూర్యాస్తమయం చూడొచ్చు.

ఉండదల్చుకుంటేనే కొంప కట్టుకోవాలన్న తత్వం కామేశంది. ఉన్నాక అందులో మళ్ళా వాటా అద్దెకివ్వకూడదు. ఈ విషయమై అతనిది ఖచ్చితమైన అభిప్రాయం. బి. ఎ. ప్యాసయ్యాడు–అబ్బో చాలా వెనక - ఫిలాసఫీ బి. ఏ. ఆ రోజుల్లో ఫిలాసఫీ బి ఏ. అంటే హేళనగా వుండేది–ఎందుకో మళ్ళా మనది ఋషులు, యోగులు, మునులూ వున్న దేశంగా ఐడాయిలు చెప్తారు. ఈ తత్వం, గిత్వం, ఉపన్యాసాలలోనూ,

పుస్తకాలలోనూ తప్ప, ఎవడికావాలి! ఈ మనుషులికి కావల్సింది డబ్బు గడించడం, ఏదో పొట్టగడిస్తే చాల్దూ ? అదనంగా డబ్బుంటె పాడుబుద్ధులు పుడతై; చెడిపోతారు. ధనాశకి అంతంటూ వుందా, పోదురూ.

మనం వుంటున్న ఈ భూలోకమే వొక పెద్ద అద్దెకొంప. యజమాని పరమాత్మ, ఖాళీచేయించి తీరుతాడు. ఇంక ఇందులో మళ్ళా కొంత మరొకరికి అద్దెకివ్వడమా ? మనతో పాటు వాణ్ని కూడా ఖాళీ చెయ్యమనడమా ? కట్టుకున్న కొంప సంగతీ అంతే. నిజానికి 'ఇది నాది' అని చెప్పుకోవాలంటే ఇల్లు వుండితీరాలి. ఏ భూకంపమో రాకపోతే, పునాది గట్టిదైతే నాలుగు కాలాలపాటు వుండేది ఇల్లొక్కటే. వెళ్ళేటప్పుడు కోట తీసేసి కొడిక్కావాలి. అంతే జీవితం. పైకి వెళ్ళాక పరమాత్మ నైలాన్ పంచే ఇస్తాడో, టెరిలిన్ కోటే ఇస్తాడో మరి నగ్నంగా విహరించమంటాడో వెళ్ళాక చూడాలి.

కాని అద్దెకి ఇవ్వక తప్పిందికాదు;— ఆ దంపతులకి. అద్దెకివ్వడమేమిటి, అసలు ఊరకే వుండమనాలనిపించింది. కాని సరస్వతి వొప్పదు. మంచిదే—కాని అతిమించి కూడదంటుంది. అనుకోకూడదుగాని, సరస్వతిని డబ్బు కాపీర్నం పూర్తిగా విడలేదు — తనతో పాతికేళ్లు కాపరం చేసి కూడా.

ఆ అబ్బాయిని చూడగానే అతని వెనకాలే వచ్చి బెంచిమీద కూర్చున్న ఆ అమ్మాయిని చూడగానే, ఇంట్లో వాటా యివ్వాలనిపించింది. అతనిపేరు రామమూర్తి—వయస్సు పాతికపైన,ముప్పైలోపు. కోల మొహం, నాజూకైన ముక్కు, మంచి ఎత్తయిన నుదురు, పట్టుదిలని సూచించే పెదవులు, గడ్డంనడుమ నొక్కు అందంగా వంగి నుదిటి మీదికి జారే వుంగరాలజుట్టు—కండ్లజోడు తీసేస్తే స్ఫుటంగా మెరిసే కళ్ళు, ఆ పిల్ల—అతని భార్య కుమారి ఆకర్షణీయమైన మొహం ఆకర్షణంతా అమాయకత్వంలో వుంది. జాలిగా చూస్తుంది. విశాలమైన, గుండ్రంగా వుండే కళ్ళే

అయినా కాటుక అటుఇటు పొడుగ్గా పెట్టడంవల్ల కాబోలు చేప ఆకృతిలో కనబడతాయి. మృదువైన చర్మం-మరీ నలుపు కాదు. కాస్తంత పక్క పాపిట, వెడల్పాటి జడ – మెడలో వొక్కటే గొలుసు. కుడిచేతికి ఒక గాజులజత, ఎడమచేతికి రిస్టువాచ్. ఆ రిస్టువాచే నచ్చలేదు కామేశంకి. అది నాగరికతకి చిహ్నం. ప్రాచీన హైందవ సంప్రదాయానికి, ప్రకృతి శోభకి విరుద్ధం. గజిబిజి ప్రింట్ డిజైన్‌చీర-ఎరుపుజాకెట్-మోచేతిక్రిందికి దిగింది – అంచులేదు. చిత్రం, ఆ ప్యాంకు కంతలోంచి రెండుమూడుసార్లు చూసినప్పటికీ, కామేశానికి ఇన్ని జ్ఞాపకం వుండడం, అతనికే ఆశ్చర్యం వేసింది. నెల క్రితం నూటపది రూపాయలు బ్యాంక్‌లో వేశాడు రామ్మూర్తి. ఈ నెలరోజుల్లోనూ, మూడుసార్లొచ్చి, తొంభై తీసేశాడు. అతనికేం ఇబ్బంది వచ్చిందో, ఇవాళ ఉదయం కుమారి వొచ్చి ఆ ఇరవై తియ్యడానికి కాగితం తెచ్చింది.

"ఏం, ఎకౌంట్ మూసేస్తారా– ? కనీసం పదేనా వుంచాలి" అన్నాడు కామేశం.

"పోనీ పదివ్వండి," అంది అమాయకంగా.

బ్యాంక్ లోంచి డబ్బు లాగేస్తుంటే, ఆ తీసే వారి సమస్య లేమిటో ఊహించడం సరదా కామేశానికి.

ఇరవై కావలసి వచ్చిందా అని అడిగాడు.

"గదివాడు తొందరచేస్తున్నాడు" అని వెళ్ళి మధ్యాహ్నం మళ్ళీ ఒచ్చింది కుమారి. ఈసారి రామ్మూర్తి కూడా వచ్చాడు.

కబుర్లలో తెలిసింది వాళ్ళకి ఇల్లు కావాలి. ఎడ్వాన్సు ఇచ్చుగో లేరు. అది లేకుండా ఎవ్వరూ ఇవ్వడం లేదుట. ఒక్క గదైనా చాల న్నారు. ఎప్పుడు ఖాళీ చెయ్యమంటే అప్పుడు ఖాళీ చెయ్యడానికి సిద్ధం అన్నారు. కామేశం కరిగి పొయ్యాడు. వెనకెప్పుడో కాలేజీలో ఒక ఇంగ్లిషు కావ్యం చదివాడు. పారిపొయ్యే ప్రేమికుల కథ ఆ కావ్యం లోనిది. పారిపోతుంటే పెద తుఫాను చెలరేగుతుంది. ఏటివొడ్డుకు

వస్తారు. ఆ ఏరు దాటి తమని వెంటాడే వారి బారి నుండి తప్పించుకోవాలి. కాని ఆ తుఫానులో ఏరు దాటేసేందుకు ఏ పడవ వాడూ సిద్ధపడడు. ఆ ధరికి ఒక ముసిలాడు సిద్ధమౌతాడు. దాటేస్తాను ఎక్కమంటాడు. అవతలి ఒడ్డున క్షేమంగా దిగవిడుస్తాడు. కృతజ్ఞత చెపుతూ తాతకి ఏదో ఇవ్వబోతాడు యువకుడు. నాకేమీ ఒద్దంటాడు పడవ తాత.

"నీ కోసం కాదు– ఆ బుల్లెమ్మను చూసి దాటేశా" అంటాడు.

కామేశం స్థితి అలాంటిదే. తనింట్లో రెండు గదులు ఖాళీగా వున్నాయి. వెంటనే వచ్చి ప్రవేశించమన్నాడు. ఇష్టమొచ్చినంత ఇవ్వమన్నాడు సరేనని ఆ దంపతులు వెళ్ళిపోయారు.

నిర్ధారణ జరిగిపోయింది. మాటిచ్చేశాడు. కాని, సరస్వతిని ఒప్పించాలి. తన కెందుకు అంత తొందర, ఫలానా అద్దె ఇవ్వండి అని చెప్పకూడదూ. ఈ అతి మంచితనమే అనర్థమంటుంది సరస్వతి. మొదట్లో భయపడ్డాడు కామేశం. భార్య ఏం గొడవ చేస్తుందోనని, వాళ్ళకి ఎందుకు ఇస్తానన్నాడో ఏదో ఒక కథ అల్లి- కొంత నాటకం ఆడి ఆమెను ఒప్పించాలనుకొన్నాడు. కాని, అబద్ధం బయటపడితే ఆవిడతో మరీ ప్రమాదం. అదీకాక ఈ ఆడాళ్ళున్నారే చిత్రం. కొన్ని విషయాలు ఇట్టె పట్టెస్తారండీ. చెప్పల్సినవన్నీ వేళ్ళ మీద లెక్కించి చెప్పాడు. తనకి బ్యాంకులో పని గనుక. జమా ఖర్చులాంటి చిట్టా తయారు చేసుకున్నాడు. సందు చివరి ఇల్లు. తామిద్దరూ లింగు లిటుకూ అంటూ వుంటారు. రోజులు బాగుండ లేదు, కాపలాకి కుక్కని పెంచుదామంటే ససేమిరా వల్లకాదంటుంది. పోనీ, సందడిగా వుంటారు. అద్దెడబ్బులతో కొంపమీద వున్న ఆ కాస్త అప్పుతీర్చొచ్చుగా. ఇదిగో ఈ చివరిమాట చెప్పడంతో సరస్వతి ముఖం విప్పారింది. ఉప్పు, కారం, సరయిన పాళ్ళలో అతని కంట్లోగాక పులుసులో పడ్డాయి ఆ పూట.

ప్రతిరోజూ ఒక అరగంటయినా భార్యతో యుద్ధం చెయ్యకపోతే

గడుపదు కామేశంకి– వాగ్ యుద్ధం, అందులో సరస్వతి దిట్ట. వెనుక యుద్ధాలంటే, ఇరుపక్షాల సైనికులు బోలెడంత తయారై, ఆగ్రహంగులన్నీ అమర్చుకొని, సామగ్రి సిద్ధం చేసుకొని యుద్ధానికి దిగేవారు. సరస్వతికి ఇవేవీ అక్కర్లేదు. ఆమె ఎప్పుడూ సిద్ధమే. వెనక యుద్ధాలకి కారణా లుండేవి. రాజ్యం కబళించాలనో, శత్రురాజు చెల్లెల్ని లేవదీసుకు పోవ డమో– ఏదో కారణం. సరస్వతికి కారణాలతో నిమిత్తం లేదు. నిష్కా రణంగా ఉత్త పుణ్యానికి సమరం జరపగలదు. ఈ పూట ఆరింటికే ఇంటికి రమ్మంటుంది. అట్లాగే వస్తానంటున్నాడు కామేశం. అట్లాం టప్పుడు కూడా దెబ్బ లాడగల్దు సరస్వతి.

"వస్తా నంటినిగా"

"అనడం చుట్టుకే"

"ఒసే, ఇదివరలో ఎన్నిసార్లు రాలేదు ?"

"మీ అంతట మీరే రావటం కాదు"

"ఇప్పుడేం చెయ్యమంటావ్ ?"

"సరిగ్గా ఆరింటికి రమ్మంటా"

"వస్తానంటినిగా"

"అనడం కాదు"

"నువ్వనే దేమిటి– గడియారం ముల్లు ఆరుకి తిప్పి, బయట కెళి ఇప్పుడే రమ్మంటావా ?"

"నే అల్లా అనలేదు"

ఆ విధంగా సాగుతుంది. ఆమేదో అంటుంది. అతనేదో అంటాడు. ఆదివారమైతే, తాపీగా కూర్చొని ఒక గంటైనా జగడమాడందే వారికి తోచదు.

ఆ దంపతులు– రామ్మూర్తి, కుమారి వచ్చి చేరారు. ఆ పక్క రెండు గదులు– ఆక్రమించారు. గదుల్లో రెండు కిటికీలు, ఇటువైపుకే తెరచి వున్నాయి. ఏదో గళ్ళ చీరని కర్టనుగా అమర్చింది కుమారి.

వాళ్ళేం చేస్తున్నా ఇటు వారికి కనిపిస్తూనే వుంటుంది పాపం. ఆ వరండా ఇవతల గది వంటిల్లు— కిటికీ తలుపు వూడింది. బాగుచేయించాలి. ఏమిటో బోలెడు చిల్లర పనులు చేయించాలి— కలసి రావడం లేదు. ఆ గదుల్లో వుండిపోయిన పాత కుర్చీలు. మంచం తెచ్చేసుకుందా మన్నాడు కామేశం.

"తెచ్చి ?"

ఏ మనాలో తెలియదు

"పాత వెందుకని ?"

"ఏం పాతవైతే"

"నల్లులూ, గట్రా"

"కొత్తవి కొంటిరిగా, అవి వేసిరండి." మొదట ఇది వెటకార మేమోనని భయపడ్డాడు కామేశం. కాదుట. నిజంగానే వేసిరమ్మంది. ఎందుకో ఇంత దయ మర్నాడు తెలిసింది. కుమారి మంచిపిల్లట. కల్ల కపటం ఎరుగదట. భర్తని కనిపెట్టుకుని వుంటుందిట. వారి అన్యోన్యానికి గాలిపోయిన రబ్బరుబంతి లాగైందట.

ఆ రామూర్తి మరీ మంచివాడట. పెళ్ళానికి తెగ చాకిరీ చేస్తాడట. చీరల మడత లెడతాడట. తనే దుస్తులు ఉతికి ఇంట్లోనే ఇస్త్రీ చేస్తాడట. వంటింట్లో కూడ ఏదో సహాయపడుతూనే ఉంటాడట. మరో రెండు రోజు లయ్యాక మరికొన్ని విషయాలు బైటపెట్టింది సరస్వతి. సాయంత్రం సూర్యుడస్తమించాక. వెన్నెట్లో ఆ బుల్లి వరండాలో ఇద్దరూ చాపేసు కూర్చుంటారట. అతని వక్షంపై తలానించి పడుంటుందట కుమారి. అతను జుట్టు నిమురుతూ నక్షత్రాలకేసి చూస్తూ, నిశ్చింతగా గడుపు తారట. మాట్లాడుకోరు కంఠం దించి చెబుతోంది సరస్వతి.

నిన్న మధ్యాహ్నం హాల్లోకొస్తూ, చూడకూడదనుకుంటూనే అటు చూశాను. ఏం చూశానో తెలుసా. కుమారి నిలబడి అద్దం చూసుకొం టూంది. కలకల్లాడే ముఖం. వెనకాలే వచ్చి ఆమెను గట్టిగా కౌగలించు

కొన్నాడు. యేం భయపడిందో, చేతులో అద్దం వదిలేసింది. కిందపడి ముక్కలైంది. పోనీ అద్దం పోయిందన్న బెంగేనాలేదు— ఆ గాజు ముక్కల్ని వెదకడమాయేమన్నానా — అటుతిరిగి, అతని మెడచుట్టు చేతులువేసి అహ్వా— వాక్యం పూర్తి చెయ్యకుండా. తొట్రుపాటు ఆవేదనా కనబడ్డింది మొహంలో.

వాళ్ళని అంతగా పొగట్టం చూసి, కామేశం లోలోన విసుక్కున్నాడు. వాళ్ళతో లడాయి పెట్టుకోకుండా, మంచిభావంగా వుంటే చాలు. అతనంతకంటే కోరడు. కానీ, మరీ మెచ్చుకోవడం, మొదలెట్టేసరికి కామేశం కాస చిరాకుపడ్డాడు. హైందవతత్వం బాగా చదవడంవల్ల కాబోలు, కామేశానికి ఉద్రేక ప్రకర్ష సరిపోదు. సమగ్రమైన దృష్టి అలవర్చుకోవా లంటాడు.

అంతమాత్రంచేత కామేశంలో ఏ మార్పూ రాలేదనుకోకూడదు. కూడదనుకుంటూనే, తనూ, ఆ యువక దంపతుల నిత్యకృత్యాన్ని కిటికీలోంచి చూస్తూనే ఉన్నాడు. మిఠాయి కొన్నా కొనకపోయినా— చాకలాణ్ణి పెట్టుకున్నట్లు లేదు— గులాబీలు మాత్రం తెస్తాడు రామ్మూర్తి, ఒక్క గులాబీని కుమారిజడలో అమరుస్తాడు. బాల్కనీమీద ఆమె కుర్చీలో కూర్చుని వుంటే, అతను కింద కూర్చుని, ఆమె ఒడిలో తన తల ఆనిస్తాడు. ఆమె అతని జుట్టు నిమరుతూ వుంటుంది. అతనికేం పనో కనుక్కోలేదు. ఎప్పుడూ ఆమెతో ఇంట్లోనే వుంటాడు. సినిమాలకి, షికార్లకి వెళ్ళరు. వాళ్ళ ప్రేమకి రాత్రి చాలినట్లు లేదు. పగలు కూడా— ఆనందంతో, ప్రేమతో వాళ్ళ మొహాలు వెలుగుతున్నాయి. రోజురోజుకి బాగుంటున్నారు. స్వస్తికా ఆకారంది. ఎరుపు, తెలుపు రాళ్ళతో పొదిగిన— దుద్దులు చెవలకి అమర్చుకుంది కుమారి. కాని ఏం లాభం. ఆ జుట్టుని చెవల మీదికి లాగి, వాటిని కనబడకుండా చేసుకుంటోంది అదేం ఫేషనో.

"హవ్వ — తల దువ్వి జడకూడా అతనే అల్లుతాడండీ" అంది సరసంతి.

"ఎంచక్కా, చెవలమీది జుట్టు పైకి లాగి—ఇటురండి. రహస్యం—చెవుల్ని ముద్దెట్టుకుంటాడేమిటి! ... ... జడని విప్పి విడదీసి తన మొహంమీద కప్పుకుంటాడు... ఆపిల్ల అసలు జాడీలే వేసుకోదు...!"

అల్లా గానం చేస్తుంది సరస్వతి. అది చెప్పడంలో, ఎంతో ఆనందం పొందుతున్నట్లు తెలుస్తూనే వుంది. తను ఇంటికి రాగానే, వాళ్ళు ఏవేం చేసిందీ, చోద్యంగా చెబుతుంది అతనితో యుద్ధాలు మానేసింది. కోపం పోయింది. విసుగు తగ్గింది. చీదరించుకోవడంలేదు. సాయంత్రం తను ఇంటికి వొచ్చేసరికి. స్నానం చేసి, కొత్తచీర సింగారించి, తల్లో చామంతి, దవనం అమర్చి ఆనముందు కూర్చుని కులాసా కబుర్లు మొదలెట్టడం ప్రారంభించింది. కాసేపు డాబామీద కూర్చుని కబుర్లు చెప్పుకుందామంటోంది తన తొడమీద తల ఆనించి కబుర్లు సాగిస్తోంది.

నడివయస్సు స్తబ్ధత దిగవిడిచి, వెనక్కి యౌవ్వనంలోకి ప్రయాణం సాగిస్తున్నామా అన్న అనుమానం రాసాగింది కామేశంలో. వెంట్రుకలుతెల్ల బడుతున్నాయి. జుట్టు పల్చబడుతోంది. నడుం వెడల్పవుతోంది.వొంపులు బలుస్తున్నాయి. మూలపళ్ళు ఊడటం జరుగుతోంది. ఉక్క, ఒళ్ళు పేలడం, స్పర్శ సన్నగిల్లడం, చిరాకు, డబ్బు కాపీర్నం కీర్తి దాహం సంఘంలో పలుకుబడిపట్ల వ్యామోహం, మర్యాద, గుంభనం—వీటిని విడిచి శరీరం ఎక్కడికి పోతుంది ? శరీరం కృశిస్తే ఆత్మ బలం పెరుగుతుందను కోవడం వెర్రి, అసలు శరీరమే ఆత్మ అన్నది చార్వాకుల తత్వం — వెనకి చదివింది — తన కిష్టం. చార్వాకులు దేహాత్మవాదులు వారిది భౌతిక వాదం బృహస్పతి నెలకొల్పాడు మొదట్లో. జావాలికూడా, లోకంలో రాజుకి మించిన దైవం లేదన్నాడట. బుద్ధుడి సమకాలికుడైన అజిత కేశకంబలిన అనే ఆయన కూడా ఈవాదాన్నే బోధించాడుట. అట్లాగే భగురి అనే ఆయన—ఈ జగత్తుకి సృష్టికర్త అంటూలేడు తనకు తనే ఆయన ప్రమాదవశాత్తు పుట్టుకొచ్చిందన్న స్వభావ వాదం ప్రచారం చేశాడుట. నరకంలేదు. నరకాన్ని కల

ములు సృష్టించారు. బాధలేకుండా, శరీరసుఖం పొందటమే. మోక్షం, ఈ లోకం; శరీరం, భౌతిక ఆనందం – ఇవే యదార్థాలు, స్వర్గనరకాలు మాయ, కల్పితాలు, కామ ఏవ ఏకః పురుషార్థః ప్రేయసిని ప్రేమించి సుఖించు –రేపు చచ్చిపోతావు. అంటుందిచార్వాక తత్వం. ఈ రకం తత్వాన్నే – 'ఎపిక్యూరస్' అరిస్టిప్పస్' – అనే గ్రీకు తత్వజ్ఞులు కూడా బోధించినట్లు జ్ఞాపకం. రేపటి నెమిలికంటె ఇప్పటి పావురం మంచిది." అట్లాంటి పావురాలు, రామ్మూర్తి, కుమారి, ధన్యజీవులు. ప్రేమద్వారా మోక్షాన్ని, పరమాత్మని, ఆనందాన్ని సాధిస్తున్నారు. లెసరాలపై, వారి ప్రభావం ఎంతో వుంది. సరస్వతిపై బోలెడంత. వెనకటి రోజులు ఎన్ని సార్లు స్మరించినా, తామిట్లాంటివి చేసినట్లు గుర్తు రావటంలేదు, అప్పుడు భయం, సిగ్గు, ఇంట్లో మరో మనిషి వుంటె, భార్యతో మాట్లాడంగాని. చూడ్డానికి కాని వీలుపడేదికాదు. మళ్ళా చిత్రం, పిల్లలూ పుట్టుకొచ్చారు!

ఆ సాయంత్రం పుస్తకాలషాపులో కెళ్ళాడు కామేశం ఎవరో స్నేహితుడితో. ఆ స్నేహితుడు, ఒక మిత్రుడి పెండ్లికి, బహూమతిగా పుస్తకం కొనిద్దామంటే తనూ వెళ్ళాడు.

అక్కడ చూశాడు వాత్స్యాయమని కామసూత్రాలు– ఇంగ్లీషు గ్రంథం. వాత్స్యాయనుడి ప్రభావంచాలావుందిట చార్వాకుల తత్వం పైన ఆ పుస్తకం నిండా బూతు బొమ్మలు సిగ్గేస్తుంది ఒందులో ఏముందో చూద్దాం. జ్ఞానమే శక్తి అన్నాడు ప్లాటో పండితుడు. అన్నీ తెలుసు కోవాలి. మొత్తానికి కొనేశాడు. భద్రంగా తెచ్చాడు ఒంటికి. సరస్వతి స్నానం గదిలో వుంది. అమ్మయ్య, అనుకుని ఆ పుస్తకాన్ని ఒకమూల దాద్దామని, అలమార్లో వస్తువుల్ని కెలుకుతూండగా, సరస్వతి స్నానం గది తలుపు చప్పుడయింది! అక్కడేదో లావాటి పాత పుస్తకం వుంటే, ఆ పుస్తకం విప్పి, పుటల మధ్య తనుకొన్న కామ సూత్రాల పుస్తకం దాచి; దానిమీద పాతపత్రికలు పడేసి, అలమారు మూసి, చడి చప్పుడు కాకుండా భార్యని ఆహ్వానించాడు కామేశం.

ఆ నెల డబ్బు అవసరమొచ్చింది. కామేశం మూడు నెలలు గడిచాయి- రామమూర్తి అద్దె ఇవ్వలేదు. ఆ ప్రశంసే ఎత్తడంలేదు. సరస్వతిని అగడమన్నాడు కామేశం. మీరే అడగండంది.

ఒక ఉదయం వెల్లాడు. సకిలించి, గొంతు సవరించు కున్నాడు. వంటింటి గదిలోంచి బైటకొచ్చింది కుమారి స్నానం చేసినట్లులేదు. బొట్టు లేదు జడంతా పూడిపోయింది. ఆ చీరా బాగుండలేదు. అమాయ కంగా నవ్వింది- ఎత్తుకు ప్రాకలేక లోనికి దిగజారిన సముద్ర కెరటంకి మల్లె- మొదటి పేజీ చించేసిన బ్యాంక్ లెడర్ గ్రంథమల్లె.

"ఆయన బయటికి వెళ్ళారు" అంది కుమారి.

"మరి... మరి... మూడు మాసాలు..." అని మిగతాది చెప్ప లేక పోయ్యాడు ఆమె ఎందుకో సిగ్గుతో తల వంచుకుంది. కాలి బొటన వ్రేలితో నేలమీద ఏదో గీస్తోంది.

"అందుకే... వెళ్ళారు" అంది.

అందుకే వెళ్ళడం ఏమిటా అనుకున్నాడు కామేశం. మరెవ్వరి దగ్గరన్నా చేబదులు తెద్దామనా ? బ్యాంకులో ఎకౌంటు అంతా అయి పోయింది డిపాజిట్ మినహా.

"కాఫీ తెచ్చేదా ?"

"వద్దులె..."

లేచి, తలుపు వేసుకో అని తన వాటాలో కొచ్చేశాడు కామేశం కిటికీ తలుపు బాగుచేయించాలి. అద్దంపై గుడ్డలు కట్టి గడుపు కుంటు న్నారు ఆ దంపతులు. అందులోంచి వారి చేష్టలన్నీ బయిటికి కవిపిస్తు న్నాయి. కనిపిస్తున్నాయి గనుక చూడటం జరుగుతోంది. ఇంక అలా చూడకూడదు. తలుపు సందుల్లోంచి, తాళంచెవి కంతల్లోంచి – చూడడం అపరాధం అలాగే ఇతరుల ఉత్తరాలు కూడా చదువకూడదు.

మరోనెల గడిచాక సరస్వతి దూరపు బంధువు లెవరో చనిపోయా

రన్న వార్త వచ్చింది. దుఃఖించింది. కామేశం సానుభూతి కనబరిచాడు. అతను బ్యాంక్కు వెళ్ళగానే, కుమారి వచ్చి విషయం తెలుసుకొని, సరస్వతి ఎదురుగా కూర్చుని ఓదార్చింది. మధ్యాహ్నం రామమూర్తి రాగానే వెళ్ళిపోయింది కుమారి.

సాయంత్రం పోతన్నగారి భాగవతం కోసం వెదికింది సరస్వతి. కష్టాలొచ్చినప్పుడు భాగవతం చదువుకుంటుంది. కామేశం కోప్పడేవాడు. కష్టాలొచ్చినప్పుడే మనవారు భారత భాగవతాలు చదువుతారు. ఉత్తప్పుడు వాటి జోలికి పోరు. ఇది తప్పంటాడు ఆ సంస్కృత గ్రంథాలు సంతోషంగా వున్నప్పుడు చదువుకోడానికి పనికిరాకపోవడం విశేషం అంటాడు. మన వారిదంతా శ్మశాన వైరాగ్యం అంటాడు. ఆ గ్రంథాలు చెప్పే సందేశ పరంపరంలో ఒక్కదాన్నైనా జీవితంలో అమలు జరిపితే ధన్యులే. అదీ చెయ్యరు. దొంగ వేదాంతం, దగానీతి. వీళ్ళు చేసేదొకటి, చెప్పేదొకటి. పగలు ఒకనీతి. రాత్రి మరొక నీతి. ఇది రెండు నీతులజాతి అందుకనే అందరు దేవుళ్ళు, అన్ని ఆలయాలు. ఎన్నిసార్లో ఈ విషయంలో భర్తకీ తనకీ యుద్ధాలు జరిగేవి.

కనీసం కష్టాల్లోనైనా, చదువుకుని అఘోరిస్తే ముక్తి పొందుతారంటుంది సరస్వతి. కనీసం తుదిఘడియలలోనైనా దేవుడి పేరు ఉచ్చరిస్తే మోక్షం పొందుతారు. వారిని చూపిస్తే తుదిఘడియల్లో "పీచు" అంటాడు, అన్న లోకోక్తి అందుకనే ప్రచారమైందంటాడు కామేశం.

అమ్మయ్య. ఇదిగో దిక్కడ దొరికింది భాగవతం. ఈ పత్రికల కట్ట కింద అట్టలు వూడిపోయాయి. ఇదేమిటి ఇంత లావుంది. పైకితీసింది. అందులోంచి మరో పుస్తకం ఊడిపడింది భాగవతం పిల్లల్ని పెడుతోందేమిటి ? అది ఇంగ్లీషు పుస్తకం కొత్తది. పుటలు తిప్పింది, బొమ్మలు... బూతు బొమ్మలు. ఛ. ఛ. మూసేసింది. ఈయనకి ఈ వయసులో ఈ బుద్ధులేమిటి ? మళ్ళా తీసింది. ఇంకా వున్నాయి. బొమ్మలా ఆడ మగ కలిసి ఛీ ఛీ... సిగ్గుశరం లేదు ఈ మొగాళ్ళకి. కామేశం వచ్చిన అలజడి ంది.

"ఈ పుస్తకం ఏమిటండీ, ఆఫీసులో కొత్త పిల్లని ఎవర్నైనా వేశారా ? మనిళ్ళలో వుండాల్సిన పుస్తకమేనా_ మీకేమన్నా మతి పోతోందా..."

ఇంకా చాలా సేపు సాగించింది.

"అదా... అది. రంగారావని... మా ఆఫీసులో వున్నాడులే. వాడికి పేళ్ళట. పెళ్ళికానుకగా - చవకలో వచ్చింది. ఈ పుస్తకం ఇస్తే తీరిపోతుందంటే కొన్నాను. మరో ఇద్దరుకూడా ఇలాంటివే కొన్నారులే_ నేనొక్కణ్నే కాను."

"ఎవడా రంగారావు...శుభలేఖ చూపించండి" అంది సరస్వతి. కామేశం గుండె జారింది. ఇదిగో ఇట్లాంటి వివరాల్లోకి దిగుతారు ఈ ఆడవాళ్ళు అదే చిక్కు. వీళ్ళకి అందుకే పరమాత్మ చింత లేకుండా పోతూంది. ఆధ్యాత్మిక జీవితానికి తగరు వీళ్ళు. దేవుడి విషయం చూడండి. లోకాన్ని సృష్టించిపారేశాడు. ఒక లీలగా, గమ్మత్తుగా అంతే - అందులో వివరాల్ని గురించి పట్టించుకోలేదు. ఆయనకి అందులో ఏమున్నాయో తెలీయదు కూడా - అందమైన మంచుకొండలు, నదులు, సరస్సులు, కుమారి చక్కదనం వున్నాయి. రక్తంపీల్చే జలగా, వికృతమైన వానపాము, పేడపురుగు, దోమ, నల్లి, ఖడ్గమృగం...సరస్వతి... వున్నాయి. అమ్మో, ఇవన్నీ పైకి అనకూడదు.

"ఆఫీసులో పడేసినట్టున్నాను."

"ఎప్పటి పెండ్లి !"

"వొచ్చాక పార్టీ ఇస్తాడుగా. అప్పుడివ్వొచ్చులే అని అట్టే పెట్టా" అన్నాడు కామేశం.

ఆ ఆపద అల్లా తొలిగిపోయింది. కాని మరో ఇబ్బంది ఏర్పడింది, రాత్రుళ్ళు ఆ పుస్తకం తీసి అందులో ఏముందో వివరంగా చెప్పమంది చదివి. అర్థం చెప్పాడు స్త్రీ పురుషుల అన్యోన్యం, స్నేహం, పెరగాలంటే యేం చెయ్యాలో ఎల్లా ప్రవర్తించాలో ఎల్లా ప్రేమించుకోవాలో...

అవును జగత్తంతా ప్రేమమయం. మన కుమారి, మొగుడూ, నిత్యమూ చూపెడుతూనే వున్నారు..."

మనకి అది లేదుగనకనే ఈ పుస్తకాలు చదువుకోడం" అన్నాడు కామేశం.

"ఒకళ్ళకి మాత్రం ఎప్పుడూ వుంటుందా యేమిటి. అదుగో ఆ కుర్రతనం, ఆ వయస్సు వున్న నాలుగురోజులు. తరువాతేముంది మట్టి గడ్డ..."

"నిత్యమూ వుండాలనే వాత్సాయునుడి గోల. పెద్దయ్యాక చిన్నప్పటి జ్ఞాపకాలు మధురంగా వుండాలిమరి..."

"శృంగారంలో పడిపోతున్నారే..." అంది సరస్వతి – కాని తనే శృంగారంలో పడిపోతూందన్నా తన అనుమానం పైకి అనలేక పోయాడు కామేశం.

చేసిన అప్పులో యేదో అప్పు అనుకొని పక్కవాటా కిటికీలు బాగు చేయించాడు కామేశం.

"కుమారికి ఎంత భక్తి అనుకొన్నారు. ప్రొద్దుటే స్నానం చేసి— మధ్యపాపిడి తీస్తూంది మాశారా...యింత బొట్టెట్టుకొని, పట్టుచీర కట్టుకుని పూజలు చేస్తూంది. చదువుకోమని భాగవతం ఇచ్చా"

"నువ్వేమో ఈ బూతుబొమ్మల పుస్తకం పారాయణ చేస్తున్నావు అని సందు దొరికిందికదా అని లోనున్న కసిని వెళ్ళబోస్తున్నాడు కామేశం.

"అణా అద్దె లేకుండా, రాజాలాంటి వాటా ఇచ్చేసేటంత ఉదారులుగా మీరు, మీరు మట్టుకు తక్కువా ఏం—"

"నువ్వు అడగొచ్చుగా అద్దె"

"అడిగాను."

"ఏముంది ?"

"తనకి మూడో మాసంట"

పక్కన నవ్వేశాడు కామేశం.

"నవమాసాలు మోసి బిడ్డను కన్నా, అద్దె డబ్బుల బదులు ఆ పసి కందు ఏడుపన్నమాట—మనకి ప్రతిఫలం."

"మీరేగా తెచ్చిపెట్టింది."

"నీ అనుమతిలేకుండా చెయ్యలేదుగా నువ్వు 'ఊ' అంటే తక్షణం ఖాళీ చెయ్యమంటాను" అన్నాడు కామేశం.

"ఇప్పుడెల్లా అనగలమండి! చిలకా గోరింకల్లా తిరుగుతున్న వాళ్ళని, పొమ్మనగలమా. మూడో మాసం పైగా. మీరెంత కటినులండి...'

"వూరికే అన్నానే. నువ్వేమంటావో చూద్దామని."

"నిన్న కాసిని బియ్యం ఇచ్చి వొచ్చా. పాపం లేవుట."

"సాయంత్రం. ఇంత కాఫీపొడి, పంచదార కూడా ఇచ్చిరా. అవీ లేవు.'

ఇద్దరూ నవ్వుకున్నారు.

"ఏమండోయ్..."

"ఏమిటి !"

"ఆ అమ్మాయి పూజ చేసుకుంటోంది. అటూ ఇటూ చూశాడు—ఎవ్వరం లేమనుకున్నాడు కాబోలు రామమూర్తి— పీటమీద కూర్చున్న ఆమెను గట్టిగా కౌగలించుకొని తన ఒళ్ళోకి లాక్కున్నాడు-హవ్వ."

హవ్వ— దేనికి ? మొదట్లో వింత— ఇప్పుడు మామూలేగా. ఇట్లు లాక్కున్నాడా...?" అని ఎట్లా లాక్కున్నదీ ప్రత్యక్షంగా చూపే యత్నంచేసి, సరస్వతి నడుమపై చేతులువేసి బిగించాడు కామేశం.

"వెడుదురూ— ఇది సొంతంది కాదు— ఆ పుస్తకంలోనిది..." అని అతన్ని తోసేసి లోనికి వెళ్ళింది సరస్వతి.

ఆమెలో వచ్చిన మార్పుకి ఆశ్చర్యపడ్డాడు. యౌవనములో సంపర్కం వుంటె, మనలో కూడా ఆ ఛాయ పొడ సూపుతుంది కాబోలు

అనుకున్నాడు కామేశం. తనలోనూ ఏదో ఒక ఉత్సాహం చురుకుదనం వచ్చాయా అన్న అనుమానము రాసాగింది. ప్రేమికులంటే లోకానికి అంత ఇష్టం. వారి కథలు వినడానికి కుతూహలపడతారు. ప్రేమ యౌవ్వనంతో ముడిపడి వుంది. యౌవ్వనంలోనే సృష్టి శక్తులు—— అదొక జ్వాల. దేవుడు నిత్య యౌవ్వనుడై ఉండాలి. దైవానికి వార్ధక్యం లేదు. అట్లా అయివుండి కూడా, మనిషి శరీరములో నిత్య యౌవ్వనుణ్ణిగా వుంచే ద్రావకాలు—— ఎన్‌జైమ్స్‌— హార్మోన్స్‌—— మరికొన్ని చేర్చి ఎందుకు అమర్చలేదూ దైవం? తనలాగా మనిషి వుంటే ఓర్వలేదన్న మాట దైవం. అందుకే వార్ధక్యం——మృత్యువు. పరమాత్మలాగ యౌవ్వనంలో మాటలుండవు. చెప్పకొనేందుకు ఏమీ వుండదు వార్ధక్యంతోనే అలివాగుడంతా—— వెనకటివి స్మరించుకుంటారు. యౌవ్వనానికి జ్ఞాపకాలు లేవు. అందుకనే మంచితనం కూడా యువకులకే సాధ్యం. వారిలో కల్లా కపటం ఉండదు. పోటీపడటం ఉండదు. దేన్నో ఆశించి విఫలులై కఠినులుగా అవరు. బాహ్యజగత్తుతో పేచీ ఉండదు. డబ్బు కాపీర్నం లేదు. రోజుకి ఇరవైనాలుగు గంటలే వున్నాయన్నది తప్ప వేరే అసంతృప్తి లేదు. ఒకరి దేహాలని ఒకరు పరిశోధిస్తూ, అందులో రహస్యాన్ని అన్వేషిస్తూ, ఆ అన్వేషణలో ఆనందం పొందుతూ పరమాత్మలో ఐక్యం అయినట్లు ఒకరయిపోతారు. ఆ ఒకరు లోంచి మరొక ప్రాణి పుడుతుంది. అదే సృష్టి, దైవం ఒక్కటే అయినట్లు, స్త్రీ పురుషులు ప్రేమ పాశంలో ఒకరవడం కంటె, వింత ఏముంది!

తనలో వచ్చిన మార్పుకి నెల తర్వాత ప్రత్యక్ష నిదర్శనం దొరికింది. సరస్వతికి రెండో మాసం. రాము వనవాసం ముగిసినట్లు పదునాల్గేండ్ల తర్వాత మూడో కాన్పు కాదు ౪వ కాన్పు మూడో కాన్పు సంతానం దక్కలేదు. కామేశం నవ్వుతూ సరస్వతి జుట్టుని నిమురుతున్నాడు.

"అన్నట్లు, ఇవాళల్లా రామమూర్తి గాని, కుమారి గాని—— కనకనబడ్డంలేదే" అంది సరస్వతి.

"స్నేహితులింటికి వెళ్ళారేమో."

ఆ మర్నాడు కూడా, రామమూర్తి, కుమారి కనబడ లేదు వాటాలోకి వెళ్ళి చూశారు. సామానులు లేవు. బట్టలు లేవు పీటలులేవు. వారి స్వంత కుర్చీలు. మంచమూ తప్ప, యింకేమీ లేవు. ఖాళీ చేసి వెళ్ళిపోయారు. చెప్పకుండా అద్దె ఎగేసి వెళ్ళారు. సరస్వతికి కోపం వచ్చింది.

"తొందరపడకు. ఏదో విశేషం వుండాలి."

"ఏం విశేషం నా నెత్తి విశేషం. పాలదానికి, చాకలికి బాకీలే. మీకు మాబాగా చేశారు లెండి"

"చూడు ఎవరో వచ్చి పట్టున్నారు" చూసింది. ఆ వచ్చి నాయన లక్ష్మణస్వామి. కుమారి తండ్రిట. రామమూర్తి మామగారుట. విషయం చెప్పాడు.

"వాడు రాక్షసుడండీ — ఆ రామమూర్తిగాడు. మా అమ్మాయిని లేవదీసుకు పోయ్యాడు. ఇదో స్త్రీబాగుల్రి కాలేజీలో చదువుకుంటోంది. వాడూ చదువుతున్నాడు. వాడికి ప్రేమయాళ మంత్రం ఒచ్చునండీ— మందోమాకో పెట్టాడు. లొంగిపోయింది— లేచిపోయ్యాడు." లక్ష్మణ స్వామి భాష మృదువైంది కాదు. ఆవేశంలో అనరాని వంటాడు. ఆయన చెప్పినవాటి సారాంశం ఏమిటంటే రామమూర్తికి ఇదివరకే పెండ్లయిందిట ఒక పిల్లాడుట. కుమారిని మోహించి ఆ భార్యని వదిలేసి, కుమారిని లేవ తీసుకు పోయాడు. తల్లి, తండ్రి గుమ్మం తొక్కొద్దన్నారు. మొదటి పెళ్ళి తాలూకు అత్తా, మామ తన్నిస్తామన్నారుట. కోర్టులో దావా వేస్తా మన్నారుట. ఆ వూరు — ఆ వూరు వెళ్ళి తలదాచుకుని, అప్పులుచేసి పరి స్థితి ముదిరేసరికి — ఆ వూరు నుంచి బిచాణా ఎత్తి వేస్తాడుట. ఉద్యోగం లేదు. సద్యోగం లేదు. పూటకి టికాణాలేదట. అమ్మాయి నగలన్నీ అమ్మేశాడుట.

"మీరు సున్నా చుట్టాడు— పెద్ద గుండుసున్నా. ఇక్కడికి వస్తు న్నట్లు అమ్మాయికి వ్రాశా — బిచాణా ఎత్తేశాడు." అల్లా వెకిలిగా నవ్వుతూ, తాగినవాడల్లె వెర్రిగా వ్యాఖ్యానం చేస్తూ కబుర్లు చెప్పి వెళ్ళాడు లక్ష్మణ స్వామి.

కామేశం ఆశ్చర్యపడ్డాడు, సరస్వతి వాళ్ళనీ, అతన్ని దుమ్మెత్తి పోసింది.

"కనబడనివ్వండి. వాతలెట్టిస్తాను. ఈ లుచ్చాలకిచ్చామా మనిల్లు! ఎంత అప్రతిష్ట! మైలుపడింది ఇల్లు. పుణ్యాహవచనం చేయించాలి. ఇంకెప్పుడూ ఇలాంటివాళ్ళని చేరదియ్యకండి..."

రెండు రోజుల తర్వాత రామమూర్తి దగ్గరనుంచి ఒక రిజిష్టర్ సంచీ వచ్చింది. అందులో బంగారం గాజులు రెండు వున్నాయి. ఉత్తరం ఒకటుంది.

అందులో ఇల్లా వుంది

"...మామగారు మీ దగ్గరకొచ్చే వుంటారు. ఆయన మతి సరిగ్గా లేదు. కల్పించి ఏవేవో చెపుతుంటాడు. నాకు జ్ఞానం లేనప్పుడు మావాళ్లు ఒకామెను అంటగట్టారు. ఆమె ద్వారా సంతానం వున్నట్లు చెప్తాడు మామగారు. అది వట్టిది. సంతానం కలుగలేదు. జ్ఞానం వచ్చాక ఈమెను ప్రేమించాను. ఆమెకూడా ప్రేమించింది. నా కిదివరకే పెండ్లయిందని చెప్పాను. నన్ను విడిచి వుండలేనంది. ఆమెను విడిచేసి ఈమెతో వచ్చెయ్యక తప్పింది కాదు. మీ కివ్వాల్సిన అద్దెను యివ్వకుండా వచ్చేసినందుకు క్షమాపణ చెప్పుకుంటున్నాను. ఈ గాజుల జతతో సగం తీరినట్టే. మిగతాది ముందు ముందు యిచ్చుకుంటాను. ఆమెను నర్సింగ్ హోమ్‌లో చేర్పించాను. ఉద్యోగం వేట సాగిస్తున్నాను. సరస్వతిగార్కి మా నమస్కారాలు చెప్పండి. ఆమె ఋణం ఎన్నటికీ తీర్చుకోలేము. అంత మంచివాళ్ళు ఈ రోజుల్లో దొరకరు. మీరు అదృష్టవంతులు. అమ్మాయి పుడితే– ఆవిడ పేరు– అబ్బాయి పుడితే, మీ పేరు..."

ఇద్దరూ నవ్వుకున్నారు.

"నీకు ఆడపిల్ల పుడితే, కుమారి పేరు పెడతావా ఏం?" సరస్వతి నవ్వుతోంది.

"మరీ బిగ్గరగా నవ్వకేం– ప్రమాదం. చెడ్డవాళ్ళ మంచితనం అంతటి ప్రమాదం" అన్నాడు కామేశం.

# నిరంతర త్రయం

ప్రపంచంలో నేటి అరిష్టాలకి కారణం తెలివిహీనులు నిస్సంకోచంగా ప్రవర్తించడం. తెలివిగలవారు శంకలతో, సందేహాలతో బాధపడి అసహాయులవడం —అన్నాడు ఒక మేధావి. సంవత్సరాది సంచిక కథ వ్రాద్దామని బుర్ర గాలించడం మొదలెట్టేసరికి, అన్నీ శంకలే. సందేహాలే. కథావస్తువుతో అసంతృప్తి, పాత్రలపై అపనమ్మకం. ప్రయోజనంపై అవిశ్వాసం. తెలివితేటలు రచయితకి ఆటంకమేమో ననిపించింది. కాని ఒక నిశ్చయానికి రాగలిగాను. ప్రేమ కథ మాత్రం వ్రాయకూడదని. రాజకీయ చైతన్యం ప్రబలి పోయిన యీ రోజుల్లో ప్రేమకథల ప్రచారం తగ్గింది. అవన్నీ దగా అనీ, అవి రాసేవాళ్ళు సమాజానికి శత్రువులనీ. పాఠకులలో ఒక అభిప్రాయం స్థిరపడుతోందని నా కనిపించింది. ఇప్పుడు సంఘాన్ని, సంస్థలని, తెగలని, కూటాలని విమర్శించి, భూస్వామితత్వాన్నుండి బైలుదేరిన విలువల్ని హేళనచేసే కథలకే ఎక్కువ పలుకుబడి. సంఘంలోని అన్యాయానికీ, అక్రమానికీ, అధర్మానికి కారణం 'దేవుడు', 'కర్మ' కాదు. ఆర్థిక పరిస్థితులేననీ, వాటిని నలుగురం కూడబలుక్కుని సరిదిద్దొచ్చుననీ, జనానికి తెలిసిపోయింది. పాత్రలు, తరగతులకు చెందేవా రవాలి గాని వ్యక్తిత్వం, 'ప్రత్యేకత' గలవాడు కాకూడదు. ధనికులపై ద్వేషం, బీదలపై సానుభూతి పురిగొల్పాలి. మిల్లు యజమానిని నిర్మూలించడం యీ నాటి సాహిత్యంలో 'ఫాషన్'.

ఇదంతా తప్పు. చారిత్రక, రాజకీయ పరిస్థితులవల్ల సంఘాన్ని పరిశీలించి, సంస్కరించడం కళ పనికాదు; కావాలంటే దానికోసం

వ్యాసాలు వ్రాయండి, ఉపన్యాసాలివ్వండి. ఉద్యమాలు లేవదీయండి కాని, 'కథల్లోకి' దించకండి బాబూ అని నాబోటిగాడు మొరెట్టుకుంటే వినేదెవరు? నా కథలు నలుగురూ చదవాలంటే యీరకం సామాజిక ప్రయోజనంతో కూడుకున్న కథలు వ్రాయాలి. లేకపోతే, వ్రాయడం మానుకుని యే బళ్ళోనో మేష్టరుగా ప్రవేశించాలి. నాకంటె ముందుగానే ఆపని సినిమాలు చేస్తున్నాయి గనుక, ప్రేమ తత్వంవల్ల పిల్లలు పాడవుతారన్న భయం ఎవ్వరికీ లేదు.

ప్రేమకథ వ్రాయకూడదన్న నిశ్చయానికి రాగలిగినా, సామాజిక నిర్మాణాన్ని చిత్రించే కథలని గురించి అనుమానాలు రాసాగాయి. వ్యక్తులు, రాజకీయ ఆర్థిక పరిస్థితులకు లొంగిపోయి, కీలు బొమ్మలైన పక్షంలో, వారి ప్రవర్తనకి వారు బాధ్యులు కారు; సమాజం అవుతుంది. అట్లాంటప్పుడు మంచి చెడ్డలకు, నైతిక విలువలకు స్థానమే వుండదు. బాహ్య ప్రపంచంలో శక్తులకు లొంగిపోకుండా, వాతావరణానికి అతీతం కలిగినప్పుడే, వ్యక్తిగతమైన నీతి ప్రస్తావనకి తావుంది. ఇల్లా అనుకోడం కూడా భూస్వామితత్వపు నాగరికత లక్షణమేనంటే నేనేం చేసేది ?

ఈ రకం ఆలోచనలోపడి కొట్టుకొంటూండగా, తక్షణం బైలుదేరి రమ్మని కరుణాకరం దగ్గరనుంచి టెలిగ్రాం వొచ్చింది. నన్నెందుకు రమ్మన్నాడో చటుక్కున స్ఫురించకపోయినా, నా కర్థమైన ట్లనిపించింది. నన్ను రమ్మన్న కారణం ఏమిటో సరిగ్గా నిర్ణయించి చెప్పగలిగితే, ప్రేమ కథాసాహిత్యానికీ, సామాజిక కథాసాహిత్యానికీగల తారతమ్యానికి నే కట్టిన విలువల ఔచిత్యం, పాఠకులే పోల్చుకుంటున్నారన్న ఆశతో, యీ రచన సాగిస్తున్నా.

కొత్తరకం కథాసాహిత్యాన్ని ఉపాసించేవారు కరుణాకరాన్ని నాయకుడుగా అంగీకరించొచ్చు ? మిగతా విషయాల మాటటుంచి, అతను చాలా బీదవాడు. బీదతనానికి సంబంధించిన, అణకువ, నమ్రత, భయం, సిగ్గు మొదలైనవి అతనిలో ఉన్నాయి. పది

సంవత్సరాలనాటి మాట—అతనూ. నేను కాలేజీలో చదువుకున్నాం. హాస్టల్లో మా పక్కగదిలో ఉండేవాడు. హాస్టల్ ఖర్చంతా, ఏదో నలుగురు స్నేహితులం భరించే వాళ్ళం— ఎక్కువ భారం కామేశం మీద పడేది. కామేశం పెద్ద స్థితిపరుడు— సరదాకోసం చదువుకునే కులాసా పురుషుడు, మంచి టెన్నిస్ ఆటగాడు. టెన్నిస్ కోసం కాలేజీ చదువనే వాడు. భాగ్యానికీ. టెన్నిస్ ఆటకీ ఏదో సంబంధం ఉన్నట్లనిపిస్తుంది. కరుణాకరం దుస్తులు, సినిమాలు, నాటకాలు టిఫిను—అన్నీ అతనే ఆదుకునేవాడు. కృతజ్ఞతని వ్యక్తం చేసే భయభక్తులు కనబరిచినా కరుణాకరం కామేశాన్ని స్తోత్రం చెయ్యడం కాని, అతనన్న దానికల్లా తందానతానా అనడం—మొదలైన మానసిక బానిసత్వాన్ని సూచించే లక్షణాలని ప్రదర్శించే వాడు కానట్లే నాకు గుర్తు కరుణాకరం క్లాస్ పరీక్షల్లో ఫస్టు మార్కులు తెచ్చుకునే వాడు— బీదవాళ్ళు క్లాస్‌లో ఫస్టుగా మరి— అసలా కారణంవల్లనే, అతన్ని మేం తొందరగా మరిచిపొయ్యామేమోననిపిస్తుంది. నేనా సంవత్సరం ఫేలయ్యాను. వాళ్ళిద్దరూ ప్యాసై, పై చదువులకి పట్నం వెళ్ళారు. మా మార్గాలు విడిపొయ్యాయి.

ఏడెనిమిది సంవత్సరాలవరకూ మేం మళ్ళీ కలుసుకోటం పళ్ళేదు. మనదేశం పెద్ద విస్తీర్ణం కలిగి ఉండడం వల్ల కలిగే అనర్థాలలో స్నేహితులు కలుసుకోలేక పోవటం ఒకటి. చదువుకునే రోజుల్లో స్నేహాలు శాశ్వతమనీ, ఎప్పుడూ అంతా కలిసి ఒకచోటనే ఉంటామనీ అనుకుంటూ, సెలవల్లో ఉత్తరాలకోసం ఇరవై పేజీల ఎక్సర్‌సైజ్ పుస్తకాలని ఖర్చు పెడుతూ ఉండేవాళ్ళం. తరవాత, తరవాత, స్నేహితుల కలయిక మరో లోకంలోనేమో అనిపించేటట్లుగా పరిణమించింది. అంతేగాదు, వాళ్ళంతా ఏమయ్యారో వాళ్ళ జీవితాలు ఏ విధంగా పరిణమించినవో ఊహించేటందుకు కూడా వ్యవధి ఉండేదికాదు. ఏమిటో జీవితంలో ప్రధానమైన సమస్యలన్నీ ఒక్కసారిగా యవ్వనా న్నెదుర్కొంటాయి. ఓ మూల స్నేహాలు, చుట్టరికాలు, బాంధవ్యాలు, మర్యాదలూ; మరో ప్రక్క

సౌందర్యోపాసన, ప్రేమ, ఆదర్శమూర్తి, స్వప్న జగత్తు, ఇంకా సంఘముతో పోటీపడి జీవనోపాధికై ఉద్యోగాన్వేషణ పెద్దల సలహాలు, విమర్శలు, తీర్పులు—ఎవరి నీడ వారికే భయమేస్తుంది— నీడలు పొడుగ్గా ఎదిగిపోతున్నట్లు, వార్ధక్యంలో నిజంగా ప్రశాంతత, హాయి ఉన్నాయి. ముఖ్యంగా కొందరు వ్యక్తుల జీవితానుభవ నిర్మాణం మనం ఊహించినట్లుగా సాగిందీ లేనిదీ— పర్యవసానం తెలుసుకునే అవకాశం వార్ధక్యానికుంది.

మాదో పదెకరం ఇనామ్ భూముంది. అది కాస్త కవులుదారుడికి భుక్తం కాకుండా, అమ్మెయ్యమని శ్రేయస్కాముల సలహా. మంచి చెడ్డలను, ప్లీడర్‌గారి నోటంటే విందామని హయగ్రీవం గారిని పట్నంలో కలుసుకున్నాను. ఆయన దగ్గర కామేశం ఎప్రెంటిస్‌గా ఉంటున్నాడు. నన్ను చూడగానే అప్యాయంగా కౌగిలింతలో ముంచేశాడు. ఎక్కడికీ వెళ్ళడానికి వొల్లకాదనీ తన దగ్గరే ఉండాలనీ, తన కార్లో ఎక్కించుకునీ తీసుకుపోతున్నాడు. నర్సింగ్ హోమ్ దగ్గర దిగాం. తిన్నగా లోపలికి తొమ్మిదో నెంబరు గదిలో కెళ్ళాం. వరండాలో ఉన్న రెండు పేము కుర్చీలని లోపలికి తనే మోసికెళ్ళి నన్ను ఒకదాంట్లో కూలవేశాడు.

"మేలుకోవమ్మా, మహారాణీ— నేను చెబుతూండే వాణ్నే— ది కమింగ్ ఆథర్— ప్రసిద్ధ రచయిత..." అంటూ కామేశం నా భుజాన్ని నలిపేశాడు. మంచం మీద పరున్న వ్యక్తి పసుపు పచ్చరగ్గు కాస్తదించి మా పక్కకు తిరిగి చూసింది.

మా గృహిణి— ఇది మా గృహం కాదు కాబట్టి, నర్సింగ్ హోమిని" అని నవ్వడం సాగించాడు కామేశం. ఆమె రెండో చేతిని రగు లోంచి పెల్లగించి నమస్కారం చేసింది. చేతికి ఎర్ర రిబ్బను రిస్టువాచ్, రెండోచేతికి ఎర్రప్లాస్టిక్ గాజు, తలకి ఎర్రసిల్కు మఫ్లర్, 'జ్వాల ఆకారంలో ఎర్రబొట్టు, పల్చటి ఎర్రటి పెదవులు నీరసించి కరుగుతున్న సంధ్యాదేవిలా, మంచం అంతటా పాతబడి ఎరుపెక్కిన బంగారంలా వ్యాపించి వుంది కామేశం భార్య.

జబ్బుతో మంచానపడిన స్త్రీలు నాకెందుకో అందంగా కనిపిసారు. ఒకరకం అస్వస్థత ప్రతివారికీ అప్పుడప్పుడు కలుగుతుండాలని నా వుద్దేశం. అస్వస్థత శరీరాన్ని కడిగి శుభ్రపరుస్తుంది—మనస్సుని పవిత్రం చేస్తుంది; ఉద్రేకాలని సుడిగుండంలో తిప్పి, స్వప్నంలో కదులుతున్న ఉపనదిలా ప్రవహింపజేస్తుంది; కాంక్ష, కామం, మమకారం—అన్నీ శిఖరం తాకిడికి విడిపోయిన నల్లమేఘాలలాగా, చీకటి హృదయాలని వికాసంతో పొడుచుకొని, విడిపోయి, తీయటి వర్షంగా కళ్ళలోపడి, తడితో మెరుస్తాయి. ఆకాశం వాంఛతో ఎగిరిన కెరటంలోని నీలం ఆమె కళ్ళ కింద విశ్రమించింది. రేఖలు రేఖలుగా, పాయలు పాయలుగా, కనురెప్పల కింద పచ్చగా ప్రాకులాడుతూ, నీలం తెల్లబడి, పళ్ళవరసలోకి జారింది.

"అల్లా తెల్లబోతావేం—నీకు పెళ్ళాంవుంటే ఇలాంటి జబ్బు రావాలనుందా యేం—" అని కామేశం భుజం చరిచాడు. నేను అదిరిపడ్డాను. అస్వస్థతలోని అందం చూడగల్ను కాని, వ్యాధిగ్రస్తులను పరామర్శ చెయ్యడం నాకు చేతగాదు. అందులో స్త్రీలను ఎట్లా పలకరించటం ?

"ఏం జబ్బు—చెప్పకో—" అన్నాడు కామేశం.

అమాయకంగా తల తిప్పాను.

"మనిషి చిక్కని జబ్బుకి, కావల్సింది విశ్రాంతి చికిత్స—రెస్ట్ క్యూర్."

కామేశం నా వినోదం కోసం మాట్లాడుతున్నాడో, లేక మనిషి ధోరణే అంతో తెలీదుకాని ఆ వాతావరణంలాగే ఆ సంభాషణ కూడా అతిశయోక్తిగా, అసహజంగా కనిపించింది.

ఆవిడ లేచింది. బ్రెడ్, కాఫీ కప్పు ట్రేలో అమర్చి, తీసుకొచ్చి నా ముందు పెట్టింది.

"మీ రచనలు అప్పుడప్పుడు చదువుతూంటాను" అంది.

"కొంపలు తీసే కథలు వ్రాయడం ఎప్పటినుంచి మానేస్తున్నావు?" అని కామేశం సవ్వడం సాగించాడు.

కథలు చదివి కొంపలు తీసుకోడానికి సాహసించే వ్యక్తులుంటే, రచయితకి సంఘంలో గౌరవప్రదమైన స్థానం లభించి వుండేదని లోపల అనుకున్నాను.

"నిర్మొహమాటంగా, ఖచ్చితంగా చెప్పడం అవసరమంటాను. ఎవరి కొంప వారు తీసుకునే ధైర్యం లేనప్పుడే, యితరుల కొంపలు తియ్యటం జరుగుతుంది. ఔనంటారా?" అన్నది ఆమె. నా కప్పట్లో ఆ వాక్యం బాగా అర్థం కాకపోయినా, ఆమెపై గౌరవం హెచ్చింది.

"ఆయన కథల్లో ఎంతో అనుభవం ఉంది" అన్నది ఆమె. కాస్త నమ్రతతో గర్వం సూచించాను. కుర్చీలోంచి లేచాను కూడా. స్త్రీ నా రచనలను మెచ్చుకోటం కొత్త అనుభవం.

"తప్పు. ప్రేమంటే అనుభవం లేనివాడే మంచి ప్రేమకథలు వ్రాయగలుగుతాడు. అపూర్వమైన అనుభవం పొందినవాడు, దాన్ని యితరులతో పంచుకోడం అసహజం. అనుభవం కోసం ప్రాకులాడేవాళ్ళే అసందర్భపు రచనలు సాగించడం..." అనేసి, కామేశం కుర్చీలు మండువాలోకి జేరేశాడ.

"కామేశం! నువ్వు — సారస్వత విమర్శకి పూనుకోగూడదూ!" అని అడిగాను.

"జీవిత విమర్శకి తట్టుకున్న తర్వాత, సారస్వత విమర్శ" అన్నాడు పైప్‌లోకి పొగాకు అమర్చే తతంగం జరుపుతూ.

"సుగుణా— నువ్వూ ఇల్లా వొచ్చి కూర్చో" అని కేకేశాడు. సుగుణని చూసిం తర్వాత, కామేశాన్ని మరింత దగ్గరగా పరిశీలించాలని పించింది—అందమైన స్త్రీ భర్తకి పెళ్ళాం తాలూకు అందం కాస్తంత పట్టుకుంటుందన్నట్లు.

ఎత్తు నుదురు, ఎగదువ్విన మధ్యపాపిడి జుట్టూ, పెద్ద ముక్కూ, బలమైన గుండ్రటి పెదవులు. తీక్ష్ణమైన ప్రాచీన మానవత్వాన్ని, పురుషత్వాన్ని సూచిస్తున్నాయి.

సుగుణ జబ్బు ఫలానా అని వైద్యులు నిర్ణయించలేకపోయ్యారుట. స్థలం మార్పు, విశ్రాంతి వుంటే తేరకుంటుందిట. దేన్నుంచి తేరుకోడం అని అడగాలనిపించింది. ధైర్యం లేదు. కామేశం స్థితిపరుడన్న విషయం నేను మరిచిపోలేదు. మనస్సు శరీరాన్ని కలవరపెడుతుంది; శరీరం మనస్సును చికాకుపరుస్తుంది. ఆ రెంటి సమన్వయం పరిపూర్ణారోగ్యం. దానికి విశ్రాంతి, స్థలం మార్పు అవసరం. ఈ రెండూ డబ్బున్నవారికే సాధ్యపడతాయి. ఆ విధంగా, నాకు నేను సమాధానం చెప్పుకున్నా.

సుగుణ స్నానం చేసి వచ్చి స్తంభానికి కాళ్ళు అనించికూర్చుంది. బోర్డర్‌లేని తెల్లచీర, తెల్లవులెన్ మఫ్లర్ తలకి చుట్టుకుంది చెట్ల ఆకుల మధ్యనుంచి ఎండ కిరణాలుగా నుదుటి మీదపడి, కనురెప్పల నీడల్ని తీగలుగా బుగ్గలమీదికి జారుతున్న దృశ్యం—కిరణం ఆమెగా అంతమయినట్లు—నే నెప్పుడూ మరిచిపోను.

"తుదకి నా వ్యాధి ఏమని నిర్ణయించారో—." అంది సుగుణ.

"భాగ్యవంతులకి ఒకటే వ్యాధి— అమితితమయిన తీరిక" అంటూ కామేశం లేచి ఆవరణ తిరిగి, రకరకాల పువ్వులు కోసుకొచ్చి ఆమె కిచ్చాడు. అతివయ్యారంగా ఆమె వాటిని జడలో అమర్చుకుంటోంది— పువ్వుల్తో పూజించడమంటే అదే కాబోలును.

"చూశావా ఎంత అందమయిన జబ్బో!" అన్నాడు కామేశం కాస్త హేళనగా. అతను నా వినోదం కోసం మాట్లాడుతున్నట్లు ఆమె గ్రహించినట్లులేదు, కళ్ళు కోపంతో ఒక్కసారి ముడుచుకున్నాయి.

"కోపమా సుగుణా— ఆడాళ్ళకి హాస్యం, సరసం తెలీదు. లోపలి కెళ్ళి పడుకో, ఇక్కడ ఎండ" అని ఆమె చెయ్యి ఆప్యాయంగా చరిచి, లేవదీసి గదిలోకి నడిచి వెళ్ళాడు. వారి అన్యోన్యానికి నా వళ్ళు పులకరించింది. కళ్ళలోకి రానున్న తడిని రుమాలుతో తుడిచి వేశాను. నిండైన అందమయిన ప్రేమలో విషాదం వుంది కాబోలు. భార్యాభర్తలు కాకుండా నొక పురుషుడు ఒక స్త్రీ అయివుండి అంత అన్యోన్యంగా

వుంటే, అదొక శృంగార కావ్యం. వివాహం పూర్తికాని కావ్యంగా మారుస్తుంది ప్రేమని.

వెడతానని లేచాను. భోజనం చేసి, సాయంత్రం వెళ్ళమని బలవంతం చేశారు. నాకు మరోపని లేకపోతే, సన్సంగ్ హోములో మరోవారం వారితో వుండమన్నారు. సుగుణకి గుండె నీరసంట— సంపూర్ణమయిన విశ్రాంతి కోసం అక్కడ వుండటం డాక్టర్ల ఆదేశం. నౌకర్లు, చాకర్లు వంటవాళ్ళు – దివాణంలా వుండే వారి కాపరంలో, ఆమె పడే శ్రమ ఏమిటో నాకు అర్థం కాలేదు. శరీర శ్రమ కాకుండా వేరే మానసికమయిన శ్రమ లుంటాయి కాబోలు. ఆ శ్రమ మనోవ్యాధికాదు, చిక్కులవలన ప్రాప్తించింది కాదు, పరిపూర్ణ తృప్తి నుండి జనించే ఒక అసంతృప్తి కాబోలు. అమితానందంలోని వ్యాకులత, తన్మయత్వంలోని చైతన్యం; అప్రమత్తతలోని జిజ్ఞాస.

మధ్యాహ్నం కాలక్షేపానికి ఫోటో ఆల్బమ్ తీశాడు కామేశం. కుటుంబ వ్యక్తుల ఫోటోలు, బాల్యంలోవీ, వివాహ సందర్భంలో తీసినవి, హాస్టల్ ఫోటోలు. వాటిల్లో పాత స్నేహితులు, ఎవరెవరు యిప్పుడు ఎక్కడెక్కడున్నది చెప్పుకుంటూ గడిపాం.

"నా పెళ్ళికి నువ్వూ, కరుణాకరం తప్ప, యిందులో ముతా అంతా వచ్చారు తెలుసా ?" అన్నాడు కామేశం.

"నేను వద్దా మనుకున్నాను, ఆ రోజుల్లోనే నాకు ఉద్యోగం ఇంటర్వ్యూ ఒకటి తగులబడింది — కరుణాకరం ఎందుకు రాలేదు ? ఎప్పుడూ నీతో వుండేవాడుగా, ఇప్పుడేం చేస్తున్నాడో."

"ఇప్పుడంత తరచు రావటం లేదు. ఏదో న్యూస్ పేపరాఫీసులో పని చేస్తున్నాట్ట. అప్పుడప్పుడు ఉత్తరాలు వ్రాస్తూంటాడు" అన్నాడు కామేశం.

"పోనీలే— తెలివిగలవాడయినందునకు ఏదో ఉపాధి దొరికింది పాపం..." అంటూ సానుభూతి ప్రకటించాను.

"మంచివాడు- ఇంక పెళ్ళి కావడం మిగిలింది" అన్నాడు కామేశం.

"మంచితనానికి పెళ్ళి తగిన శాసా ఏమిటి ?" అని సుగుణ నవ్వింది.

నాకు నవ్వు వచ్చింది, కాసేపు ఆపుకున్నాను కాని, కామేశం గూడా విరగబడి నవ్వేశాడు.

"ఆడాళ్ళకి హాస్యం, సరసం తెలీకపోవడం, వోవిధంగా మంచి దేనేమో——" అని యింకా నవ్వడం సాగించాడు.

ఇంతలో సుగుణ లేచివచ్చి కామేశం చేతిలోని ఆల్బమ్ మూసేసి లాక్కుంది.

"ఎటేనా షికార్ పోదాం——ఇక్కడేం బావుండలేదు."

నర్స్ డాక్టర్‌గారితో చెప్పి బైటకు వెళ్ళడం మంచిదని సలహా యిచ్చింది. నేను, కామేశం వెళ్ళి డాక్టరుతో మాట్లాడి ఒప్పించాం. అట్లా షికార్లు తిరిగితే నర్సింగ్‌హో మెందుకని విసుక్కున్నా, డాక్టర్ లోకానుభవం కలవాడు.

ముగ్గురం కార్లో షికారు బైలుదేరాం. మధ్యలో దిగి "నే వెడతా" నని సెలవు తీసుకున్నా, సుగుణ కెట్లా వున్నదీ ఇంటి కెళ్ళిం తర్వాత తెలియపరచమన్నాను.

"స్నేహితులందరికీ సానుభూతి తెలిపినందుకు థాంక్ చేస్తూ, కరుణాకరం పేపర్లో ప్రకటిస్తాలే" అన్నాడు కామేశం. ఇద్దరం నవ్వుకున్నాం.

కారు దూరంగా వెళ్ళింది. నేను దానికేసి చూస్తూ అలానే నిలబడ్డా. సుగుణ బహిరంగంగా పదిమందిలోనూ వున్నప్పుడు తప్ప తీక్ష్ణంగా జీవించలేదు. ఏకాంతం ఆమెకి తగ దనిపించింది. ఆమె తేనకొనేటందు కుంద వల్సింది నర్సింగ్ హోమ్‌లో కాదు. రైల్వేస్టేషన్ ప్లాట్‌ఫారంపైన.

ఇంతకీ నేను చెప్పదల్చుకున్నది కరుణాకరం గురించి. ఇంతగా కామేశం గురించి వ్రాయడానికి రెండు కారణాలున్నాయి. కొన్ని సంవత్సరాలు గడిచిం తర్వాత స్నేహితులు కలుసుకున్నప్పుడు, వారి మనస్తత్వాల స్వరూపం విశదం చేసుకుందామన్నది మొదటిది. రెండోది కామేశాన్ని, సుగుణనీ కలుసుకుని ఉండకపోతే, కరుణాకరం ఆంతరంగిక విషయాలలో నాకు పరిచయం, కొంత వరకూ జోక్యం లభించికపోయేదన్నది.

నర్సింగ్ హోమ్ ఘట్టం జరిగిన ఒక ఏడాది తర్వాత అనుకోకుండా పట్నంలో మందులషాపులో కరుణాకరాన్ని కలుసుకున్నా. కంఠం మండుతుంటే త్రోట్ పిల్స్ కోసం షాప్‌లో కెళ్ళాను. కరుణాకరం నన్ను వెంటనే గుర్తుపట్టాడు – రెండు క్షణాల తర్వాతగాని, ప్రతి మంద హాసం చెయ్యలేక పొయ్యాను. ఎన్నాళ్ళ కెన్నాళ్ళకంటూ నా రెండు చేతులూ తన చేతుల్లోకి తీసుకొని సంతోషం వెలిబుచ్చాడు. మనిషి బాగా ఎత్తరిగా కనిపించాడు. చదువుకునే రోజుల్లో మాదిరిగా అంత సన్నంగా లేడు. జుట్టు, నుదుటిమీద మూలల్ని కాస్త పైకి జరిగింది. మధ్య పాపిడి తీసి వెనక్కి దువ్వినా, కాడల్లాగ వెంట్రుకలు ముందుకి ఒత్తుగా పడుతున్నాయి. చదరంగా, బలంగా కనబడింది మొహం. ఎడం బుగ్గ కిందుగా మచ్చ. క్షవరం చేసుకోక పోవడం మూలాన కాబోలు, స్ఫుటంగా కనబడటంలేదు. నవ్వులో కొత్తదనం, అమాయకత్వంలోని స్వచ్ఛమైన సంతోషంవున్నా కళ్ళల్లో కలత కనిపించింది—మందులన్నీ సంచీలో పెట్టుకున్నాడు.

"ఎవరు మందిస్తున్నారు ? రోగివి నువ్వే రావాల్సి వచ్చిందా మందుకి?" అనడిగాను.

కరుణాకరం నవ్వేశాడు, 'నాకేంజబ్బు. నాక్కాదు. చెప్తారా, కార్లో మాట్లాడుకుందాం."

త్రోట్‌పిల్స్ తీసుకున్నాను. అతని కోటిచ్చి నేనొకటి చప్పరిస్తూ

బైట సిద్ధంగా ఉన్న కార్లో ఎక్కాం. కరుణాకరం డ్రైవ్ చేస్తున్నాడు. ఇతనికి కారెక్కడిదా అనుకుంటున్నా. ఆకార్ని యిదివరకెక్కడో చూసిన జ్ఞాపకం. నా మనసులో భావాల్ని తెలుసుకున్న వాడిమాదిరి అతనే

'నాకారెక్కడి దనుకుంటున్నావ్—అవునా ? ఇది కామేశంది. అతనికి జబ్బుచేసింది - నీరసించి పొయ్యాడు. ఎక్స్‌రే డయాగ్నోసిస్ టి. బి. అని తేల్చింది. మూడునెల్ల నుంచీ శానిటోరియమ్‌లో ఉంటున్నాడు నేనొచ్చి నెలరోజులైంది. అతనికేమీ ప్రొద్దుపోక దిగులుగా ఉంటోందనీ, నన్నొచ్చి ఆదుకోవల్సిందనీ వ్రాశాడు. నిజంగా అతని అవసరానికి నేనుండకపోవడం అన్యాయంగా తోచింది."

"కారు నిలిపి, యిప్పుడే ఒస్తానుండమని షాప్‌లో కెళ్ళాడు. అతను చెప్పిన వార్తల్ని అవగాహన చేసుకుంటున్నాను.

అతను చివర చేసిన వ్యాఖ్యానం యొక్క అంతరార్థం నాకు పూర్తిగా బోధపడినట్లులేదు. అయిష్టమయిన త్యాగం చేస్తున్నట్లుంది. ఈ విషయం ఒదిలేసి టి. బి. గురించి ఆలోచన సాగించాను. చిత్రం ! టి. బి. యవ్వనంలో ఉన్నవారినీ, భాగ్యవంతుల్నీ పట్టుకుంటుంది. ఆ క్రిములు దుమ్ములో ఉంటాయనీ, దాన్ని పీలిస్తే సంక్రమిస్తుందని అంటారు. కామేశానికి దుమ్ముపీల్చే కర్మమేం ? అతనికి రోడ్డుమీద నడవవలసిన అగత్యమే లేదు. ఎప్పుడూ కార్లోనేకదా తిరిగేది. పోనీ, వంశ పారంపర్యంగా సంక్రమించే టి బి. కి లొంగిపోయ్యే శారీరకరుగ్మత ఉందేమో అనుకుందామంటే, అతని కుటుంబంలో ఎవ్వరికీ టి. బి. చరిత్ర ఉన్నట్లులేదు.

అయితే సుగుణ జబ్బు ఎట్లా ఉంది ?

కరుణాకరం చక్కావచ్చాడు. "ఇంక తిన్నగా శానిటోరియమ్‌కే" అని కారు పోనిచ్చాడు. బ్యాగ్‌లో టొమాటోసాస్, బ్రెడ్, క్రీమ్ క్రాకర్— ఉన్నాయి. వాటివాటి ధరలు. అవీ మాట్లాడు కుంటున్నాం. ఇంతలో శానిటోరియమ్ కొచ్చేశాం.

క్షయరోగు లుండేందుకు పెద్దభవనం ఉంది. దానిచుట్టూ ప్రత్యేక సదుపాయాలు చేసుకునే రోగులకు, ఒక అరడజను చిన్న చిన్నవి రెండేసి గదులుగలవి— బంగ్లాలున్నాయి. చివరిదాంట్లో ఉంటున్నాడు కామేశం. కారు ఇక్కడ నిలవలేదు. రెండుమూడు ఫర్లాంగుల దూరంలో, సంసారాలవాళ్ళుండేందుకు వేరే ఇళ్ళున్నాయి. ఆ ఆవరణాన్ని "సంతోషి" కాలనీ అంటారుట. అక్కడ దిగాం. ఇద్దరు నౌకర్లు కార్లోసరుకు లోపలికి చేరేశారు. వంటాయన శంకరయ్య ఉన్నాడు. అమ్మగారు అప్పుడే శానిటోరియమ్ కెళ్ళారని చెప్పాడు. నాముందు పత్రిక పడేసి, కరుణాకరం క్షురకర్మ ప్రారంభించాడు. శంకరయ్య కాస్త కొకో, బ్రెడ్ తీసుకొచ్చాడు.

"ఈ పూట యిక్కడే భోజనం" అన్నాడు కరుణాకరం.

"మొన్న పత్రికలో నువ్వురాసిన "అపరాధం" చదివాను, అప్పుడే నీకు ప్రొఫెషనల్ టచ్ వచ్చేసింది" అన్నాడు.

"అది మెచ్చుకోదంకిందే వస్తుందా ?"

"చాలా శిక్షణపొంది, ఉద్రేకాన్ని స్వీయంపై కేంద్రీకరించకుండా, పరకీయం చెయ్యగలగడం సిద్ధహస్తుడి లక్షణం అనుకుంటాను. నా కంతటి డిసిప్లిన్‌వుంటే ఎంత బాగుండును ! ఇంతకీ, ఊహలో కాకుండా జీవితంలో శిక్షణ వుండాలి. ఉహలో అందరం వేదాంతులమే—"

కరుణాకరం స్వగతంగా చెప్పుకుపోతున్నాడు.

"ప్రస్తుతం ఏదేనా పత్రికకి పుస్తక సమీక్ష చేస్తున్నావా ? అనడిగాను.

"పత్రికలకి వ్రాయడంతో భుక్తి గడవడంలేదు. ఏ పత్రికలోనేనా జేరదామంటే, పత్రికలన్నీ రాజకీయాలకి ముడెట్టుకు కూర్చున్నాయి. ఏ రాజకీయవాదం సమ్మతం కానప్పుడు భావదాస్యాని కొడిగడితేగాని, భుక్తి గడవదనుకో. అందుచేత విడిగానే సంప్రదాయంపై వ్యాసాలూ, నువ్వు అనుకున్నట్లు సమీక్షలూ వ్రాస్తూ రోజులు వెళ్ళబుచ్చుతున్నాను. సమయానికి కామేశం ఆదుకుంటూనే వున్నాడు."

క్షురకర్మ ముగిసింది. బుగ్గకింద మచ్చ. పచ్చగా మెరిసే గడ్డం లోంచి నీలంగా, మొహాన్ని వెలిగించింది. కరుణాకరం కళ్ళల్లో దైన్యం వుంది—కాని పెదవులు నవ్వడానికి సిద్ధంగా వున్నట్లుందం చూస్తే అది తెచ్చి పెట్టుకున్నదేమో ననిపించింది. యవ్వనం వెళ్ళిపోయేటప్పుడు అవయవాలకి, పరిపూర్ణతకీ, కొంచెం కరుకు తనాన్ని ఇస్తుంది కాబోలు. ఆ రెండూ అతనిలో వున్నాయి. అతను స్నానానికెళ్ళాడు. బల్లమీద సుగుణ, కామేశం తీయించుకున్న ఫోటో వుంది. దాని కింద, ఆగష్టు 15, 1947, అని వుంది— సుగుణ ఫోటోలోకంటే, బయటనే చూడ్డానికి బాగుంటుంది చర్మంలో మెత్తదనాన్ని, నుదుటిమీదా, చెక్కిళ్ళ మీదా, జ్వాలలా కదిలే రక్తపు నీడల్ని ఫోటో ప్రదర్శించలేదు.

కామేశాన్ని చూడ్డాని కెళ్ళాలంటే భయమేసింది. క్షయవ్యాధిని గురించి బోలెడు గాథ లున్నాయి. దాని దశలు— ప్రారంభం, ఔన్నత్యం, పరిమితి, పతనం — వొక ప్రాచీనయుగం నాగరికత చరిత్రలాంటిది. దానికి యవ్వనంపైననే మోజు — దానికి శారీరకానుభవం, కామం, ఆకలి, శృంగారం, వినోదం, సంతోషం, సంపద కావాలి. ప్రేమలా అది గుడ్డిది. వివక్షతలేకుండా మూర్ఖంగా వ్యక్తిని కామిస్తుంది ప్రేమలాగే ప్రాణాన్ని త్యాగంగా కోరుతుంది. అనుభవంతో తీక్షత తగ్గినట్లు వుండిపోతుంది. పోయినట్టుపోయి వొచ్చి వుంటుంది. మనిషిలో రహస్యమందిరాలని కూకటి వేళ్ళతో, జీవం అడిలోవేసిన పునాదుల్ని సహితం పెల్లగించి, ప్రతి అణువునూ తరచిచూసి, ఆవరించి, జీర్ణించుకుని, పీడించి చంపేస్తుంది. దానిష్టం-వొక్కొక్కప్పుడు-"పో అల్పుడా— నువ్వు నాకు తగవు!" అన్నట్లుగా, మహాశక్తిలాగా, చెలగాటంతో కవ్వించి వెక్కిరించి వెన్నుమీద తాపుతన్ని, అధోలోకంలోకి అస్థిపంజరాన్ని గిరవాటెట్టి వెళ్ళిపోయి, మరి రాదు. టి. బి. శృంగార కావ్యం; పురుషుడు దాని ఆటవస్తువు పావు; బతుకులు సంతానం.

అతను స్నానంచేసి వొచ్చి నన్ను స్నానాని కెళ్ళమని తువ్వాలు

సోపు తెచ్చాడు. స్నానంచేసి వొచ్చాను. పైజామా, లాల్చీ. పైన తువ్వాలు వేసుకుని, బైటికి నడిచాం.

కామేశం పడక్కుర్చీలో కూర్చుని ఉన్నాడు. సుగుణ వెనకాల స్టూల్‌మీద కూర్చుని, రుమాలుకి ఉడుకులాం రాచి అతని నుదుటిమీద తుడుస్తోంది. కేన్‌సోఫా ముందుకు లాగి మమ్మల్ని కూర్చోమంది. కరుణాకరం టెంపరేచర్ చార్టు చూస్తున్నాడు.

నన్ను చూడగానే, కామేశం లేచి, నా రెండుచేతులూ పట్టుగుని అటూ ఇటూ నాతో షచార్లుచేస్తూ, కుశలప్రశ్నలు వేశాడు. అతని వ్యాధి లక్షణాలు చెప్పాడు, సాయంత్రం వొక గంటసేపు మాత్రం, టెంపరేచర్ డిగ్రీలు హెచ్చుగా వొస్తూందిట, ఒక లంగ్ కొద్దిగా చెడిందిట. డాక్టర్లు చాలా ధైర్యంగా చెబుతున్నారట.

"నాకీ విషయం ఎందుకు తెలియపరచలేదు ?" అనడిగాను.

"నేనేం విఖ్యాతపురుషుణ్ణా? రాజకీయవేత్తగాను—సినిమా స్టార్‌నీ కాను నలభైలక్షల టి. బి. పేషంట్లలో నేనొకణ్ణి" అని నీరసంగా నవ్వాడు కామేశం. మొహంలో కండ పల్చబడింది. చర్మం మెదడుని అంటిబెట్టుకున్నట్లయింది—ముఖ్యంగా కణతల దగ్గర గొయ్యిలా, చర్మం సాగి, అదరడం కనిపిస్తోంది. కళ్ళు కూడా లోతుకిపోయినాయి. ఎప్పుడోగాని, దగ్గు రావడంలేదు. వేళ్ళు సన్నగా, పొడుగ్గా, కర్రపలకలో గండరించి తయారుచేసినట్లుగా, ఏదో పట్టుకోసం పెనుగులాడుతున్నట్లు, క్రౌర్యంతో వొంపులు తిరిగినాయి. నేను సానుభూతి ప్రకటించాను.

"ఎల్లా పరామర్శించాలో, బాగా రిహార్సల్ చేసుకొచ్చినట్లున్నావు పాపం. పెదవులు చప్పరించే స్థితికింకా నేను రాలేదులే—నిజంగా యిప్పుడే నాకెంతో ఆనందంగా వుంది. కుదిరిపోయింది పొమ్మంటారేమో డాక్టర్లు అని భయంగా వుంది" అన్నాడు. నాకు నవ్వొచ్చింది.

"శంకరయ్య భోజనం తెచ్చాడు. లేవండి" అంది సుగుణ.

"సుగుణ మాట తప్పించివేస్తోంది. వెనుక జ్ఞాపకం వుందా,

సుగుణది అందమైన జబ్బన్నాను—ఇప్పుడు నాది. సంతోషకరమైన జబ్బు—అంతే తేడా." అంటూ భోజనానికి లేచాడు.

పక్క సర్దడం, దుస్తుల అమరిక, గది అలంకారం—సుగుణ భర్తకి ఉపచారం, ఒక కళగా సాధించిందనాలి.

"ఇప్పుడు మీ వొంట్లో కులాసాగా వుంటోందా ?" అని అడిగాను సుగుణని. ఈ సందర్భాలకి అలవాటు కానప్పుడు, సంభాషణ అంత సరసంగా నడవదు.

"ఇప్పుడంటే ?" అన్నాడు కామేశం.

"వెనుక ఆయన నన్ను నర్సింగ్ హోమ్‌లో చూసినప్పుడు కంటె—అని భావం—నే నెట్లా కనిపిస్తున్నాను ?" అన్నది సుగుణ.

ఈసారికూడా ఏమనాలో తెలీక, అర్థంలేకుండా నవ్వేశాను. అది మరీ ప్రమాదించింది.

"నన్ను రాత్రి పగలూ కనిపెట్టుకుని, నాకు చాకిరీ చెయ్యడం వల్ల చిక్కిపోయిందనుకుంటున్నావా ?"

"లేదు, లేదు—అయిష్టంగా చేసిన చాకిరీవల్ల చిక్కిపోవచ్చు. ఆప్యాయతతో చేసిన పని ఆరోగ్యాన్ని పెంపొందిస్తుంది" అన్నాను.

"అవుతే యిప్పుడు నేను లావెక్కానంటారా ఏమిటి ?" అని సుగుణ నవ్వింది.

"రోగిని కనిపెట్టుకున్న వాళ్ళుకూడా నీరసంగా, బలహీనంగా కనబడటం సహజం. కరుణాకరం లేకపోతే నా పని ఏమైయుండేదో ! నిజంగా అతని ఋణం తీర్చుకోలేం. రమ్మని వ్రాయడంతోటే చక్కా వొచ్చాడు. సుగుణకి ధైర్యం చెబుతూ రాత్రి పగలు నన్ను కనిపెట్టుకుని తిరుగుతూ అతను చేస్తున్న సేవ అపారం. నాకు తగ్గి యిక్కడనుండి విడుదల కాగానే ఓ నెలపాటు ఏ ఊటీయో పోయి, అతనికి రెస్టుఇవ్వాలి" అన్నాడు కామేశం.

ఇంతలోకే కరుణాకరం డాక్టర్‌తో మాట్లాడివచ్చాడు. సుగుణతో

శ్చేమిటో చిత్రంగా ఉంటారు. అన్నయ్య కూడా అంతే వాళ్ళాఫీసులో టెలిఫోన్ అమ్మాయి ఎవరో వుందిట. దానితో స్నేహం కుదిరిందిట—షికార్లు, సినిమాలు, వ్యాపారం ముదురుతోందని తెలియగానే ఆ అమ్మాయిని మరోచోటికి బదిలీ చెయ్యడం—ఏవేవో గొడవలు జరిగినట్లు చెప్పుకున్నారు.

మరిది మధుసూదనం అంటే తనకి భయం. ఎందుకో? మనిషేమంత బాగుండడు. చామనచాయ, పెద్ద గుండ్రటిమెడ—పెద్దదట్టంగా అర్ధచంద్రాకారం కనుబొమ్మలు—ఆకాశం అంతా తెల్లగా వుండి, ఆ మధ్య నల్లటి అర్ధచంద్రుడుంటే ఎట్లా వుంటుందో అట్లా వుంటుంది. ఆ క్రాపింగ్‌కి నూని పట్టించడు. ఇన్ని నీళ్ళతో తడిపి చేత్తో నొక్కుతాడు. తల దువ్వుకోడు—దుబ్బులా పెరిగిపోయిన వుంగరాలజుట్టు, పొట్టి ముక్కు—చిన్ననోరు, అందులో మాటలు పట్టనట్లుగా—మౌనంగా వుంటాడు. అప్పుడే నవ్వు మానేసినట్లుగా వుంటుంది అతనినోరు. అతని చేతులూ, ముఖ్యంగా వేళ్ళస్వరూపం తల్చుకుంటే భయమేస్తుంది—సన్నగా, పొడుగ్గా—సన్నములక్కాడలా, కణుపులు స్పష్టంగా కనబడుచూ, చుట్టబెట్టడానికి సిద్ధపడి నట్లుగా వుంటాయి. వేళ్ళతో 'కబళింపు'—అంటే అవేగుర్తొస్తాయి. తన కింకా జ్ఞాపకం, రెండేళ్ళక్రితం అతనూ, 'నాగులు' తనూ కేంప్‌కెళ్ళారు. బంగళాలో బస, సాయంత్రం కొండవైపు నడుచుకుంటూ వెళ్ళారు. అక్కడ రాళ్ళుతవ్వి పోగుచేస్తున్నారు. తనూ చెల్లెలూ నీడలో కూర్చున్నారు. రమ్మని సంజ్ఞచేశాడు—తననో చెల్లెలినో తెలీదు. 'నిన్నేనే' అంది నాగులు. 'నే నెందుకు—నువ్వే వెళ్ళు' అంది తాను.

"నే చూసినవే లెద్దు—యీ రాళ్ళు రప్పలు—నిన్నే పిలుస్తుంట" అన్నది నాగులు.

ఆఖరుకి తనే వెళ్ళింది. చీకటిపడుతోంది. తమ నీడలు ఆ రాతినేల మీద పొడుగ్గా పడుతున్నాయి. అతను ముందు నడుస్తున్నాడు — తను

వెనక. మరో రాళ్ళగుట్టదగ్గరకి చేరుకున్నారు. అతను రెండడుగులు లోతు గల నేలలో దిగి, చెవి రాయికి ఆనించి వింటున్నాడు.

"ఏమిటది ?"

"వినండి" అంటూ ఆ వేళ్ళతో తన మొదని బిగించి, తలని నేల మీదికి వంచి, చెవి రాతికి ఆనించాడు.

"ఏమీ వినబడటం లేదూ ?"

"ఏం వినపడాలి ?" అంది తను.

"ఈ రాయి వయస్సు ఎనభై వేల సంవత్సరాలు. చూండండి. ఈ చారలు—ఒక్కొక్క చార పదివేల సంవత్సరాల కాలం జరిగి పోయి నట్లు చూపెడుతుంది. నుదుటి మీద గీతలు మనిషి వయస్సు చూపెట్టి నట్లుగా. మానవ చరిత్ర ప్రారంభానికిముందే ఎన్నోవేల సంవత్సరాలుగా వింతమృగాలు తిరుగాడిన గాథను చూచింది ఈ రాయి. ఏ నేల జంతువో ఈ రాళ్ళ మధ్య పడి చచ్చింది. దాని కళేబరం గుర్తులు యుగయుగాలుగా అల్లానే ఉండిపోతాయి. ఆ ఎముకలు పొడుమై రాతిలో జీర్ణించి పోతాయి. మనిషికి ముందు ఈ భూమి మీద జరిగిన ప్రాణుల నాటకం, చరిత్ర, అంతా ఈ రాయిలో చూస్తాం. వింటాం. ఏ వింత మృగమో భూకంపంలో కూలిన రాళ్ళ మధ్య నలిగి చచ్చిపోయ్యేముందు చేసిన ఘోష, మరణ వేదన, ఈ రాతిలో వినబడుతుంది." అని మధుసూదనం తన మెడలేవకుండా వేళ్ళతో చెవి మీది జుట్టుని కదుపుతూ, చెంపమీదికి ఉంగరం వ్రేలిని ప్రసరింపజేస్తూ తన శరీరాన్ని స్పృశించినప్పుడు తనలో రేగిన యావగింపు ఇప్పటి కింకా అల్లా నిలిచిపోయింది.

"నాకేమీ వినబడటం లేదు" అన్నది తాను. తనని లేవదియ బోయినట్లుగా, చేతిని తన గుప్పిటలో నొక్కిపెట్టి, ఒక్కసారి బలంగా పైకి లాగాడు.

మరోసారి మరోటి జరిగింది. తను స్నానంచేసి చీర కట్టుకుంటూ వుండగా తలుపు తోసి లోపలి కొచ్చి—

"మీరా, నాగులనుకున్నా" అంటూ వెళ్ళాడు.

తనేదో పత్రిక చదువుకుంటూ కుర్చీలో కూర్చుంది— ఎవరివో వేళ్ళు తన తలమీద పడి, జుట్టుని రేపుతున్నట్టయింది— వెనక్కి తిరిగి చూస్తే మధుసూదనం.

"మీరా— అదేమో ననుకున్నాను" అన్నాడు. ఇవన్నీ నిజంగా జరిగిన పొరబాట్లేనా— చెయ్యాలని చేసినవా ? తనకి తెలీదు.

కార్లో కూర్చున్నప్పుడు, ఏదో వంకని తెలీక జరిగినట్లు అతని చెయ్యి తన భుజం మీదనో, నడుంమీదనో వేసి తీరతాడు. తను కోపంగా చూస్తుంది— జాలిగా, దిగులుగా, "క్షమించండి" అన్నట్లుగా చూస్తాడు. ఏమిటి చేయ్యడం ? నాగులుతో చెబితే ? ఏమిటి ప్రయోజనం దానివలన? మళ్ళీ మాట్లాడేటప్పుడు తనని "అండి" అని సంబోధిస్తాడు భలేవాడు ! బాగోగులు తెలీవా, మంచి చెడ్డలు లేవా ? అభం శుభం వుండొద్దా— రాళ్ళు పరిశోధించే ఉద్యోగం—జియాల జిస్టు—రాతిబొమ్మలా ఉంటాడు రాతిగుండె, తగిన ఉద్యోగమే లభించింది.

మాట్లాడుతూ మధ్యలో నిలిచిపోయి, తన కళ్ళల్లోకి తేరిపార చూస్తూంటాడు. తనకి అది చాలా బాధగా వుంటుంది. అతని దృష్టిని తన కళ్ళనుండి మరల్చి, పమిటికేసి ప్రసరింపజేస్తాడు. తనకి సిగ్గేసి అక్కడ నుండి వెళ్ళిపోతుంది.

జ్ఞానసుందరి ఆ సిగ్గుని జ్ఞాపకం తెచ్చుకుని పమిటి బాగా సర్దుకుని దుప్పటి రొమ్ములపైకి లాక్కుని, చేతులు గుండెమీద బిగించి పడుకుంది. చేతిమీది వాచ్ కేసి చూసుకుంది నల్లటి డయల్‌పై ఎర్రటి అంకెలుగల రిస్ట్‌వాచ్— మధుసూదనం పుట్టినరోజునాడు భార్యకిచ్చినది తనని పెట్టు కెళ్ళమంది చెల్లెలు అప్పుడప్పుడు తను పెట్టుకునేది. ఓ రోజు తను కిటికీలోంచి చూస్తూ నిలబడింది. మధుసూదనం ఆ గదిలోకొచ్చి తన చేతిని పటుకుని టెముకోసం వాచిని చూషినటుగా చెయిం వేళ్ళతో బిగిం

చాడు. తను విసుగుతో విదలించుకుని బయట కొచ్చేసింది. ఇట్లాంటివి జరిగినప్పుడల్లా తనేదో సాకు చెప్పి, కలకత్తా అన్న దగ్గరకు ప్రయాణం కట్టి వెళ్ళేది. తనకి భర్త లేకపోవడంబట్టేగా యింతగా చొరవగా ప్రవర్తి చడం ! తనకి మళ్లా పెండ్లి చెయ్యాలని ఎందరో ప్రయత్నం చేశారు. అన్న పట్టుదలతో తిరిగి సంబంధాలు చూశాడు. మధుసూధనం "చేసుకోండ"ని సలహాలిస్తూ వచ్చాడు. తనని స్కూలులో చేర్పించారు. అక్కడ మొగపిల్లలు గోడల మీద వ్రాతాలు వ్రాయడం. ఉత్తరాలు రాయడం ఏవో గొడవలు జరిగితే భరించలేక తను చదువు మానేసింది. కొంత కాలం ఇంట్లో వీణ చెప్పించారు. తనకి సంగీతం అబ్బింది కాదు—సంబంధాలు కుదరలేదు. తనదృష్టి ఏ పురుషుడిపైనా పడలేదు. జనార్ధనం పద్యాలు వ్రాసేవాడు. కొంతకాలం స్నేహంగా వుండేవాడు. తర్వాత రఘురామయ్య బాగా చదువు కున్నవాడు. తనని ఆదరణతో చూసేవాడు ఇప్పుడవన్నీ తల్చుకుంటే బెంగగా వుంటుంది. ఏదో సిగ్గు, భయం, న్యూనత, బాల్యం, పెళ్ళి, భర్త అవన్నీ తల్చుకుంటూ ఆ దిగులు ప్రపంచంతో పంచుకోకుండా తనలో దాచేసుకుని ఏకాంతంగా గడపడమే తనకి బాగుంది. కలకత్తాలో స్త్రీల సంక్షేమ బృందంతో కలిసి, దగ్గరలోవున్న పల్లెటూళ్ళకి వెళ్ళి అక్కడి వారి ఇల్లు వాకిలి పరిశుభ్రం చెయ్యడం, కుటీర పరిశ్రమలకి తోడ్పడడం మొదలైన సంక్షేమ కార్యకలాపంలో తన బాధ మరిచిపోతుంది.

పదకొండైంది లైట్లు ఆర్పేసి అంతా నిద్రపోతున్నారు. లైటువేసి తలగడకింద దాచిన చెల్లెలు ఉత్తరం తీసి చదవడం మొదలెట్టింది జ్ఞానసుందరి. ఆ వాక్యాలు సరిగా చదివితే ఏదేనా కొత్త అర్థం స్ఫురిస్తుందేమోనన్న ఆశతో. ఎక్కడికి వెళ్ళుంటాడో తను ఊహించగలదా? ఎందుకు వెళ్ళుంటాడో తనకి తోచనికారణానికి ఆ ఉత్తరంలో అర్థాలేమైనా వున్నాయా! చారుమతి చటుక్కున లేచి ఆ దీపం కాస్తా ఆర్పేసింది. పోనీ ప్రొద్దున్నే చదవచ్చు మళ్ళా దుప్పటికప్పుకుని పడుకుంది జ్ఞానసుందరి.

రైలు ఒక క్రమంతో వేగంగా నడుస్తోంది. యాత్రకి బైలుదేరిన విద్యార్థినుల బృందానికి యజమాని షీలా లాజరస్. పెద్దదామె నెమ్మదైంది. అనుభవంగలది. ఆమెతో చెల్లెలికి జబ్బుగా వుందని సాకుచెప్పి తను తిన్నగా ఇంటికి వెళ్ళడానికి నిర్ణయించుకుంది. విచారం కూడా వో రకమైన జబ్బేగా—మానసిక మైంది. ఆమె ఎన్నో పుణ్యక్షేత్రాలు, ప్రసిద్ధమైన కట్టడాలు చారిత్రకస్థలాలు చూసింది యీ యాత్రలో అన్నీ వొకలాగే వున్నాయి. వాటినిచూస్తే భయమేస్తుంది. అంతంత పెద్ద సౌధాలు, శిలా ప్రతిమలు ఎందుకు నిర్మించారో పూర్వం వాళ్ళు? ఏది చేసినా భారీ కృషి. పూర్వం వాళ్ళు యిప్పటి వారికంటె ఎత్తుగా, లావుగా వుండేవారా? తనకి తెలీదు. క్రితం సంవత్సరం గుంటూరులో బంధువుల పెండ్లికి వెళ్ళినప్పుడు, తనూ, నాగులు మధుసూదనం మరికొందరు పెండ్లి వారి తాలూకు అమరావతిలో స్తూపాలు చెక్కడాలు చూసివొచ్చారు. తిరిగి తిరిగి అలిసి తనో మూల స్తంభం వెనక బండమీద కూలబడింది. మిగతా వాళ్ళు ముందుకి సాగిపొయ్యారు. ఓ పావుగంటకి మధుసూదనం వచ్చి మంచి చిత్రం చూపిస్తాను. రమ్మని భుజంమీద చెయ్యివేసి లేవ దీశాడు. తను విదిలించేసింది. ఏం పనవి? అక్కడ ఓ స్త్రీవిగ్రహం ముందు నిలబడ్డాడు. ఆ బొమ్మ స్తనాలమధ్య చెవి ఆనించాడు.

"ఏంపనవి" అని మందలించింది తాను.

"ఇది ఎర్రరాయి—రెడ్‌స్టోన్. రక్తమాంసాలుగల స్త్రీమూర్తి ఇది. ఆ చీరలేకుంటే మీ రిట్లాగే వుంటారు?" అని మళ్ళీ అతని చూపు తన రొమ్ములమీదికి, నడుంపై పుకీ మరల్చాడు. తను వెనక్కి తిరిగిపోయింది.

"ఇప్పుడు మరీ అచ్చంగా ఇల్లాగే వుంటారు."

"ఈ విగ్రహం వెనక చరిత్రలో ప్రేమకోసం విలపించిన స్త్రీల రోదన వినబడుతోంది. లోపల ఒత్తిడికి తట్టుకోలేక రక్తం చర్మంపైన చిందినట్లు చిత్రించాలని ఎర్రరాయి వాడారు. అమరావతీ శిల్పులు అమర్థులు."

"ఇదంతా నాకెందుకు చెబుతావు?"

"మీరు వినరుగనక"

నవ్వుని బలవంతాన ఆపుకుంది తాను. ఆ మనిషినోటికి శుద్ధీబద్ధీ లేదు—నైతికచింతనే వున్నట్లు లేదు.

"నాగులుతో చెప్పనా?"

"ఎందు కంత కఠినశిక్ష?"

"మరేంమ్మాట లవీ?"

"కాసేపేనా మన నిజస్వరూపాలు బైటపెట్టుకునే అవకాశాలు కల్పించడమే యీ కళాఖండాల ప్రయోజనం."

"మంచివాడివే."

"కాసేపు ఆ మంచిచెడ్డల ప్రస్తావన మాన్పించలేకపోయిందంటే ఈ అమరావతీ శిల్పులసృష్టి వృథా."

తాను వెళ్ళిపోయింది వెనకాల నడుస్తున్నాడు. తనకి ఆయాసంగా వుంది.

"ఆయాసంగా ఉందా ?"

"అదే సర్దుకుంటుంది. నువ్వెళ్ళు"

"తీసుకెళ్ళనా ?" నడుంచుట్టూ చేతులు బిగించబొయ్యాడు—తోసేసి వెనక్కి తిరిగింది.

"వొద్దు— నువ్వెళ్ళిపో— లేకుంటే కోపంవస్తుంది. ఇంకెప్పుడూ మీవూరికి రాను. ఇట్లా చేశావంటే— కలకత్తాలో ఉండిపోతాను."

"ఆ శిలేనా కరుగుతుంది— మీరు మాత్రం..."

తాను గబగబ నడిచి వెడుతోంది. అతను నిట్టూర్పు నట్లనిపించింది. వెనక్కి తిరిగి చూడలేదు.

జ్ఞానసుందరికి నిద్రపట్టేసింది. బరువుగా గుండెమీద ఎవరో రాతి చెయ్యిని ఆనించినట్లయి పక్కకు తిరిగింది. తాను కదిలిపోతోంది. రైలు నడకతో లయకల్పుతున్నట్లు గుండెలు అదురుతున్నాయి. తనెక్కడికో కిందకి ధాళి గుహాంతరాళాలలోకి జారిపోతోంధి,

తెల్లవారింది. స్టేషన్‌లో రైలు నిలిచింది. అంతా సామానులు సర్ది దిగుతున్నారు. సావిత్రి ఆమెను పక్క మీద నుంచి లేవదీసి, పక్క లుంగ చుట్టి ప్లాట్‌ఫారం మీదికి గిరవాటెట్టింది. తనూ దిగింది. పక్కచుట్ట సర్ది లోపల్నించి చెల్లెలి ఉత్తరం తీసి బాగ్‌లో పెట్టుకుంది. అందరూ హోటల్‌కి చేరుకున్నారు. స్నానాలు, ఫలహారాలు అయినాక ముందు ఏది చూడాలో వాదించుకుంటున్నారు కొందరు ఎల్లోరా గుహలన్నారు. ఇరవై మైళ్ళు-చూసి సాయంత్రానికి తిరిగి రావొచ్చు. మరికొందరు అజంతాకి పోదామన్నారు, రాత్రి అక్కడ గడిపి మర్నాడు తిరిగి రావొచ్చు. రాత్రి అజంతాలో గడపడం మంచిది కాదన్నారు. అక్కడ వసతి, తిండి సదుపాయాలు లేవన్నారు. ఈ తిండి, సుఖాలు రోజూ వుండేవే. యీ ఒక్కరాత్రి కష్ట పడదాం అన్నారు. షీలా లాజరస్ సాయంత్రానికి వచ్చి తీరాలని తీర్మా నించింది. అప్పుడే బయలుదేరి భోజనాలు పట్టుకుపోయి, రాత్రికి తిరిగి వచ్చే ఏర్పాట్లు చేసుకుని బస్సులో అజంతాకి బయలుదేరారు.

మధ్యలో ఏదో చిన్న నది, అక్కడ బస్సు నిలిపి ఆ నదిని చూశారు. మళ్ళీ కొంతదూరం వెళ్ళాక ఓ వూరు. చుట్టూ పెద్ద గోడ—బురుజులు. మరో వూరు. దానిపేరు 'అజంతాట'. బొత్తిగా పల్లెటూరు. అనాగరీకులుగా కనిపించే మనుషులు. రోడ్డుప్రక్కన కంప ఏరుకుంటూన్న ఓ నల్లపిల్లని చూపించి "అదే అజంతా సుందరి" అని ఆక్షేపిస్తూ నవ్వు తోంది గంగూబాయి.

"సుందరిగారూ, మీకు నల్లరంగువేస్తే అచ్చంగా అజంతా బొమ్మలా ఉంటారు" అన్నది సావిత్రి. సావిత్రి నల్లగా వుంటుంది, గంగూబాయి నలుపు. నల్లవాళ్ళకి, మిగతా అందరూ నల్లగా వుండాలని ఉంటుంది కాబోలు !

చారుమతి మాట్లాడుతోంది. ఆమెకూడా నలుపే— మరీ నలుపు కాకపోయినా.

"బుక్కులో చదివా. ఎర్రరాళ్ళు పొడుంచేసి రేగడి మట్టితో కలిపి

మొదట గోడమీద పూస్తారుట, దానిమీద సున్నం వేస్తారుట. రంగుల కేమో— అక్కడ చెట్లబెరడు, నార, ఆకులు కలిపి తొక్కి, కాస్తంత ఆవుపేడకూడా పట్టించగా వొచ్చిన రంగుని పూస్తారట, అవుపేడ నలుపేగా."

షీలా లాజరస్‌కి యీ సంభాషణ నచ్చినట్లులేదు.

"కాసేపటిలో చూడబోతున్నాంగా- వ్యాఖ్యానాలు అప్పుడు మొదలెడదాం" అని నవ్వుతూనే మందలించింది.

ఎత్తుగా కొండ— దాన్నిండా పెద్ద పెద్ద చెట్లు, మలుపుల్లోంచి పోతోంది బస్సు. అవతల పెద్ద లోయ—అందులోకి దిగుతోంది మరో కొండ. తిరిగి తిరిగి కిందికి వచ్చేసింది బస్సు. జనం అలజడి. ఒకటి రెండు టీ దుకాణాలు. వింత దుస్తులతో రకరకాల మనుషులు వస్తూ వెడతూ వున్నారు. దూరంగా పావురంగూళ్ళల్లా వున్నాయి అజంతా గుహలు. కుడివైపున చాలా దూరాన వున్నది యాత్రికుల వసతి గృహంట. పదకొండయింది ఒంటిగంట వరకూ కొంత చూసి, వసతి గృహంలో భోజనాలు చేసి మళ్ళా వచ్చి మిగతా గుహలు చూసి, సాయంత్రము ఏడింటికి తిరుగు ప్రయాణం నిర్ణయించారు.

కొంతదూరం మెట్లమీదుగా నడిచి గుహలకి చేరుకున్నారు. ఎదురుగా వున్నది ఇన్‌హ్యాద్రి కొండలు. దాని దిగువభాగం గుహలుగా దొల్చారట. గుర్రపునాడా ఆకృతిలో వున్నాయి గుహలన్నీ.

ఎదురుగా చిన్న నది—వాఘోరా. చిన్న జలపాతం కూడా వుంది—సత్కుందంట పేరు.

గుహల్లోకి ప్రవేశించారు. లోపలంతా చీకటిగా వుంది. ఎవరో ఒకాయనొచ్చి గోడమీది చిత్రాలను గురించి చెబుతున్నాడు ఇంగ్లీషులో, ఉర్దూలో. మధ్య మధ్య ఒక పెద్ద డైనమోదీపం చిత్రాలపై ఫోకస్‌చేస్తూ వర్ణిస్తున్నాడు. పదవగుహ అతి ప్రాచీనమైనదిట శాక్యముని ఆరాధనా చిత్రం తనకి ఆకర్షణీయంగా వుంది. పదహారవది నాగరాజు మందిరం.

అందులో చనిపోతున్న ఒక రాకుమార్తె చిత్రం వుంది. ఆ రాకుమార్తెను గురించి ఒక గాథ చెప్పాడు. ఆమెకి సరిగ్గా అర్థం అవలేదు. ఆ రాకుమార్తె పేరు 'సుందరి'ట.

"అందుకే నిన్ను అజంతా సుందరి అంటా... ఎటొచ్చీ నువ్వు మొహానికి కాస్త నల్లరంగు పూసుకోవాలి" అని చారుమతి తనని హేళన చేస్తోంది.

"నీ పేరు జ్ఞానసుందరి— పేరు కూడా సరిపోయింది" అంది గంగూబాయి. అందరూ నవ్వారు. వర్ణిస్తున్న వ్యక్తికి ఏమీ అర్థంకాక, ఏదో తెలిసినట్లు తనూ నవ్వుతున్నాడు జ్ఞానసుందరికి సిగ్గేసింది. తనకి భర్త లేకపోవడంవల్లనేగా వీరందరికీ తనంటే పరిహాసం.

"ఆ రాకుమార్తెకి భర్త వున్నాడాండీ ?" అని గైడ్‌ని అడిగింది సావిత్రి.

"ఆమె నందునిపతి. నందుడు సిద్ధార్థుని పినతల్లి కుమారుడు."

"పాపం" అంది చారుమతి. మళ్ళా అందరూ బిగ్గరగా నవ్వారు, జ్ఞానసుందరికి కోపం వచ్చింది— తగినంత కారణం కనబడకపోయినా. ఏదో వినోదించాలిగనక, వీళ్ళంతా తెచ్చి పెట్టుకుని, బలవంతంగా, అసహజంగా నవ్వుకుంటూ, అదంతా అనుభవంగా పరిగణిస్తున్నారు. తనకిది నచ్చలేదు.

ఒంటిగంట కావొస్తోంది. బసకి పోదామన్నారు. జ్ఞానసుందరికి అలసటగా వుంది. ఆకలేస్తోంది, తనింక తిరగలేదు. ఎవరేనా మోసికెళ్ళి ఆమెను బస్సులో పడేస్తే బావుండును. లోపల గాలిలేదు. ఉక్కగా వుంది. చెమట్లు పోస్తున్నాయి. చీరకొంగుతో తుడుచుకుంటోంది. చలికి తెచ్చుకున్న శాలువ మడిచేసి భుజాన వేసుకుంది. వెనక్కి తిరిగి మెల్లగా మెట్లు దిగి బస్సుదగ్గరకి చేరుకుంది. మరో పావుగంటలో మిగతావారంతా వచ్చారు. బసలోకి వెళ్ళారు. భోజనాలయ్యాక ఓ అరగంట విశ్రాంతిగా కబుర్లు చెప్పుకుని మళ్ళా బయలుదేరారు.

జ్ఞానసుందరి తనకి తలనొప్పి, ఆయాసంగా వుంది. రాలేనంది తలనొప్పికి ఒక మాత్ర యిచ్చింది సావిత్రి. తను నడిపించి తీసుకెడతానంది చారుమతి. తను రాకపోతే నేనూ వెళ్ళనంది గంగ—

బస్సులో అక్కడిదాకా వచ్చి వూరికే చూస్తూ ఎక్కడో ఓచోట కూర్చోవచ్చు రమ్మంది షీలా లాజరస్. బయలుదేరారు గుహల దగ్గరకి చేరుకున్నారు. జ్ఞానసుందరి బస్సులో పడుకుంటానంది. మిగతావాళ్ళు లోపలికెళ్ళారు. కాసేపు కళ్ళు మూసుకుని పడుకుంది సుందరి. అరగంట అయింది. టీ దుకాణం దగ్గరకెళ్ళి కాస్త టీ పుచ్చుకుంది. నది వొడ్డున నడుచుకుంటూ వెళ్ళింది. అన్నీ రాళ్ళు. చిన్నవి పెద్దవి—సిమెంటు రంగువి, ఎర్రవి—చిన్న రాతిగుట్టలు. జలపాతం సన్నధారలుగా, చీర నేతలో మధ్యలో వదిలేస్తే మిగిలిన దారాల జాడనేతలా, తిన్నగాపడి రాళ్ళమీద నాచుపై చిత్రాలుగీస్తూ, రేకుమీద వర్షం చినుకులుపడ్డ చప్పుడు చేస్తూ—అదే చప్పుడు, అదే చిత్రాలు— విసుగు కలిగిస్తున్నాయి ఆమెకు.

మరికొంచెం దూరం నడిచింది. ఐదు దాటింది. చెట్ల వెనకనుంచి సంధ్య వెలుగులో అతిశయోక్తిగా పరిభ్రమిస్తూ వున్న పొడుగాటి నీడలు, పచ్చబడి, రాళ్ళ రంగుల్ని వెలిగించి. ఆకృతుల్ని మార్చి దిగజారుచున్నాయి. ఆకుల మధ్య కిరణాలు వనదేవత కుట్టుపనిలో సూదులలా వెనక్కి ముందుకి కదులుతున్నాయి. గాలి తగ్గింతర్వాత అగ్నిదేవుడు వేసిన గాలిపటం కిందకి పడిపోతూన్నట్లు, నీడలు వెనక్కి వెనక్కి వెడుతున్నాయి. ఆ దూరపుకొండ ముసుగు తీసేసినట్లయింది. కొండ మలుపులో పచ్చిక బయళ్ళు-వస్తూవున్న జుట్టులా కనిపిస్తున్నాయి. కన్ను మెదిపినట్లు సూర్యబింబం గుహల వెనక జారుకుంది చివరికిరణాలు, అలిసి పడున్న ప్రకృతిని, జలపాతం నీటిని, మేఘాలని, రాళ్ళసమూహాలని, ఒక్కసారి వెన్ను మీద చరిచి లేపినట్లు బంగారం కరిగి, ఎర్ర రాళ్ళ మొహాన జారిన కుంకుమ బొట్టులా మారి మందారం మధ్యలో

ముదిరిన ఎరుపులో నలుపులా, ఇంద్రజాలికుడు పరికరాల్ని బుట్టలో వేసుకుని వెళ్ళిపోతే వీడ్కోలివ్వడం యిష్టంలేక సంధ్యాకాంత ముసుగు బిగ తన్నిపరుస్నట్లనిపించింది, జ్ఞానసుందరి శాలువా తీసి నెత్తిపైనుంచి, మెడ చుట్టూ తిప్పి, భుజాలమీదికి లాగి చేతులు బిగించి కప్పుకుంది. వాళ్ళంతా ఈపాటికి వొచ్చేస్తూ ఉంటారు. తనకోసం వెదుకుతూవుంటారు. కాసేపు వెదకి, కనబడక వెళ్ళిపోతారు. అంతేగా! వాళ్ళకి తనపై అంతకంటే ఏముంటుంది? ఇక్కడెవ్వరూ లేరు. తనొక్కత్తే— ప్రకృతిలో ఒక భాగం. ప్రకృతి కదలదు. తన గుండెలు బాధతో కొట్టుకుంటూవుంటే, ప్రకృతి చెవులు నిక్కబొడిచి చోద్యంగా వింటూంది. సాహసంత్రానికి అలిసినట్టు, నీరు వడితగ్గి, చప్పుడులేకుండా దొర్లుతూ వుంది. నీటికింద రేగడి- మధ్యలో ఎర్రటి ఇసుక- కిందకి దిగింది. ప్రక్కన ఏవో ఖట్టలు కనిపించాయి. ఎవరో వున్నారు, వెనక్కి వచ్చేసింది. రాతిబండ వెనుకనుంచి ఎవరిదో తల కనిపించింది. వొళ్ళు తుడుచు కోవడం అయిం తర్వాత మొహం కనిపించింది, మరిది మధుసూదనం! ఆశ్చర్యపడింది.

"రండి" అన్నాడు.

గడ్డం పెరిగింది. అక్కడక్కడ తెల్లవెంట్రుకలు- కళ్ళకింద గీట్లు, దుబ్బులా వుంగరాలజుట్టు. గుండ్రని పొట్టి మెడ — వెంట్రుకలు లేని ఛాతీ— సంశయంలేదు, మధుసూదనమే.

"ఇక్కడున్నావా ?

నవ్వుతున్నాడు.

"స్నానం చేస్తారా ?"

"ఇంత చల్లోనా ?"

"చలిలో చన్నీటిస్నానంలోనే వుంది మజా అంతా."

"ఇంట్లో చెప్పకుండా వచ్చావెందుకు ?"

"చెబితే రానిస్తుందా; మీకు తెలీదా ?

"ఉత్తరం వ్రాసింది. మధురభక్తి బెంగ పెట్టుకుందిట, నువ్వెక్కడి కెళ్ళావో తెలియక చెల్లాయి బాధపడుతోంది."

"ప్రతిప్రాణీ బాధపడాలి. అది సృష్టిలోనే వుంది."

లాల్చీ వేసుకున్నాడు. తువ్వాలుపిండి రాళ్ళమీద ఆరబెడుతున్నాడు. జుట్టు కాడలలాగ నుదుటిమీద, కళ్ళల్లోనూ పడుతోంది. నాగరాజ్యలక్ష్మికి వెంటనే టెలిగ్రాం యివ్వాలి. మనస్సు పదిలపడుతుంది.

"ఇటు నీళ్ళల్లోకి దిగండి."

కిందకి నీళ్ళల్లోకి దిగింది – ఇసుక నీళ్ళల్లో కనిపిస్తోంది – వింత వింత రంగుల చేపలు పసుగు లెడ తున్నాయి. బట్టల సంచీలో వేసుకున్నాడు మధుసూదనం.

"ఏయే వూళ్ళు చూశారు. చూపిన వింతలు చెప్పండి."

చెబుతోంది, తన మనస్సు ఒక చోట శరీరం మరోచోట వుండి, శరీరం చూపినదాన్ని మనస్సు చెబుతోన్నట్టు – తనకి వర్ణించడం రాదు, ఏది బాగుందో, ఏది బాగాలేదో చెప్పలేదు. యాత్రలో చూసిన దృశ్యాలకి ఏ ప్రభావమూ లేకతన మీద పోవడం ఒక్కటే విశేషం.

"అజంతా బావుందా ?"

తనకి తెలీదు. అన్నీ చూడందే!

"తలనొప్పి—ఒంట్లో ఎల్లాగో వుంది. అంతా చూడలేదు."

"ఈ నీళ్ళలో మొహం కడుక్కోండి."

కడుక్కుంది. చల్లగా వుంది—హాయిగా, తేరుకున్నట్లు, ప్రశాంతంగా వుంది. పూర్ణచంద్రుడు నిశ్చలంగా మెరుస్తున్నాడు. రాళ్ళ నీడలు, చంద్రుని వెలుగు నీళ్ళల్లోపడి అలలుగా సాగిపోతున్నాయి. చెట్ల ఆకులు ఆకలి తీరింతర్వాత ఆటకు బైలుదేరినట్లు రాలిపడుతున్నాయి. దూరంగా మనుషుల కేకలు, ఏవో అరుపులు, జలపాతం జాలిగా రోదిస్తోంది.

"వాళ్ళు నాకోసం వెదుకుతూ వుంటారు. వెడతాను. నువ్వు ఇంటికి రావూ?"

రా నన్నట్లు తల పంకించాడు. మనిషి శుభ్రంగా కనబడుతున్నా ఆ జుట్టూ ఆ వాలకం చూస్తే ఆమెకి రోత పుడుతోంది.

"ఎప్పు డొస్తావు?"

"ఏమో!"

"ఏమో ఏమిటి?"

మాట్లాడడు

"ఇక్క డేముంది?"

నవ్వుతా డేం!

"చెప్పు, ఏమిటా వాలకం, ఆ అవతారం?"

"ఈ ప్రపంచంపై రోతపుట్టినప్పుడల్లా దేవుడు ఓ అవతారం దాలుస్తాడంటారు పెద్దలు. ఆ యుగం అంతమొందుతుంది. మళ్ళా కొత్త యుగం, మరో అవతారం, అల్లా పది అవతారాలు జరిగాయట. నా ఉద్దేశం ఏమిటంటే ప్రతిమనిషి యీ పది అవతారాలు, తన జీవితంలో దాలుస్తూ వుంటాడని. మనిషి ఆయుర్దాయం వంద సంవత్సరాలను కుందాం. పదేళ్ళ జీవితం ఒక యుగం. పదేళ్ళకోసారి మరో జీవితం మొదలెడతాడు. కొందరి అవతారాలు బైటకి కనిపిస్తాయి. కొందరు లోలోన మార్పులకి గురవుతారు. తల్లి గర్భంలో శిశువు కూడా పదినెలలు పదవతారాలు దాలుస్తూ వుంటుంది."

నవ్వొస్తోంది యీ మాటలకి.

"నీ దే అవతారం యిప్పుడు?"

"వరహావతారం."

నవ్వుకున్నారు.

"ఎప్పుడొస్తావని చెప్పను?"

"మీరు నన్నిక్కడ చూసినట్లు మాత్రం చెప్పకండి. అ దొక్కటే నే కోరేది."

'అబద్ధం నావల్లకాదు. ఎంతో ఆత్రుతతో నీ కోసం ఎదురు

చూస్తూ వుంది. అన్నయ్య దేశం అంతా గాలిస్తున్నాడు. ఆఫీసువాళ్ళు కూడా వాకబులు చేస్తున్నారు. ఈపాటికి పోలీసులకి ఫిర్యాదుచేసే వుంటారేమో కూడా. నీకేం వారిని గురించి పట్టలేదా?"

"ఇన్నాళ్ళూ పట్టింది."

'ఇప్పు డేమొచ్చింది?"

"స్వేచ్ఛ."

"చట్టుబండలు."

"ఇక్కడవే వున్నాయి. వాటిమధ్యనే స్వేచ్ఛ."

"ఇంటిదగ్గర స్వేచ్ఛకాక పీక్కుతిన్నారా నిన్ను!"

"సందేహం ఏమిటి—తప్పకుండా పీక్కుతిన్నారు."

"ఎవర్నైనా తీసుకొచ్చావా?"

తను ఈ ప్రశ్న అడగకుండా వుండా లనుకుంది. కాని అడిగేసింది. వాక్కుపై ఆమెకి అధికారం లేకుండాపోయింది. ఇప్పుడు నాలుక కొరుక్కుని ఏం ప్రయోజనం!

"ఆ"

తల పంకించి, నవ్వుతున్నాడు. అనుకున్నంతపనీ చేశాడు దుష్టుడు. కొంప మునిగింది. ఈ వయస్సులో, ఆరేళ్ళకూతురుండగా, శుభ్రమైన ఇల్లు, భార్య, ఉద్యోగం, సిరి, సంపద వుండగా, ఇవేం పోకిళ్ళు! ఈ మొగాళ్ళు మంచివాళ్ళు కారు. స్వేచ్ఛంటే— స్వేచ్ఛగా నలుగురితో పోవడం కావాలి వీళ్ళకి. ఏం చెయ్యడం? ఏ మనాలి? చెంపమీద కొట్టాలనుంది.

"ఎవర్ని?"

"మాట్లాడడు. నవ్వుతాడేం?"

"చెప్పు?"

అయినా తన కెందుకు? ఏమిటో కుతూహలం, తెలుసుకోవాలని వుంది. మాట్లాడడు.

"ఇట్లా రండి."

దగ్గరగా రమ్మంటాడేమిటి, తప్పు కాదు ?

"కాసేపు అన్నీ మరచిపోయి, వెన్నెట్లో ఈ ప్రాచీనపు రాతి బండపై పడుకుని ప్రశాంతంగా కొన్ని క్షణాలు గడుపుదాం.

"ఛీ. ఛీ. అవేమ్మాటలు.

"ఈ అందం మళ్ళా మనకి దొరకదు. పూలపరిమళం క్షణికం, బాల్యం క్షణికం, కీర్తి క్షణికం— అన్నీ క్షణికాలే— అంతమాత్రంచేత వాటిని మనం వదులుకోలేము. క్షణికం గనుక, వాటిని కాంక్షిస్తాంకూడా"

ఏం సమాధానం చెప్పాలి—ఏం మాట్లాడాలి ?

"నే వెడుతున్నాను."

"కాసేపు కూర్చోరూ ?"

అతన్ని చూస్తే జాలిగా వుంది. పాపం ! కాసేపు కూర్చోమంటాడు. అతని చూపులు ఆమె నడుంమీదకి ప్రసరిస్తున్నాయి. అట్లా చూస్తాడేం; సిగ్గేస్తుంది. శాలువా బాగా దగ్గరగా లాక్కుని, చేతులతో బిగించి పట్టుకుంది.

"ఎందుకూ ?"

ఒకడుగు కిందికిదిగి రాయిమీద కూర్చుంది. రాయి చల్లగా ఉంది.

"ఇది ఎర్రరాయి. భూమిపైన వున్నరాళ్లు సెడిమెంటరీ రాక్స్ అంటారు. ఒకప్పుడు సముద్రగర్భంలో వుండేవి. భూగోళం పరిభ్రమిస్తూ ముడుచుకుపోయినప్పుడు ఆ సముద్రగర్భంలో రాళ్ళు పైకొస్తాయి. వాటి కింద ఇగ్నియస్‌రాక్స్ ఉంటాయి. భూమిలోపల బ్రహ్మాండమైన వేడి ఒత్తిడికి భాగాలు ఢీకొని కదిలి, పైకి ఉబికొచ్చిన రాళ్లు, వాటికింద అసలు భూమి— అంతా ఇనుం. క్రీస్తు పూర్వం 4004 సంవత్సరం భూగోళం పుట్టిందని వెనక కొందరు నమ్మేవారు. భూగర్భపరిశోధకులు భూగోళం వయస్సు కొన్ని లక్షల సంవత్సరాలు తేడాగా నిర్ణయించగలిగారు. దీని ప్రకారం భూమి వయస్సు 350,00,00,000 సంవత్సరాలు. మీరు కూర్చున్న రాయిముసలిది. ముప్పై లక్షల సంవత్సరాల క్రితంది అజంతా

చిత్రకారులు, ఆనాటి సుందరాంగనలు దానిమీద నడిచారు, విహరించారు. రంగులకోసం దాన్ని పొడుంచేసేశారు, దానిలో రక్తంలేదు. ఎరుపుతగ్గి ఏడ్చి క్షీణిస్తోంది. చూడండి ముట్టుకుంటే ఎట్లా పొడుమై పోతోందో".

రాతిని వేళ్ళతో నొక్కుతున్నాడు — వూడి, విరిగి పొడుంగా రాలుతోంది.

"దానిమీద నుండి లేచి ఇల్లా పడుకోండి".

పడుకోమంటాడేమిటి— ఎంత తెగించాడు! ఏకాంతప్రదేశం ఎరుగున్నవాళ్ళు ఎవ్వరూ లేరు. అందుకనే అంత చొరవ! టైం చూసింది, ఏడు దాటింది-ఏడున్నర. వాళ్ళంతా ఏమైనారో? ఏడింటికి తిరిగి వెళ్ళాలని ప్రోగ్రాం.

"నాకీ సోదంతా ఎందుకు చెబుతావు?"

"మీరు వినరు గనుక".

ఇదివరకిల్లా గన్నాడు. నవ్వొస్తుంది.

"భూమి నోరు లేనిది, దాని సొద ఎవ్వరికీ అక్కరలేదు. మళ్ళా మనుషులు అందులోంచి పుడతారు. అందులో కలిసిపోతారు. దాని కథ వింటే దానిపై జాలి కలిగి, దాని దురంతాలను క్షమిస్తారని చెబుతున్నాను. సీతాదేవి భూమిలో కలిసిపోయింది మీకు తెలుసుగా! దానికెంతో అర్థం వుంది".

ఆకాశంలోకి చూస్తూ రాతిమీద పడుకున్నాడు.

"ఇది తల కింద పెట్టుకోండి."

అని తువ్వాలు, సంచీ ఆమె తలకింద రాతిమీద పెడుతున్నాడు. గుండెలు దడ దడ కొట్టుకుంటున్నాయి. ఇదేం పరిస్థితి? పాపం! అతని తల రాతిమీద చెయ్యిమీద ఆనించాడు.

"మరైతే నువ్వెవరో..."

"మాట్లాడకండి. చూడండి. భూమిలోంచి వింత ధ్వనులు మీ

వెన్నుగుండా శరీరంలోకి తరంగాలుగా ప్రవేశిస్తాయి. వినండి— అ
విశ్వగానం అంటే—అదుగో రాతిమీద చెవి ఆనించండి. యుగయుగా
క్రితం తిరుగాడి చనిపోయిన జీవుల అంతిమ బాధ, మృత్యుఘోష, ప
లిన హృదయాల చప్పుడు—అదొక నాదం..."

కీచురాళ్ళ రొదలో తన కేమీ వినపడటంలేదు. ఇతని కేమన్నా పిచ్చెత్తదుకదా! ధోరణి, వాలకం అలాగే వుంది.

అలా నక్షత్రాలకేసి చూస్తూ పడుకుంది. అతని వైపునుండి ఏదో వింత వాసన—మొగాడి వాసన. తనకి తెలుసు, రైల్లో మొన్న అంతే. అప్పుడు—పదేళ్ళ క్రితం తిరణాలలో అట్లాంటి పరిమళం, కలకత్తాలో రోడ్డుమీద రాళ్ళు కొట్టేవాళ్ళని చూసినప్పుడు, చెల్లెలిగారింట్లో మధు సాయంత్రం ఆఫీసునుంచి వచ్చినప్పుడు—తనకి తెలుసు. తనకిష్టం లేదు. అయిష్టత రేపేవాటిపట్ల కలిగే సానుభూతి లేకపోతే, యిల్లాంటివి భరించ లేము కదా.

ఆమెకి ఆకలేస్తోంది. టైము ఎనిమిదయింది. వెన్నెల స్ఫుటంగా, నిశ్చలంగా మెరుస్తూంది. చలి తెరలుతెరలుగా శాలువాలోంచి కవ్విస్తోంది. అతను చెప్పేది తనకేమీ అర్థం కావడంలేదు. ఇంటికి ఎగిరి వెళ్ళి చెల్లెలు కూతురు మధురభక్తిని కౌగలించుకుని ఏడవాలనుంది ఎందుకో. ఆమెకి స్పర్శ కావాలి—మానవ శరీరంలో వేడి, దగ్గరతనం కావాలి. ఇక్కడన్నీ రాళ్ళు—ఇక్కడింకా వుంటే తనూ ఒక రాయిగా అవగలదు. ఆమెకి భయమేసి లేచింది.

"అమ్మో చాలా పొద్దు పోయింది."

అతను లేచి సంచీ సర్ది నడుస్తున్నాడు. మాట్లాడకుండా నడుస్తున్నారు—ఆలయంలో రాతి స్తంభాలలాగా, దగ్గరగా వుండి కూడా కలుసుకోలేదు. అతను ముందు, ఆమె వెనుక; వేగంగా నడుస్తూ తను ముందుకెళ్ళింది. అతను వెనుక పడ్డాడు. ఇద్దరూ ఒకరి పక్కన ఒకరు ఉండటంలేదు. ఇంక ఆలోచన లేదు. అలసిన శరీరం ఆలోచించదు.

టీకొట్ల దగ్గరకి చేరుకున్నారు. జనం లేరు. పాకలో ఓ చిన్న దీపం గాలిలో గిలగిల తన్నుకులాడుతోంది. దాన్ని కీటకాలు ఓదారుస్తున్నాయి. అజంతా గుహల్లో చీకట్లో వెన్నెల మధ్య భీకరంగా మెట్ల ముందు స్తంభించి వున్నాయి గుహలలో ఎంతో సౌందర్యం — గతించిన గాథలు, విన్యాసాలు, సొగసులు, రంగుల కలయిక, ఆ యుగంలో సజీవాలయిన శృంగారం, భక్తి, దీక్ష, తృష్ణ, వేట, జననమరణాలు శాశ్వతంగా చీకట్లో చైతన్యం పొందాయి. ఆమె హృదయంలో మాత్రం ఆ చిత్రాలు పరివర్తన తీసుకురాలేదు. దేశ దేశాలనుంచి వచ్చి చూసి పొయ్యే యాత్రికులు, కళాకారులు, చరిత్రకారులు, సంస్కర్తలు, వాటి సౌందర్యం స్తుతించిపోతారు. తనకా అనుభూతి కలగలేదు. ఎందుకో?

ఆకలేస్తూంది. అందుకు నవ్వొకుంది. నడుస్తున్నారు.

"వాళ్ళెవరూ కనబడరేం ?"

అతనేమీ మాట్లాడలేదు. అతనికి కోపం వచ్చిందా ? పాపం వంటిగా, దిగులుగా వున్నాడు కాస్తంత బుజ్జగిస్తే—తనలో ఔదార్యం, కారుణ్యం—ఏవేవో వున్నాయి. వాటిని ఉపయోగించే అవకాశాలు లేక, ఇంద్రియాలు ఎండి, ఎత్తునుండి పారుతూ ఒంపు దగ్గరదాకా ప్రవహించి నిలిచిపోయిన పెద్ద జల ప్రవాహంలా తనలో అలా వుండిపోయాయి. అతని పక్కగా నడుస్తూంది. అతనింకా వేగంగా నడుస్తున్నాడు.

"ఏం మాట్లాడాలి?"

"మరిప్పుడు నే వెళ్ళడం ఎలా ?"

"ఇప్పుడు వెళ్ళలేరు. రాత్రికి భోజనం చేసి పడుండండి. రేపుదయము స్టేషన్‌లో దింపుతా జీపులో. ఔరంగాబాదులో నా స్నేహితుడొకడున్నాడు. అతను ఓ నెలరోజులు సెలవుపెట్టి వాళ్ళ వూరు వెళుతూ, కావాలంటే తన జీపు ఆ నెలరోజులు వాడుకోమని వ్రాస్తేనే, నే యిలా వచ్చింది" అన్నాడు.

బసలోకి చేరుకున్నారు. ప్రొద్దున్న వారొచ్చిన బస్సులో కండక్టర్

ఎవరో, అక్కడ నిలబడి ఉన్నాడు. తన కోసం వారంతా ఓ గంట వెదికారట. అరగంట్రకితమే వెళ్ళారుట. అతన్ని అక్కడ వుండి, తన వయనం తెలుసుకుని స్టేషన్‌కి తీసుకురమ్మన్నారుట. ఔరంగాబాదులో పోలీసులకు ఫిర్యాదుచేసి మరికొంతసిబ్బందితో మళ్ళీ ఉదయానవచ్చి వాకబుచేస్తారుట. ఎంత గొడవ జరిగింది ? తను వచ్చేయ్యకూడదూ— ఎందుకల్లా ఆ రాళ్ళ మీద పడుకుని ఉండటం ? ఇప్పుడు చేసేదేముంది ? ఆవరణలో పెద్ద భవనం, ఎదురుగా మూల ఓ చిన్న గదుంది. దాని ముందు వరండా ఎత్తుగా, లావుగా, నల్లగా ఎవడో ఓ వ్యక్తి వచ్చి దుప్పటి పరిచాడు, భోజనము ఏర్పాటు చేశాడు.

ఆకలిగా వుంది. భోజనాలు చేశారు, ప్రాణం కుదుట పడింది. వెన్నెల అందంగా కాళ్ళ ముందు పడుతోంది. ఆ నల్లటి, ఎత్తు వ్యక్తి వంటవాడులా గున్నాడు 'ఖూజా' అని పిలుస్తున్నాడు. పొట్టి నిక్కరు— నెత్తిన టోపీ- ఒంటిమీద చొక్కా లేదు. వెన్నెట్లో అతని కండలు, ఒంటిలో నునుపు వంకరలు, నీడలు తీర్చుకుని కదుల్తున్నాయి. కండక్టరు కూడా భోజనం చేశాడు. పదకొండింటికి ఒక లారీ అటు వెడుతుందిట అందులో వెడతాడుట. తనని కూడా ఇష్టమైతే రమ్మన్నాడు. తనకి వెళ్ళాలని ఉంది. అర్ధరాత్రి భయమేస్తుంది. మధు కూడా వస్తాడా ?

"వస్తావా నువ్వు కూడా ?"

రానన్నట్లు తల పంకించాడు.

"మరి నే వెళ్ళేదా ?"

"ధైర్యం ఉండి, వెళ్ళాలని ఉంటే వెళ్ళవచ్చు".

అతనికి కోపం వచ్చిందని నిర్ణయించుకుంది. తనేమన్నానని అంత కోపం ? ఆమె ఎవరో చూడాలన్న కుతూహలం పీడిస్తూంది. రాత్రి వుండి ఏం జరుగుతుందో యీ కథేమిటో కనుక్కోవాలి. చెల్లెలు అడిగితే ఏం చెప్పడం ? అంతు చూడాలి, తన బంధువు ఒకడు తటస్థపడ్డాడనీ,

అతనితో కలిసి తిన్నగా ఇంటికి వెడుతున్నాననీ, జరిగినదానికి క్షమించ వలసిందనీ కోరుతూ షీలా లాజరస్‌కి ఓ ఉత్తరం వ్రాసి కండక్టరు చేతికిచ్చి, వాడి చేతిలో ఓ రూపాయి పెట్టింది. వాడు సెలవు తీసుకుని వెళ్ళాడు.

షూజా భోజనం చేస్తున్నాడు, ఆమెకి అలసటగా ఉంది నిద్ర వస్తూంది పక్కచుట్ట కోసం చూసింది. ఏదీ కనబడదేం ? అరరె— వాళ్లు తీసుకుపొయ్యారా ? లేక మధుసూధనం తాలూకు మనిషి తస్కరించిందా? వెదుకుతోంది. కనబడదు ఎట్లా పడుకోడం? మధుసూధనం గదిలో పక్క అమర్చాడు. తనపక్క—ఎట్లాగబ్బ ! పరాయిమొగాడి పక్కమీద పడుకోడం ? గత్యంతరంలేదు.

"ఆమె కనబడదేం ?"

అడిగేసింది తెగించి, అతను బిగ్గరగా నవ్వుతున్నాడు.

"ఆమె ఎల్లోరాలో వుంది."

"అదేమిటి ?"

"అవును. రేపు నాతో వస్తే అక్కడ చూపిస్తా. ప్రస్తుతం ఆమె భర్తను చూడొచ్చు మీరు. అడుగో వాడే షూజా" అన్నాడు.

భర్తతో కలిసి ఆమెను లేవదీసుకు రావడమేమిటి ఎక్కడా వినలేదే తను ! భర్త ఒప్పుకుంటాడా ! ఏమో, డబ్బు ఆశపడి, మొగాళ్ళు ఏది పడితే అదే చేస్తారు కాబోలు తనకేం తెలుసు.

"ఎల్లోరాలో ఒంటిగా ఎందుకుంది ?"

"రేపు చూస్తే మీకే తెలుస్తుంది."

ఆవులింత ఆపుకుంది.

"మీరల్లా గదిలో పరుండండి."

"నువ్వో?"

"నే నిక్కడ— ఈ వరండాలో, షూజా జీప్‌లో".

"నా కొక్కదానికి లోపల భయమేస్తుంది."

అల్లా అన్నందుకు నాలిక కొరుక్కుంది జ్ఞానసుందరి.

"నేనిక్కడే వున్నాగా, పైగా మీకు వెంటనే నిద్రపట్టేస్తుంది. అలసివున్నారేమో."

లోపలికెళ్ళి పడుకుంది.

"చలిగా వుంటుంది, తలుపులు దగ్గరగా వేసుకోండి" అన్నాడు.

తలుపు దగ్గరగా వేసి పరుంది. ప్రాణం హాయిగా వుంది. నిద్ర వొచ్చేస్తోంది. తనకి మధుసూదనం అర్థంకావడంలేదు. ఇదంతా గందరగోళంగా వుంది. తనిల్లా రాత్రి వుండిపోవడం పొరబాటు. వెనక అతను చేసిన చేష్టలు, చూపిన వికారాలు అనుభవం అయివుండి కూడా, తన కుతూహలానికి లొంగిపోయి ఈ పరిస్థితిలో చిక్కుకుని వుండకూడదు. మధురభక్తి జ్ఞాపకాని కొచ్చింది చాలా అందమయిన పిల్ల— బొద్దుగా వుంటుంది. వాళ్ళనాన్నకి మల్లె; కలకల్లాడే మొహం. దాన్ని తన దగ్గరే వుంచుకుని చదువు, నాట్యం చెప్పించి, మంచి కుర్రవాడిని చూసి పెండ్లి చేసి, పెద్ద తనంలో తను వాళ్ళదగ్గరే వుండిపోవాలి. జ్ఞాపకం వచ్చింది. వెనుకోమారు తను మధురభక్తి చలాకీని, తెలివిని మెచ్చుకోటం విని మధుసూదనం వో మాటన్నాడు.

"దానికి అచ్చంగా మీ పోలికే."

అర్థలేనిమాట. తన పోలిక దానికెల్లా వస్తుంది? ఏమో, పింతల్లి పెత్తల్లుల పోలికలు రావడం అసహజం కాదు ఆ మాట పీకుతోంది. ఏదేమయినా మధురం అంటే అతనికి ఎంతో ప్రేమ.

"ప్రేమ"—అంటే తనకేం తెలుసు ?

భర్త, ప్రియుడు. పిల్లలులేరు తనకి. పుస్తకాలలో, సినిమాలలో, నాటకాలలో, ఇతరుల సంసారాలలో చూసి ఆనందించడమే తనకి పరిపాటైపోయింది. ఎవరో తలుపు తెరిచినట్లనిపించింది. దీపం ఆరిపోయింది. ఎవరిదో చెయ్యి— ఆ వేళ్ళు, ములక్కాడల్లాంటి అతని వేళ్లు తన జుట్టుని నిమురుతున్నాయి. తన నడుం చుట్టూ జ్వాలలా పెనవేసుకుంటున్నాయి.

మెత్తగా, పదునుగా, వెచ్చగా తన శరీరాన్ని వేళ్ళ మధ్య ఇముడ్చుకుని. బంతిలా చేసేసి, నలిపేస్తున్నట్లు... శాలువాలో గుండెలమీద తన చేతులే— ఏమీలేదు, లేచి కూర్చుంది. గాలికి తలుపులు తెరుచుకున్నాయి. లేచి బయటకొచ్చి చూసింది· మధుసూదనం ముసుగు తన్ని నిద్ర పోతున్నాడు. మాట్లాడాడు, వులిక్కిపడింది.

"లోపల నిద్ర పట్టడంలేదా?

"లేదు— లేదు— ఏదో చప్పుడయినట్లుంది. దాహంగా వుంటే లేచాను."

అతను లేచి మంచినీళ్ళగ్లాసు తెచ్చాడు, చల్లగా వున్నాయి — పళ్ళు సలసలమన్నాయి.

"ఇక్కడ ఒక్కళ్ళకే భయంగా వుంటుంది."

"మరొకళ్ళు వున్నప్పుడే భయంగా వుండేది. ఒక్కడికి ఏ భయమూ వుండదు, భాగ్యవంతుల మధ్యలో వున్నప్పుడే బీదవాడి, బీద తనం తెలుస్తుంది. మరొకరి సమక్షంలోనే, పోలికలు, కొలతలు, హెచ్చు తగ్గుల విలువలు కట్టడాలు."

ఆవలిస్తున్నాడు. వెన్నెల ఉంగరాల జుట్టులో ఇరుక్కుని గాలికి తన్నుకులాడుతోంది. లోపలి కెళ్ళి పడుకుంది.

అతను పక్క గది గుమ్మం దగ్గరగా లాక్కుని పరున్నాడు· తలుపు సందులోంచి చూస్తోంది. మళ్లా లేచాడు, అటూ ఇటూ వెన్నెట్లో పచార్లు ·చేస్తున్నాడు. ఆకాశంలోకి చూస్తున్నాడు. కూర్చున్నాడు— తనగదికేసి చూస్తున్నాడు. చూపులు తన నడుం మీద, వక్షంపైనా ప్రసరిస్తున్నాయి. కళ్ళు·పెద్దవిచేసి చూసింది. తనకేసి చూడ్డంలేదు. అతని గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. ఏదో జరగబోతోంది— తాను సిద్ధంగా వుందా ? నరాలు, రక్తం వొక్కసారి చెలరేగినట్లు, శరీరం తృష్ణతో బిగిసి, విడి, విడి బిగిసి, సర్దుకుని, సిద్ధమయి, స్థిమితపడి, ఉద యించని సూర్యునివైపు చేతులు జోడించిన ఋషి ప్రశాంతత తనలో

కమ్ముకుంది. చలిస్తున్న స్తనాలని చేతులలో నొక్కి పెడుతోంది. యోగి జోడించిన చెతివేళ్ళల్లా పైకి నిలబడి, లోతు కేసి చూడని శిఖర ద్వయంలా, తనరొమ్ముల మధ్య అజంతా గుహల చీకటికి చోటు దొరక్క, మొనలచుట్టూ, చంద్రబింబం చుటూ అలుముకున్న కాంతి పుంజంలా నలుపు కరిగి గుండ్రంగా కమ్ముకుంది. చర్మంలో కోటి అణువులు పిల్లలై, జీవుడు ఆడక, సృష్టిని వెదుకుతూ తొంగి చూస్తు న్నాయి. అమ్మో—శరీరానికి ఎంత శక్తి ఎంత ఒత్తిడి ఎంతబలం— యుగయుగాలుగా భూగర్భంలో అణగారిన శక్తులు ఒక్కసారిగా భూకం పము ద్వారా ప్రేలి బైటపడ్డంత శక్తి సముద్రగర్భాన్ని కలిచివేసి నెట్టి బైట ఒడ్డున ముద్దకింద ఎండింగి పడేసినంత ఒత్తిడి. మహత్తర శిఖరాలని కూల్చి అధోలోకంలోకి లాక్కుపోయి నంతటి బలం. అన్నీ ఆమె శరీ రాన్ని మర్దించి వేస్తుంటే శాలువాలో శరీరం నగ్నశక్తిని దాచివెయ్యాలి. అందుకే దుస్తులు శరీరానికి సంకెళ్ళు—ఈ కొత్తరకం బ్రేషియర్లు— చారుమతి బొంబాయిలో కొంది—ఛ ఛ. ఏమిటీ ఆలోచనలు—కను రెప్పలమీద బరువు, కళ్ళల్లో మైకం శరీరం తృష్ణతో పొంగి విముఖతలో కుంగి మనస్సుని కనురెప్పల వెనక, అలిసిన అణువుల వెనక నొక్కి పడేసి దుస్తులు తీసేసి, తన చీకటి శరీరంలోకి లాక్కుపోతోంది నిద్రా దేవత. ఆ శ్వాస ఆమె చీకటి మందహాసం, ఆమె ఏకాంత నగ్న సౌందర్యం...ఎక్కడికో, ఎందుకో, ఎప్పుడో...అజంతా గుహలో సమా ధైన రహస్యానుభవం...మరి అంతే...

* * * *

లేచేటప్పటికి ఏడైంది. మధులేడు. తను మొహం కడుక్కొని స్నానం చేసేటప్పటికి షూజా టీ తయారుచేసి ఓ కప్పు తెచ్చాడు.

మధుసూధనం ఎక్కడికెళ్ళాడో? అల్లా నడుచుకుంటూ వెళ్ళింది. కాలిబాటమ్మటే అన్నీ రాళ్ళు ఎర్రవి, పచ్చవి, రంగు రంగులవి. చెట్టు క్రింద కూర్చుంది. ఎండ తీక్షణంగా వున్నా గాలిలో చలి తెరలు కమ్మేస్తూనే

వున్నాయి. ఔరంగాబాద్ వెళ్ళగానే నాగులుకి టెలిగ్రాం యివ్వాలి. ఇంటికి వెళ్ళి ఏమిటి చెప్పడం? రాత్రి అల్లా ఏకాంతంగా గడిపినా, ఏమీ జరగ లేదంటే చెల్లెలు నమ్ముతుందా? ఆమె మనస్సు నిర్మలమైంది. లోపల ఏ ఆలోచనలున్నా ప్రవర్తనలో లోపంలేదు. తొమ్మిది దాటుతోంది, మళ్ళా బంగళావైపు వెళ్ళింది. వరండాలో మనుషుల అలజడి లేదు. గది తలుపులు వేసి వున్నాయి. కిటికీ సందుల్లోంచి లోపల చూసింది. మధు లోపల వున్నాడు. షూజా మూలగా నిలబడి వున్నాడు. మొలచుట్టూ చిన్నగుడ్డ మినహా ఒంటిమీద దుస్తులు లేవు. తాడు అతని చుట్టూ వేసి, ఏవో కొలతలు తీసుకుంటున్నాడు మధుసూధనం. రెండడుగులు వెనక్కివేసి చతికిల బడ్డాడు. ఏదో దబ్ దబ్ మని చప్పుడవుతోంది.

"ఎవరది?"

"ఎవ్వరూ లేరు"

బైటకొచ్చాడు మధు

"మీరా!"

"అవును. ఇంకెవరుంటారు?"

"స్నానం అయిందా?"

"ఆహా ఏమిటి లోపల?"

"మరో అవతారం."

నవ్వుతూ లోపలికెళ్ళి తలుపులు మూశాడు. ఆమెకి కోపం వచ్చింది. పక్క చుట్ట వరండాలోకి లాక్కుని పడుంది.

పన్నెండింటికి భోజనా లేర్పాటు చేశాడు షూజా. భోజనం చేశాక, అజంతా గుహలకి బైలుదేరారు. ఆమె వెనక అతను ముందు — ఆమె ముందు—అతను వెనక.

జనం వెడుతూ వస్తూ వున్నారు ఒకాయన గుహముందు మంటపం పైనున్న చిత్రానికి రంగులతో నకలు తయారు చేస్తున్నాడు-ఎవరో దొరలా వున్నాడు. బుడ్లల్లో చుట్టూ రంగులు పెట్టుకున్నాడు. మధు

సూదనం చాలా సేపు అక్కడ నిలబడి చూస్తున్నాడు. వాళ్ళేదో మాట్లాడు కుంటున్నారు. పదో గుహ అతి ప్రాచీనమైంది—క్రీస్తు పూర్వం రెండు వందల ఏళ్ళనాటిదిట. స్తంభానికి ఆనుకుని ఆమె నిలబడింది. అతను కాస్త దూరంగా వెళ్ళి ఆమె శరీరాన్ని పరీక్షగా చూస్తున్నాడు. సిగ్గేస్తుంది అట్లా చూస్తాడేం—

"ఏమిటది—అట్లాగెందుకు చూస్తావు?"

"మీ వెనక గోడమీదవున్న ఆ మూర్తిది అచ్చంగా మీలాంటి శరీరమే. మీ పేరేమిటి?"

"నా పేరా—నీకు తెలీదు?"

"తెలుసు. జ్ఞానసుందరిగారు. మీరు అజంతా సుందరులు."

"ఏం మాటలవి!"

"ఎన్నాళ్ళనుండో పీడించిన సమస్య ఈనాడు తేలిపోయింది."

"ఏమిటది."

"ఇప్పుడు చెప్పను. చెప్పకూడదు."

కుతూహలం ఎక్కువవుతోంది. విషయం ఏదో వుంది. తనలో ఆందోళన పెరుగుతోంది.

"నే వెళ్ళిపోతా చెప్పకపోతే—"

"మీ రెక్కడికీ వెళ్ళలేరు."

ఒకతల. మళ్ళా బొమ్మలు చూస్తున్నారు. నాలుగు శరీరాలు గల లేడి చిత్రం. నల్ల రాకొమార్తె—వొంకరకాలు స్త్రీమూర్తి. ఏనుగులవేట —ఆబోతుల పోట్లాట—అలంకరణ—రాగోదయం—ఏవేవో, తను బైటకొచ్చేసింది. టీ దుకాణం దగ్గర టీ తాగింది. షూజా అక్కడే వున్నాడు—నల్లగా, ఎత్తుగా కండలు తిరిగిన శరీరం వాడూను, నవ్వుతాడు పళ్ళు తెల్లగా మెరుస్తున్నాయి. టోపీ—వాడి వాలకం. అజంతా గుహలో వో చిత్రంలా వున్నాడు.

రెండు కావస్తోంది. బంగళా కెళ్ళి, సామాను జీప్‌లో జేరేసి

ప్రయాణం అయ్యారు. ఖాజా ఒక సౌడుగాటి బుట్టలో ఏదో పెట్టాడు. దానిచుట్టూ గుడ్డ చుట్టి ఒళ్ళో పెట్టుకున్నాడు. ఔరంగాబాదు చేరేటప్పటికి నాలుగు దాటింది. పోష్టాఫీస్ కెళ్ళి పెల్లిగ్రాం ఇద్దామంటే. ఒద్దన్నాడు. టిఫిన్ తీసుకుని బజారుకెళ్ళి తనో చీర కొనుక్కుంది.

హోటల్లో షీలా లాజరస్‌కి మరో చీటి వ్రాసి పెట్టింది అన్నయ్య—కలకత్తా అడ్రెస్‌కి ఓ ఉత్తరం వ్రాసింది ఎల్లోరాకి బైలుదేరారు. రోడ్డుమీద దుమ్ము సంధ్యలో ఎర్రగా మందంగా రేగుతోంది. దుమ్ముకి రంగుపోగొట్టుకున్న చెట్ల ఆకులు, మ్రానులు మంచానపడ్డట్టు చలనంలేక వ్రేల్లాడుతున్నాయి.

ఎల్లోరా గుహలకి చేరుకున్నారు. మల్లా మనుషుల అలజడి, గుహల్లోంచి బైటకొస్తున్నారు. అక్కడో టీ దుకాణం. ఖాజా సామాను. వో పెద్ద బంగళా ఆవరణలో దిగారు. వాడు ఆ సామాన్లు తీసుకెళ్ళి మూలనున్న ఓ పాకలో పడేశాడు.

"నువ్విక్కడే వుండు—ఓ అరగంటలో ఒస్తాం" అన్నాడు. మధుసూదనం జీపు నడుపుతున్నాడు. తను వెనక సీట్‌లో కూర్చునుంది. అతని ఎదురుగా అద్దం ముక్కలో తన మొహం కనబడుతోంది. అతని జుట్టు కనబడుతోంది. తన మొహం దుమ్ముతో ఎర్రబడింది. చీదరగా వుంది—ఏదేనా జలపాతం వుంటే దానికింద నిలబడి స్నానం చెయ్యాలని వుంది. మలుపు తిరిగి, కొండమీదికి వెడుతోంది జీప్, సంధ్యలో కొండ వీపుమీద రాళ్ళు ఎర్రగా ప్రజ్వరిల్లుతున్నాయి. ఒక్కొక్క దృశ్యాన్నే దుస్తులు తీసి లైటు ఫోకస్‌చేసినట్లు వొంపుల నీడల్ని కడసారి కిరణాలు వెలిగించి వీడ్కోలిస్తున్నాయి.

జీప్ నిలిచింది. అతను దిగాడు.

"దిగండి - తొందరగా రండి."

ఆమె గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. ఎందుకు ? ఎవరు ? ఏముందక్కడ? కొండ పైభాగం—కాస్త మేర చదునుగా వుంది దూరంగా

ఓ చెట్టు ఆకులు లేకుండా, నగ్నంగా ఒంగి వుంది— పెద్ద గాలికి వూడి లోయలో పడిపోతుంది. లోయలోకి చూస్తోంది. దాని వేళ్ళ పరంపర చివ్వర ఒక్క ఆకు కొనవూపిరితో అల్లల్లాడుతోంది—సముద్రంలో మునిగిపోతున్న పడవ తెరచాప కొనలాగ. జీప్‌లో గోనిపట్టా చెట్టుముందు రాతిమీద పరిచాడు. ఏమిటిదంతా? ఏం చేస్తాడో?

"అల్లా పడుకుని పడమటి ఆకాశంకేసి చూడండి."

అతను పక్కన మరో బండమీద కూర్చుని ఆకాశంలోకి చూస్తున్నాడు.

"అది సూర్యాస్తమయం అపూర్వ దృశ్యం. అది చూడటానికే ఆస్ట్రేలియానుండి మనం అజంతాలో చూసిన దొరగారు వస్త. ఆయన గొప్ప చిత్రకారుడు. ఇక్కడి సూర్యాస్తమయం చూడ్డానికి తాను అంత దూరాన్నుండి చేసిన ప్రయాణం వృధా కాదన్నాడు.

సూర్యబింబం ఆకాశం అంచున దిగుతోంది. కిందంతా లోయ— అంతా మసగలో గుండ్రని బైలుగా కనబడుతోంది. అక్కడక్కడ శిథిల భవనాలు, బురుజులు, పమిట కొంగు అంచులా కోటగోడలు. అక్కడేదో తిందామని పోతున్న పక్షుల గుంపులు. ఆకాశంలో చెమట బిందువుల లాగ, ఎర్రవి, వూదావి, బంగారంవి, రంగురంగుల మేఘాలు పుష్పాలతో ఆలయాని కెడుతున్న కన్యలకి మల్లే, సూర్యుడి చుట్టూ ప్రదక్షిణాలు చేస్తున్నాయి.

చెట్లు, కొండలు చోద్యం చూడ్డానికి అటు ఒంగినట్లున్నాయి. దిగి పోతున్నాడు వేగంగా— కిరణాలు పొడుగువి, పొట్టివి హాస్యం కోసం కన్యలకి చక్కలిగింతలు పెట్టినట్లు, మేఘాలలో దూరి దాగిలిమూతలాడు తున్నాయి. సిగ్గుతో నవ్వి బిడియంతో మేఘాలు పైపైకి పరుగులెడు తున్నాయి. అలిసిన కన్యల నుదుటిమీద చెమటబొట్లకి మల్లే పక్షుల గుంపులు. అక్కడక్కడ రిబ్బన్ వూడిన జడకిమల్లె గాలిపటాలు దారం సడిలి పడిపోతున్నాయి.

తనకేసి చూస్తున్నాడు— అతను గమనించనట్లు సూర్యుడికేసి చూస్తున్నదామె. మెడకింద జాకెట్టు మధ్యలోకి చూస్తున్నాడు. సూర్యకిరణాలు స్తనాలమధ్య సందులోపకి గుండ్రటి నీడద్వయంగా విడిపోవటం చూస్తున్నాడా ? అటు యిటు కదిలింది. పమిట బొత్తిగా జారిపోయింది. నేలమీద వక్షాన్ని ఆనించి పడుంది. ఇప్పుడు ఫరవాలేదు.

"అది వీనస్‌గ్రహం. దాని ప్రతిభ, ప్రభ ఒక్కగంట మాత్రమే, తర్వాత అంతర్థానమౌతుంది. ఆ గ్రహం సూర్యుడి సంతానం. తండ్రిచుట్టూ తిరుగుతూంటుంది. అల్లా తిరుగుతుంటే చూస్తూ కూర్చోవాల్సిందే కాని, 'అయ్యో నాబిడ్డా' అని దగ్గరికి తీసుకుని కౌగలించుకోలేడు సూర్యుడు. పాపం ! అంతే సృష్టి శాసించింది. మనుషుల జీవితాలూ అంతే. ఒకర్ని ఒకరు చూస్తూ కూర్చోవాలి. వారి సుఖదుఃఖాలు, ఖ్యాతి అపఖ్యాతులు, జనన మరణాలు— దగ్గరగా తీసుకొని అవి తమవిగా తమలో లీనం చేసుకుని ఏడవడానికి, నవ్వడానికి లేదు. గతులు తప్పనివి మానవ హృదయాలు. అదే కొట్టుకోడం, తన్నుకోడం, అదే లయ, క్రమం— ఆ చర్మం, ఆ రక్తం, ఆ ప్రేవులు, ఆ నరాలు— వాటిల్లో అల్లా యిరుక్కుపోయి తన్నుకులాడాల్సిందే— ఏ రెండు గుండెలూ గతులు తప్పి, దగ్గరకొచ్చి, లీనమై ఒకటి కావు. అతన్ని చూస్తే జాలిగా వుంది. అతనికేం కావాలి ? అతనిపై తనకి జాలిలేదు. నిజంగా తనపైననే తనకి జాలి. చెల్లెలు అందమైంది. ఇద్దరూ అన్యోన్యంగా వుంటారు. అతనికి కావల్సింది ఏదో ఆమెలో లోపించి ఉండాలి. అదేమిటో తనకి తెలీదు. ప్రక్కన గడ్డికాడలను తెంపుతూంది. అతని చెయ్యి అక్కడ వుంది— వేళ్ళమధ్య గడ్డికాడలున్నాయి. అక్కడికి తన చేతని పోనిచ్చి గడ్డిని కోస్తోంది. అతను చేతిని ప్రక్కకి లాగేశాడు.

సూర్యుడు దిగిపోయ్యాడు. ప్రకృతి తేరుకుంటున్నట్లుగా నిశ్శబ్దంగా వుంది. లేచాడు. తనూ లేవడానికి యత్నిస్తూ చేతిని పైకి ప్రదర్శించింది చేయూత నిమ్మన్నట్లుగా— మోచేతిని పట్టి లేవదీశాడు— గట్టిగా, వెడల్పు

తీగలాగా పెనవేసుకున్న అతని వేళ్ళంటే తనకిభయం. జీప్‌లో ఎక్కాడు తను అతని ప్రక్కనే కూర్చుంది. ఒద్దనలేదు. ఐదు నిమిషాల్లో కిందికి మళుపులో బంగళాకి చేరుకున్నారు.

బంగళావున్న ఆవరణలో ఓ మూలగా పాకలాంటిదుంది. అందులో కెళ్ళారు. ఫూజా కుండలతో నీళ్ళు తెచ్చాడు. చలేస్తోంది ఎల్లాగ స్నానం చెయ్యడం? ఒళ్ళంతా దుమ్ము చీదరగా వుంది. ాజా టీ ట్టాడు. స్నానంలాంటిది చేసి, కొత్తచీర కట్టుకుని టీ త్రాగి పక్కచుట్టని ఆనుకుని వరండాలో స్తంభం పక్కన కూర్చుని ఆకాశంకేసి చూస్తోంది. మధు స్నానంచేస్తూ సంగీతం మొదలెట్టాడు. పావుగంటలో వచ్చాడు. సన్న దీపం నీడలో అతని మొహం చూసింది. ఆ గడ్డం ఎందుకు ? క్షౌరం చేసుకోరాదు !

"బంగళాలో ఉండకూడదూ?" అంది తాను.

"అందులో చోటులేదు. పెద్ద పెద్ద ఉద్యోగులకే దొరుకుతుంది. ఈ పాక నేనే వేయించాను."

"ఎప్పుడు"

"అప్పుడే ఇక్కడి కొచ్చి ఇరవై రోజులు దాటుతోంది. రెండు వారాలు ఇక్కడ గడిపి అజంతా వెళ్ళాను, మీ రొచ్చారు."

"ఇక్కడేం బాగుంది ?"

"ఎవరిపిచ్చి వారి కానందం."

"కాలక్షేపం అవుతుందా ?"

"అవదు."

"మరి ?"

"కాలక్షేపం కాకూడదనే యిక్కడికి వస్త. ఎల్లోరా శిల్పాలలో సోమరితనం చూస్తాం. ఏదీ వున్నచోట నుండి కదలదు, ఎగరదు ముసిలి తనం తెచ్చుకోవు. అల్లానే వుండిపోతాయి."

"బాగుంది— అవి రాతి బొమ్మలు."

"వాటికి గుండె లున్నాయి – కాని చలించవు, కొట్టుకోవు— పగలవు కూడా. కాసేపు అల్లా వెళ్ళొస్తా..." అని లేచి వెల్లాడు. తనని రమ్మనలేదేం ? కళ్ళు మూసుకుని పడుకుంది.

తొమ్మిది దాటింది. షూజా చపాతీలు తయారు చేశాడు.

"ఇక్కడ మజ్జిగ దొరకదు"

అన్నాడు మధుసూదనం.

రెండు గుంజలకి తాడు వేల్లాడదీసి దానిమీద దుప్పటి పరదాలా వేశారు. దాని ప్రక్కన ఆమె పక్క. వరండాలో స్తంభం వెనక అతనిపక్క అతని పాదాలమీద వెన్నెల పడుతోంది. గాలికి పంచె పైకి కదిలింది, అతని కాళ్ళకి వెంట్రుకలు లేవు— ఆడదాని కాళ్ళలా,— అల్లా వుంటే ఏం బాగుంటాయి ? స్నానంచేసి రాగానే అతని ఛాతీ చూసింది— బొడ్డు కింద సాఫీగా చప్టాలాగున్న పొత్తి కడుపు కనిపిస్తోంది. ఆ గడ్డంలో మధ్య మధ్య తెల్లవెంట్రుకలు. అప్పుడేనా— తనకంటే ఆరు నెలలలో ఏడాదో చిన్నవాడంటుంది చెల్లెలు. అతనే అంత పెద్దవాడయితే, తనెంత పెద్దదిగా కనిపిస్తుందో!ఎవరిది వారికి తెలీదు.బయట వాళ్ళు ఈ విషయాల్లో పొరబాటు చెయ్యరు. వయస్సు, తిథి, వారం గంటలు నిముషాలతో సహా నిర్ణయించి వేస్తారు. "అమ్మాయి", "అమ్మాయిగారు" "అమ్మ" "అమ్మగారు" "అత్తయ్యగారు" "పెద్దమ్మగారు"... తన అవతారం సంబోధనలో నిర్ణయమయి పోతుంది... తనని అత్తయ్యగారు అనడం దగ్గర కొచ్చింది. జడ ముడిగా చుట్టి, కొంగు జుట్టుమీద కప్పుకుని, చేతులు తొడల మధ్య బిగించి పడుకుంది.

"మరి ఆమె ఎక్కడ ?"

అని అడిగింది తాను ఆవలింతని ఆపుకుని.

"రేపు చూపెడతా ?"

"ఎక్కడుంది ?"

"చూస్తారుగా."

ఆమెను వూహించుకోవటం చేతకావటం లేదు– నలుపా, ఎరుపా, పొడగరా ? ఏ కులం ?. ఎంత వయస్సు ? ఎవరి తాలూకు ? ఎన్నో తెలిస్తేగాని వూహించలేం. మధుసూదనం గురించి తనకి కొంత తెలుసు దాన్ని బట్టి వూహించగలదా ? ఎత్తుగా, సన్నంగా వుండాలి. నడుం దగ్గర స్ఫుటమయిన వొంపు వుండాలి. పొట్టిమెడ కింద రొమ్ములపైన మెరుపుండాలి – అవి. మరి అవి... పెద్దవిగా, బరువుగా సిగ్గేస్తుంది— ఏమిటీ ఆలోచనలు. చేతులని గుండెలపై కట్టేసుకుని, చీర పాదాల కిందికి లాగి, ఏదో రహస్యాన్ని ఆ శాలువాలో దాచినట్లు లుంగ చుట్టుకుని పరుంది. నిద్రపట్టేసింది. ఎవరో లేపితే, తను లేవదు. అది నిశ్చయం.

తెల్లారి ఐదింటికే మెళకువ వచ్చింది. మధుసూదనం లేడు– ఎటో వెళ్లాడు. కుర్రాడు పూజా మంచివాడు. క్షణంలో టీ తయారు చేస్తాడు. ఎప్పుడు కావాలో అడక్కుండా తెలుసుకుంటాడు. మరి స్నానం ? మళ్లా యీ చన్నీళ్ళే. అందులో కుందలోవి. తప్పదు. ఎల్లాగో వుగ్గపెట్టుకుని స్నానం చేసింది. మనసు, వొళ్ళు నిర్మలంగా, నిశ్చితంగా వున్నట్లుంది. అద్దంలో చూసుకుంది. కొండ వెనక సూర్యుడు లేస్తున్నాడు — అప్పుడే నిద్రనుండి లేచిన మత్తుతో మిళిత మైన ఎరుపుని అకాశంలో కడుగుతూ, చెట్ల ఆకుల్లోంచి కిరణాలు తన జుట్టుని, మొహాన్ని వెలిగించాయి. అద్దంలో మెరిసిపోతోంది. నిర్మలమైన మొహం- -పల్చటి చెక్కిళ్ళు. ఉదయ కిరణం పొడిచి, పొదిగి గుడ్డు లోంచి బైటడేసిన పక్షిపిల్ల రక్తం ముద్దలా ఎర్రటి పెదవులపై తడి ఆరని చారలున్నాయి. వాటి వెనక తెల్లటి పళ్ళ తళ తళ-తన మొహం ఎందుకో యీ పూట కొత్తగా వుంది. లంకణాలుచేసి పథ్యం పుచ్చుకున్న తర్వాతఏదో కొత్త చోటు నుంచి తిరిగొచ్చిన తర్వాత, ఎవరి మొహాన్నో ఎరువు తెచ్చుకున్నట్లు, ఆ క్షణిక వికాసం అద్దంలో ప్రతిబింబించింది. ఆ అందంతో అద్దంలోవుంది–తనలోకాదు. ఒక్కొక్కరకం అద్దంలో మొహం వికృతంగా కనబడుతుంది. కొన్నిటిలో లేని చక్కదనం కనబడుతుంది.

తను నుంచున్న చోటు వెలుగు పడేవైపు, వెలుగు తీక్షణత — ఎన్నింటి పైననో ఆధారపడుతుంది అద్దంలో బింబం. రాత్రంతా నిద్రపట్టక తెల్లారి బరువు కళ్ళతో చూసుకుంటే ఎంత అందంగా కనబడుతుంది ! అదేం చిత్రమో !

వెనక్కి తిరిగింది. మధుసూదనం

"రండి వెడదాం"

ఆమెకేసి చూడ్డంలేదు బట్టలు మార్చుకుంటున్నాడు. తనకేసి చూడడేం ? చూడవల్సిన సమయం ఇదే. అతనిపైన కోపం వచ్చింది. చూడకుండా వుంటాడూ ? తను చూడనప్పుడు చూసి మళ్ళీ తను చూసి నప్పుడు, చూడనట్లు — గంద్రగోళంగా వుంది.

జీప్‌లో మలుపుల రోడ్డంట దిగుతున్నారు. ఐదు నిమిషాల్లో ఎల్లోరా గుహల దగ్గరకు చేరుకున్నారు. జనం అట్టే మందిలేరు. ముందు రోడ్డు పూడుస్తున్నారు. టీ దుకాణం దగ్గర కొందరు చేరారు—— స్త్రీలు పురుషులు ఆమెవరో పార్సీ స్త్రీ—— నల్లటి సన్‌గ్లాసెస్ పెట్టుకుంది. భుజాన కెమేరా, లోపల ఫొటోలు తియ్యకూడదుట లోపలికెళ్ళారు.

మరో ఇద్దరు వారి ముందు నడుస్తున్నారు. వారిని వెళ్ళనిచ్చి చూస్తూ వెడుతున్నాడు మధుసూదనం. ఇట్లాంటి శిల్పాలు తను ఉత్తర హిందూదేశంలో చాలా చూసింది. దిల్వారా ఆలయం, భువనేశ్వర, కుజరాహో... ఇవి అల్లాగే ఉన్నాయి. కైలాసం ప్రసిద్ధ శిల్పం. అతిప్రాచీన మైనది—— పదహారువందల సంవత్సరాల క్రితంది ఇవన్నీ బౌద్ధశిల్పాలు. పెద్దవి భీకరంగా వుంటాయి. మధు చేతులతో శిల్పాలని తడుము తున్నాడు.

"మీకు చదరంగం నేర్పనా ?"

"నాకు చదరంగం ఎత్తులు తెలుసు—— ఏది ఎట్లా నడ స్తుందో"

"ఇట్లా రండి"

అక్కడ చీకటిగా వుంది. భయమేస్తోంది. స్తంభాన జేర్లబడింది.

అతను దూరంగా వెళ్ళి తన పక్షంకేసి చూస్తున్నాడు. లాల్చీ జేబులోంచి టేపుతీశాడు. దగ్గర కొచ్చాడు. నిలువునా టేపు వేశ్శాడేసి కొలత చూస్తున్నాడు. భుజాల వెడల్పు కొలుస్తున్నాడు.

"ఏమిటిదంతా ?"

నవ్వేతాడు

"వెర్రి"

మెడచుట్టూ కొలుస్తున్నాడు. అతని శ్వాస తన మీద పడకుండా మొహం తిప్పేశాడు.

"ఇంక రండి"

వెడుతున్నారు

"ఇక్కడ నిలబడండి. మోకాలు మడిచి నిలబడండి ?"

తనకి చేతకావడం లేదు. తన పాదం పైన చేతులుపెట్టి పైకి వంచుతున్నాడు.

"ఏం పనది ?"

"శివుడు పార్వతి చదరంగం ఆడుతున్న శిల్పం ఇది. జన్మ రాహిత్యము అయ్యేవరకూ మనిషి జన్మలెత్తుతూ ఉంటాడంటారు మన పెద్దలు. పదహారువందల సంవత్సరాల క్రితం మీరు ఇక్కడే కూర్చున్నారు. చదరంగం ఆడుతున్నారు. ఆనాటి శిల్పి మీ చిత్రం రాతి మీద చెక్కివేశాడు. దైవం పేరిట వారి సౌందర్య తృష్ణ తీర్చుకోవాలి. పాపం పూర్వం వాళ్ళు ఆదోడగా అందరూ మెచ్చుకుంటారు. ఆ శిల్పిని నేను మాత్రం కాను."

"ఇది నాలా ఉందంటావా?"

"అనను"

"మీరు దానిలా అయ్యేవరకూ జన్మలు ఎత్తుతూనే ఉంటారు."

"పిచ్చి."

"తప్పకుండా పిచ్చే. కాని అందమైన పిచ్చి."

మళ్ళా వెడుతున్నారు.

"నదీదేవత—ఆ కళ్ళల్లోకన్నీరుజారి నదిగా ప్రవహిస్తోంది" అంటున్నాడు.

"నాకేం కనబడ్డంలేదు"

"ఊహ పురుషుడు —శరీరం స్త్రీ, దేవత నదీప్రవాహం—పురుషుడు వొడ్డు, మట్టిముద్ద స్త్రీ—శిల్పి పురుషుడు..."

"భ్రమ."

"భ్రమకాదని ఈ భైరవుడి మూర్తిని చూస్తే తెలుస్తుంది."

రాత్రి భైరవుణ్ణి చూస్తే భయమేస్తుంది. మధు మళ్ళా మొదలెట్టాడు

"మెడలో పుర్రెలమాల. మృత్యువు తాండవించినట్లు — పుర్రెలు మద్దెళ్ళు; దారం వీణతీగె; సృష్టి సమగ్రించిన రక్తం, మాంసం, కండ, ఎముకలు—పీల్చి పిప్పిచేసి, ఆ మెరిసి పొయ్యే నేత్రాలు పీకేసి, రెండు కంతలు మిగులుస్తాడు భైరవుడు. ఆడా మగ వ్యత్యాసాలులేవు. మనస్సు కనబడదు. ఊహించాలి, ఊహించేశక్తి ఒక్కటే మానవుడి సొత్తు."

పన్నెండు బౌద్ధగుహలు తిరిగేటప్పటికి తనకి అలుపొచ్చింది. చెమటబిందువులు నుదిటిమీదనుంచి జారుతున్నాయి. బైటకొచ్చి నిలబడింది. పన్నెండు దాటుతోంది. మహిషాసురుణ్ణి చూస్తున్నాడు అతను. ఏవో కొలతలు కొలుస్తున్నాడు. వొచ్చాడు జీప్‌లో బైలుదేరారు. పాకలో కెళ్ళారు. భోజనం ఏర్పాట్లు చేస్తున్నాడు పూజా. లోపల్నించి ఓ అమ్మాయి వొడ్డనకొచ్చింది. నల్లగా, పొట్టిగావుంది. చింపిరిజడ. మెళ్ళో ఎర్రపూసల హారం—పచ్చగాజులు, డోకొస్తుంది. స్నానం చేసిందా? ఆ ఊదారంగు చీరెక్కడ దొరికింది?

"ఆమె ఎక్కడ అని అడిగారు. ఈమే ఆమె." అన్నాడు. ఆ పిల్ల వెళ్ళినవేపు చూపుతూ.

ఆశ్చర్యమేస్తుంది. ఇదెక్కడ దొరికింది? తన కక్కడినుండి వెళ్ళిపోవాలనుంది ఛి, ఛి!

"పేరు—తుక్కమ్మ" అని నవ్వుతున్నాడు.

'తగినపేరె."

తనూ నవ్వుతోంది. ఇద్దరూ విరగబడి నవ్వుతున్నారు.

"తుక్కమ్మది ఔరంగాబాద్ దగ్గర ఓ పల్లెటూరు. గొర్రెలు కాస్తుంది. ఒస్తూంటే కనబడింది ఆపని యీపని చెయ్యడానికి రమ్మన్నా. ఒప్పుకుంది షూజాని పెండ్లి చేసుకోమంటున్నా. వాడు తనకి నచ్చలేదుట. షూజా దేవపురుషుడు-అంటే వాడి శరీరం."

"ఛీ, ఛీ!"

"శరీరంపట్ల మనకి గౌరవం పోయింది. శివలింగపూజ ప్రాధాన్యం పూర్వులు పొగిడినా, యీనాడు శరీరం శక్తిపట్ల ఆదరణ లేదు ప్రతిభాశాలులైన ఒకరిద్దరు శిల్పులు రాయిద్వారా యీ సూత్రం చాటుతున్నారు. ఆధునిక శిల్పానికి మొహం ఉండదు --స్ఫుటమైన ఆకారంలో ముఖ్యమైన కోణాలు మాత్రం ఉంటాయి. అట్లా ప్రదర్శిస్తే, కళ్ళు తెరిచి శరీరం చూస్తారని. కాని చూడ్డంలేదు. ఎగ్జిబిషన్‌లో పెడుతున్నారు. శిథిలయాల కింద జమకట్టి, పురావస్తు శాఖవారికి వప్పగించేస్తారు. మరొకరి శరీరం చూడలేనివారు తమ శరీరాలు చూసుకోలేరు."

తుక్కమ్మది చిన్నముక్కు—చేపపిల్లలాంటి చిన్ని కళ్ళు- నల్ల జిగురుచెట్టు బెరడులాంటి ఛాయ.

"నల్లరాతిలో చెక్కిన స్వప్నం" అన్నాడు మధు ఆమెను వుద్దేశించి.

ఛీ, ఛి అట్లా గంటా దేమిటి? గబగబ భోజనంచేసి చెయ్యి కడుక్కుంది. పక్కచుట్ట అమర్చింది తుక్కమ్మ—దానిచేతులతో తాకిన పక్కమీద ఎల్లా పడుకోడం?

షూజా సరుకులు తెస్తానని వెళ్ళాడు. నిద్రొస్తోంది. పడుకుంది జ్ఞానసుందరి.

రెండైంది. మెళకువొచ్చింది. ఏదో చప్పుడు. సుత్తితో రాళ్ళని

కొడుతోన్నట్లు. లేచి చూసింది. ఎవ్వరూ కనబడరు పాకలో మధ్య పరదాలా అమర్చిన గుడ్డవెనక ఏదో చప్పుడు. కిందనించి చూసింది. ఆ పిల్ల—తుక్కమ్మ—వివస్త్రఅయి నిలబడింది. అటు తిరిగింది. కదలకండా నిలబడింది—నల్లరాయిలా, మధు కొలతలు కొలవడం. మళ్ళా ఎదురుగా ఉన్న ఎర్రరాయి మీద సుత్తితో కొట్టడం—తెలిసింది ఆమె శరీరం ఆధారంగా, రాతిమీద శిల్పం చెక్కుతున్నాడు. గబగబ వెళ్ళి పడుకుని కళ్ళు మూసుకుంది.

రాతిమీద సుత్తితో కొడుతున్నాడు—చప్పుడు ఆమె నరాలని కోస్తోంది—శరీరంలో ఏదో వేదన లోపలనుంచి గుండెలు శరీరం పైన కొడుతున్నట్లు—ఉద్రేకాల విప్లవం—దొడ్లోకి వెళ్ళి మొహాన చన్నీళ్ళు జల్లుకుంది. అవతల చెట్లు ఎండలో మాడుతున్నాయి. రాళ్ళు గుడ్లెర్ర జేసినట్లు కాలుతున్నాయి. అంతా వేడి—కాఠిన్యం జ్వాల.

టీ తాగాలని వుంది. పూజా లేదు. తనే పాలడబ్బా కోసం వెదికి పెట్టుకుంది.

"మీ కెందుకు శ్రమ. ఆపిల్ల పెడుతుందిగా" అన్నాడు మధు లోపలి కొచ్చి.

"దాన్ని పంపించివెయ్యి."

"అదేం చేసింది?"

"నాకేదో చిరాకుగా వుంది."

అతను వెళ్ళాడు లోపల ఏదో గుసగుసలు. మళ్ళా సుత్తి దెబ్బలు రాతిముక్కలు నలుదిక్కులా ఎగిరిపడుతున్నాయి. తన ముందొకటి పడింది. నల్లరాతిపెంకు. తడిమితే వేడిగా వుంది. తొందరగా లోపలి కెళ్ళింది.

"కాసేపు ఆపు" అని గర్జించింది. నిలిపాడు.

"ఆ పిల్లతోనా...?"

"ఏదో వొక ఆకృతి వుండాలిగా."

"పెండ్లాం వుందిగా."

"పిలాగే ఇట్లాంటి పనులు చిరాకు. ఈ పనిలో డబ్బు, హోదా లేవు. నిరుపయోగమైంది. అట్లా కూర్చుంటుందా నిలబడుతుందా,...మీకు తేలీదు?"

"దాన్ని పంపించి వెయ్యి"

దగ్గరగా వొచ్చాడు. చెవులో రహస్యంగా చెప్పాడు.

'ఛ, ఛ—నేనా—? మంచివాడివే—నీకు మతిపోయిందా?"

"కోపమైతే అడగను లెండి..."

"సిగ్గులేదూ."

"సిగ్గువల్లే నిజమైన శక్తుల్ని హరింపజేసుకుని వికాసంలేని వృధా జీవితాలుగా తయారవుతున్నాయి మన బ్రతుకులు. ప్రాచీనులకి లేవు. ఉంటే అజంతాచిత్రాలు, ఎల్లారా శిల్పాలు ఉండవు. ఆ పిల్లకి రూపాయి కావాలి. ఇంకేమీ ఒద్దు. మరి నా కెవ్వరూ దొరకలేదు. ఏం చెయ్యను?"

నువ్వు శిల్పివా? ఎప్పుడూ ఇట్లాంటివి ఇంటిదగ్గర చెయ్యలేదే!" అన్నది తాను.

"శిల్పిని కాను. నే నెవర్నీకాను. నాకు వ్యక్తిత్వం లేదు. భార్యకి డబ్బు గడించిపెట్టే నౌకర్ని. పిల్లల్ని స్కూలుకి తీసికెళ్ళే ఆయాను. జ్వరం ఒస్తే టెంపరేచర్ చూసే నర్సుని. రాళ్ళ పరిశోధన నా ఉద్యోగం. ప్రొమోషన్ లేదు. నేనొక రాయి నయినాను. శిథిలమయ్యే స్థితిరాకుండా, నే నేర్చుకున్న ఆ ఒక్క పాఠాన్ని ప్రకటించాలంటే రాళ్ళే అనువైన పరికరం. శిల్పం చేతకాదు. రాయితప్ప మరొకటి నా కర్థమవదు. ఆస్ట్రేలియా నుండొచ్చిన ఆ దొరగారి దగ్గర పద్ధతి తెలుసుకున్నా పరిక రాలు కొన్నా, ఆయన సహాయంతో కొన్ని సూత్రాలు ఆచరణలో పెట్టాను చూడండి."

మూలనున్న బుట్టపైన కప్పిన గోనిసంచీ తొలగించాడు. ఎరుపు రంగు మూడడుగుల ఎత్తు బొమ్మ. పురుషుడు మోకాళ్ళమీద ఒంగి, ప్రాకుతున్న చిత్రం. మోకాళ్ళు మోచేతులు కణుపులు కట్టినట్లున్నాయి పేగులు కనబడుతున్నాయి. ప్రక్కన నిలబడిన మరో ప్రతిమ—స్త్రీలా గుంది. ఇంకా పూర్తికాలేదు.

"పురుషుడు స్త్రీకి బానిసకావడం – అన్నది నే చెప్పదల్చిన భావం. 'స్వేచ్ఛ' అనే విషయంపై శిల్పాలపోటీ జరుపుతున్నారు కలకత్తాలో. ఈ భావం స్ఫురించింది—ఆస్ట్రియా గురువు నవ్వాడు కాని, చివరికి ఆమోదించాడు. ఆయన భార్య ఆయనకి విడాకులిచ్చింది."

"ఇప్పుడు నీకేం లోటొచ్చింది ?"

"ఏం లోటు లేదు—అదీ ఒక లోటే. నేను చెయ్యదల్చుకున్న వాటిని చెయ్యనివ్వడం, దానివల్ల ప్రయోజనం లేకపోయినా— అంతే నే కోరేది..."

"అవి చెడ్డపనులయినా కూడానా ?"

"ఒకరి దృష్టిలో చెడ్డకావొచ్చు."

"నువ్వు చెప్పింది నిజమైతే, అసలు సంఘంలో నీతి, మంచి అంటూ వుండవు."

"మామూలు వాళ్ళకి నీతి, మంచి వుండాలి — కాని ఏ ఒకరిద్దరో అసాధారణ వ్యక్తులుంటారు. ప్రతి సంఘంలోనూ వారికి స్వేచ్ఛ వుండాలి. ఉంటేనే ఏదోవొక ఘనకార్యం చెయ్యగలుగుతారు. సంస్కృతి, నాగరికత వారివల్లనే వృద్ధి చెందుతాయి. ఈ యదార్థం సంఘ సంస్కర్తలు గుర్తించే వరకూ ప్రతిభాశాలుల కృషి ఫలించదు."

"నువ్వు అసాధారణ వ్యక్తివా ?"

"కాను. ఏమో, ఒకయత్నం చేస్తాను. అది ఫలించకపోతే మామూలు మనిషినే, ఇదంతా విడిచిపెట్టి, పిల్లల్ని కంటూ, నెలజీతం భార్యకిస్తూ, నౌకర్లా, మంత్రసానిలా మామూలు జీవితం సాగిస్తాను" అన్నాడు.

ఇదంతా ఏదో గొడవగా వుంది. తన కి సమస్యలు లేవు. భర్త లేడు. సంసారం లేదు. స్వేచ్ఛాజీవి. తన చిత్రం చెక్కొచ్చుగా! ఇందాక అడిగినప్పుడు ఊ అనకూడదూ! అప్పుడు ఛ, ఛ అని చీదరించుకుంది. ఇప్పుడింక వెనక్కి వెళ్ళడానికిలేదు. బెట్టుగా వుండాలి. అతను దొడ్లోకి స్నానాని కెళ్ళాడు. బొమ్మని దగ్గరగా చూసింది. వేళ్ళతో తాకింది. ఎర్ర ప్లాస్టర్ ముద్దలో తయారయిన చిత్రం. మోకాళ్ళమీద మనిషి జంతువులా వున్నాడు కాని, మనిషిలా లేడు. తువ్వాలుతో ఒళ్ళు తుడుచుకుంటున్నాడు, బట్టలు ఆరబెడుతున్నాడు.

"ఆ పిలేదీ ?"

"పంపించివేశాను.'

"మరి నీ పనికి అక్కర్లేదూ ?"

"నాకు తెలుసు. మీకు పరస్త్రీ పంచనుండటం గిట్టదని."

"ఛి, ఛి ! నా కదంటే అసూయా?"

"మీకా్కదు. దానికి మీరంటే అసూయ వుండొచ్చుగా, ఈ పూట కదలకుండా కూర్చోలేకపోయింది. అటు, ఇటూ చూడ్డం, మెడతిప్పడం, కాళ్ళు తిమ్మెర్లు—అన్నీ అంతరాయాలే. దానికి హృదయం లేదనుకున్నా. పొరబాటు. అదీ మనిషే—పంపించివేశాను..."

దిగులుగా వున్నాడు. దగ్గరగా వెళ్ళింది తను.

"కోపం వచ్చిందా ?"

"ఎందుకు ?"

"నేనలా అన్నందుకు "

"లేదు. పెద్దకార్యం సాధించాలంటే శిక్షణ, సాధన కావాలి. ఉద్రేకాలకు గురికాకూడదు. కోపానికి గురైనవాళ్ళు కారాగార శిక్షపొంది, జైళ్ళలో రాళ్లు కొడుతూ వుంటారు. శిల్పాలు చెక్కరు."

"ఈ రాతిబొమ్మ ఏమిటి ?"

"ఆ చిన్నది ప్లాస్టర్ శిల్పం, అది పూరికే మోడల్. దాన్ని ఆధా

తంగా రాతిమీద చెక్కాలి. పచ్చ మారుబుల్ రాయిని సంపాదించాను. పురుషుడి బొమ్మకు పూజా ఆధారం. స్త్రీ ప్రతిమ పూర్తి కావాలి. నమూనా దొరకడం లేదు, స్త్రీ ఠీవిగా నిలబడి, ఆ వొంగిన పురుషుడి ప్రక్కన చేతిలో గరిట పట్టుకున్నట్లు చిత్రించాలి. అతను బానిస—ఆమె యజమాని, ఆమె ఆయుధం అట్లకాడ. అతని ఆశయం యజమానిరాలికి కోపం రాకుండా, దగ్గరలోనే వెనక పాకుతూ పోతూండడం..."

మళ్ళా నవ్వుతున్నాడు. రాతి బండ నాలుగడుగులుంది. తలకాయ స్వరూపం మాత్రం గుండ్రంగా, బంతిలా చెక్కబడివుంది. ఎదురుగా మరో రాయి వుంది. దాని మీద కూర్చుని, రాతి కేసి చూస్తోంది. అతను రాడేం? బైటకొచ్చి చూసింది. అక్కడ లేడు. తను కూర్చున్న రాయి మీదనే ఇందాక ఆ పిల్ల కూర్చుని వుంది. ఆ రాతిని ఒక్క తాపు తన్నింది. అది దొర్లింది, రెండు ముక్కలైంది. పాదం మండుతోంది.

జీప్ లేదు. గుహల్లోకి వెళ్ళుంటాడు. తను బైటకి నడిచింది. గుహల దగ్గరకి వెళ్ళటం ఎట్లా? చాలా దూరం. సూర్యాస్తమయం చూడ్డానికి వెళ్ళుంటాడు. కొండపైకి. మళుపు తిరిగి కొండమీదికి నడుస్తోంది. అరగంట నడిచింది. అలుపొచ్చింది. అక్కడ రాతిమీద పడుకుంది. సూర్యుడి కేసి చూసింది. సూర్యుడు నూనెలో మంట ప్రతిబింబంలా మసగ్గా వెలుగుతున్నాడు. వేటకాడు పొదిలోకి అంబులు దింపుకుంటున్నట్లు, కిరణాలు దిగిపోతున్నాయి. క్రూరమృగాలు వేటగాడిని చుట్టుముట్టినట్లు నల్ల మేఘాలుకుంటుకుంటూ దిగిపోతూన్న సూర్యుణ్ణి తరుముతున్నాయి. పిల్ల మేఘాలుచెదిరి పోతున్నాయి. ధైర్యం చెబుతూ సుడిగాలి రేగింది. సూర్యుడు గాయపడ్డాడు. పడినచోట రక్తం చిమ్మినట్లు కాస్తంత ఎరుపు ఆకాశం అంచునిపట్టుకుంది. రక్తం తాగడానికి అడివి మృగాలైన మేఘాలు ఆ కాస్త చోటూ మూసేశాయి. గాలి విజృంభించింది. మేఘాలు ఒకదానిమీద ఒకటి పడి కొట్లాడుకుంటున్నాయి.

జ్ఞానసుందరికి పమిట వుండటంలేదు. జడ వూడింది. చీర లేచి

పోతోంది. మొహాన ఆకులు, దుమ్ము, కీటకాలు పొడుస్తున్నాయి. ప్రకృతి తరుముతోంది. గాయపడిన సూర్యుడి గుండె పగిలినట్టు ఉరుములు, చినుకులు పడుతున్నాయి. యవ్వనంతో విర్రవీగినట్లు చినుకులు ధారైనాయి. ఆమె పరుగెడుతోంది. పాక చాలా దూరంవుంది. తడిసి ముద్దవుతోంది. ఏం చెయ్యడం? పెద్ద రాతిబండకింద కాస్తంత నీడుంది. ఆ బండ కింద అవతలవైపు మనిషి అంజడైంది. మధుసూదనం.

"మీరిల్లా ఎందుకొచ్చారు?"

"నువ్వెందుకొచ్చావు?"

"రాళ్ళు ఏరుదామని"

చలితో వొణికి మాట తిన్నగా రావడంలేదు. తన లాల్చీతీసేశాడు.

'నెత్తిన కప్పుకోండి.'

దగ్గరగా జరిగింది. అతనివక్షం మీద తల ఆనించి, లాల్చీ పైకి లాక్కుంది. అటు తిరిగాడు. దూరంగా వెళ్ళాడు. గట్టిగా అతని నడుం పట్టుకుంది. విదిలించాడు. మోకాళ్ళు పట్టుకుంది—చేతులతో ఆమెని పైకి లేవనెత్తాడు.

"అటు చూడండి."

–ఏమిటిది?"

"నాగరాజ్యలక్ష్మి."

"ఎక్కడా—భలేవాడివే."

నవ్వుతున్నాడు–వొణుకుతూ. ఉంగరాల జుట్టు కాడలలా కళ్ళమీద పడుతోంది. అతని గెడ్డం ఆమె బుజాల మీద గుచ్చుకుంటోంది. అతని మెడ చుట్టూ చేతులు వేసి రొమ్ములు వీపు మీద నొక్కుతోంది.

"రండి వెడదాం. ఇప్పట్లో తగ్గదు."

"దోవ కనబడదు. భయంగా వుంది.

"నా వెనకాలే రండి." మెరుపుతీగలు ఆకాశంలో చీకటి బాధని వెలిగిస్తున్నాయి. అతన్ని పట్టుకుంది. ఆమె పట్టు విదిలించుకున్నాడు.

చేతిని గట్టిగా బిగించి పట్టుకుంది. నడుస్తున్నాడు. తను పడుతోంది. చేయూతనిస్తున్నాడు. పాదాలకింద రాళ్ళు పొడుస్తున్నాయి. గడ్డిలో ముళ్ళు—'అమ్మో, చచ్చాను' ఎగిరి గంతేసి అతన్ని కౌగిలించుకుంది. నున్నటి ఛాతీ మీద ఆమె హస్తాలు బిగిశాయి. తీగలాంటి వేళ్ళతో పట్టు విప్పి వేళ్ళని పట్టుకున్నాడు.

"తిన్నగా నడవండి."

"భయంగా వుంది."

"వొచ్చేశాం."

వర్షం దిక్కు మారింది. వెనకనుంచి పొడుస్తోంది. ఆమెముందు, అతను వెనుక, నిలబడిపోయింది. అతని చేతులు తీసుకుని వక్షం పైకి లాక్కుంది. జడ వూడి అతని చేతుల మధ్య ఇరుక్కుంది. గాజులు పటుక్కుమన్నాయి విదిలించుకున్నాడు. పరుగెడుతున్నాడు. తనూ వేగంగా నడుస్తోంది, మాట రావటం లేదు. గుండెదడ, కాళ్ళు పట్టులేవు, పడిపోతోంది. మోకాళ్ళమీద పడింది. అతను లేవదీశాడు. ఆమె భుజాన్ని తనచేతుల మీద ఆనించి నడిపిస్తున్నాడు. వేళ్ళాడిపోతోంది. బరువంతా అతనిపైననే. కుంగిపోతున్నాడు. పూజా గుడ్డి దీపంతో, గోనిసంచీ నెత్తిని కప్పుకుని వాళ్ళ కేసి వస్తున్నాడు. ఇద్దరూ సాయం పట్టి, ఆమెని పాకలోకి జేరవేశారు.

"వర్షం తగ్గాక జీపు తీసుకురా"

"అందుకే పోతుండా."

లోపల చీకటి. పక్క మీద పడుకోబెట్టాడు దుప్పటి కప్పాడు, పొయ్యి ముట్టించాడు తువ్వాలు, పొడిచీర మీద పడేశాడు. తను లేవ లేదు. తడి బట్టతో అలానే పడుంది. ఆమె పైన బ్యాటరీ లైటు వేశాడు. చీర వొంటికి చుట్టుకుంది. తడికి వొళ్ళంతా కనిపిస్తోంది.

"దుస్తులు మార్చండి."

తను మాట్లాడలేదు.

"టీ తీసుకోండి."

తను లేవలేదు, తల కింద చెయ్యి పెట్టి, పైకి లేవదీసి కూర్చో బెట్టాడు. టీ గ్లాసు పెదవులకు తగిల్చాడు. అతని నడుం పట్టుకుని కూర్చుంది. వొదిలించుకుని. జరిగి దూరంగా కూర్చున్నాడు.

"అమ్మో, నన్నొదిలి వెళ్ళకు, భయంమేస్తోంది."

"భయం దేనికి ? ఇంటికి చేరుకున్నాంగా" నీరు వరండా చుట్టూ పొంగుతోంది. గాలికి కర్రలు కదలి వూగాయి. అడ్డంగా కట్టిన తాడు, పరదా, అన్నీ కిందకి కూలాయి. పైన వేసిన తడక లెపరెపలాడి కొట్టుకు పోయింది. పొయ్యి ఆరిపోయింది, చీకటి అంధకారం. అతన్ని వెదుకుతూ అటూ యిటూ కదులుతోంది. ఏడీ— కనబడడేం ?

"ఎక్కడ ?"

"ఇక్కడ, భయం లేదు. తగ్గిపోయిందిలెండి."

వర్షం తగ్గింది. గాలి నీరసించింది, తెచ్చిపెట్టుకున్న కసితో వుండి వుండి వో చినుకు నేలని వెదుక్కుంటూ పడుతుంది.

"నాకేం కనపట్టంలేదు, ఎక్కడ ?"

"ఇక్కడే— తగ్గిపోయిందిగా - మీరా తడి బట్టలతో గంగాదేవి వలె ఉన్నారు. మీకే భయమా ? మీ చెల్లెలికి భాగవతం వినిపించేది మా అత్తయ్య— జ్ఞాపకం వుందా ? గంగాదేవి అంటుందిట -

వియద్వీధిం బరతెంచి నేలబడ నా వేగంబునున్ సిల్పనో
పినవాడెవ్వడు మేదినీతలము నే భేదించి పాతాళముం
జనుదున్ వచ్చితినేని నా జలములన్ సంస్నాతులై మానవుల్
నను బొందించు నఘవ్రజం బెచట నే నాశంబు బొందించెదన్——

"అల్లాగ మీకు భయ మేమిటి ?"

తన కర్థం కావడం లేదు, తను ఏం నాశనం చేసింది ?

"నేను నాశనం ఏం చేశాను ?"

"మీకే తెలుసు !"

ఖూజా వొచ్చాడు, వాడి చేతిలో దీపం కాస్తా ఆరింది, మళ్లా ముట్టించాడు. లేచింది తను. దుస్తులు మార్చుకుంది. ఖూజా పొయ్యి ముట్టించాడు, తడక బిగించాడు. పరదా లేవనెత్తి, తాళ్ళతో కట్టాడు. తడిబట్టలు ఆరబెట్టాడు. తను పక్కగా వెళ్ళి రాతి మీద కూర్చుంది.

మధుసూదనం దీపం తీసుకొచ్చాడు. చేతిలో సుత్తి వుంది. దీపాన్ని ఎత్తుగా తాడుతో కట్టాడు. మసిలిసీడ కళ్ళల్లో పడుతోంది. చుట్టూ కీటకాలు. చేత్తో తోసేస్తోంది.

"నుంచోండి."

"ఎందుకు?"

"అడక్కండి"

నిలబడింది. బైట కప్పలు బెక బెకలు సాగించాయి. కీచురాళ్ళు విజృంభించాయి. దీపం సన్నగిల్లుతోంది. అతను సుత్తితో రాతిని చెక్కుతున్నాడు. పొడుం అవుతోంది. బెల్లాడి పడుతోంది. ఎంతసేపు? కాళ్ల లాగుతున్నాయి కూర్చుంది.

"నిలబడాలి."

"నావల్ల కాదు"

కూర్చునేవుంది. పురుగుల్ని తోసేస్తోంది.

"కదలకండి"

డిటెక్టివ్‌లా గాలి కెరటం వీచింది దీపం ఆరింది ఉలిక్కిపడి అతని మీద వొరిగింది.

"మీరు కదలకూడదు."

"చస్తోంటే శిల్పం ఏమిటి?"

"ఓపిక పట్టలేరు?"

మళ్ళా నిలబడింది.

"అటు చూడండి."

దీపం ముట్టించాడు. దానిచుట్టూ కాగితం పెట్టాడు. ఎదురుగా మరో తాడుకి టార్చ్‌లైట్ కట్టాడు. దాని వెలుగు తన మెడమీద పడుతోంది ఎదురుగా తువ్వాలుమీద తన నీడ పడుతోంది—వక్షం నీడ పెద్దదిగా అతిశయోక్తిగా పడుతోంది. చేతులతో కప్పుకుంది. గిరగిర తిరిగింది కూర్చుని మళ్ళా అతనిమీద వాలింది. మెడచుట్టూ చేతులేసింది. విదలించు కున్నాడు.

"ఒక్కక్షణం నిశ్చింతగా, కదలకుండా దీక్షగా వుండలేరు?"

అవేంమాటలు దీక్షేమిటి! తనిప్పు డేంచేసింది? మధుసూదనం అవతలి భాగంలోకి నడిచాడు పూజా రొట్టెలు తయారు చేసి ఒడ్డించాడు. ఆకలిగా వుంది. తింటున్నారు. అతనికేసి చూళ్ళేకపోతోంది. అతనంటే రోతగా వుంది. దీక్షట తన జీవితం అంతా దీక్షే. ఇందాకమట్టుకు,— అదుగో నాగరాజ్యలక్ష్మిని చూడు అని బెదిరించాడు. తను అక్క, ఆమె చెల్లెలు. చెల్లెలు భయపడాలి. చెల్లెలు ప్రవర్తన సరిగ్గా లేకపోతే తను అజమాయిషీ పెట్టాలి. తనకేం భయం?"

"అవి చన్నీళ్ళు. తాగకండి. ఇవిగో వేడినీళ్ళు. ఇవి తాగండి."

వేణ్ణీళ్ళు తాగింది భోజనా లయ్యాయి. చెల్లెల్ని గురించి ఆలోచిస్తోంది. ఈపాటికి తనిక్కడవున్న విషయం యాత్రనుండి తిరిగెళ్ళిన స్నేహితురాండ్రు తెలియపరిచే వుంటారు. వారిని గురించి ఊహించు కుంటూ వుంటుంది నాగులు.

పూజా పెద్ద బంగళాలో కెళ్ళి—మరో పెద్దదీపం తెచ్చాడు. ఆవలింత లొస్తున్నాయి. నిద్రొచ్చేస్తోంది. కళ్ళు మూతలు పడుతున్నాయి. మధుసూదనం పక్కచుట్ట పెద్దదిగా చేసి అడ్డంగా మడచి దానిమీద ఆమె వెన్ను వాలేటట్లు పడుకోబెడుతున్నాడు. పడుకోడం కాదు—కూర్చునే వుంది. తలమట్టుకు పక్కచుట్టమీద ఆనింది. పడక కుర్చీలో కూర్చున్నట్టుగా వుంది. కనురెప్పలు లేవడం లేదు. పెద్ద దీపం వెలుగు పల్చగా రెప్పలమీద పడుతోంది. నిద్రలో తనెక్కడికో జారిపోతోంది. చీకటి

గృహాలు ఎర్రటి సూర్యబింబం. వీనస్ గ్రహం గిలగిల తన్నుకుంటున్న దీపంబుడ్డి. పట్టాలమీద రైలు చక్రాల లయ, త్రిమూర్తి వొంటిమీద బీట, సముద్రంలో పిల్ల కెరటం—గాలి, గడ్డిపువ్వు. అతని గడ్డం మొనలు. తన వక్షంపై తీగ లాంటివేళ్ళు ఎక్కడికో వెళ్ళిపోతున్నట్లుంది. ఆలోచన లేదు ఊహలేదు.ఏదో చప్పుడు. ఎవరో సుత్తితో తన గుండెలపైకొడుతోన్నట్లు అబ్బ అమ్మో—బాధ బాధలో సుఖం—నిద్రలోకి ద్రలోకి—లోకి... కి...

జ్ఞానసుందరి లేచి కళ్ళు తెరిచి తన చుట్టూ చూసేటప్పటికి ఏడు దాటింది. తన వొంటికేసి చూసుకుంది, మామూలుగానే ఉంది. ఎలుకలు కొరకలేదు. పక్షులు పొడవలేదు— మనస్సు నిశ్చింతంగా, బలంగా తేటగా ఉంది, రాత్రి నిద్ర బాగా పట్టింది. మొహం కడుక్కుని, టీ త్రాగింది. స్నానం చేసింది. రాత్రి ఆరేసిన చీర బాగా ఆరలేదు. మళ్ళా ఆ చీరే కట్టుకుంది.

"అయ్యగా రేరి ?"

"అల్లా వెళ్ళారండి."

తనకి తోచడంలేదు అల్లా నడిచివెళ్ళింది. సూర్యుడి వెలుగుతో ప్రకృతి తలంటుపోసుకుని కొత్తబట్టలు ధరించినట్లుగా కలకల్లాడుతోంది. దాహం తీరిన నేల పెదవులు ముడుచుకుని పరున్నట్లు, బీటలు ఎండపెట్టు కుంటోంది. పాయలుగా చారలుగా చీరమడతలుగా నేల విడి, కలిసింది. పచ్చగడ్డిమీద నీటికణాలు వజ్రాలలా మెరుస్తున్నాయి. పాదాలకింద తడి దూసుకొచ్చి, కదలికను అరికడుతోంది. పక్షులు రెక్కలు ముడుచుకుని శాలువా కప్పుకున్నట్లు ప్రభాతగానం చెయ్యలేక, దగ్గరగా జరిగి, చోద్యం చూస్తున్నాయి. భూమిలోంచి తడి, రాళ్ళమీద వేడి ద్వంద్వాలతో తన శరీరాన్ని మభ్యపెడుతున్నాయి. నగ్నంగా నేలమీద పడి, సూర్యుడికి నమస్కరించాలనిపిస్తుంది ప్రకృతి ఆమెని కడిగి పవిత్రం చేసినట్ల

అయింది. ద్వేషంలేదు, రాగంలేదు, కోరికలేదు. తనిప్పుడు మరణిస్తే స్వర్గానికే వెడుతుంది. సీతాదేవిలా భూమి విడి ఆమెని కౌగలించుకుని లాక్కుపోతే బావుండును.

తొమ్మిదైంది. జీప్ చప్పుడు. అతను దిగాడు. మరొక వ్యక్తికూడా దిగాడు. ఇద్దరూ పెద్ద కర్రపెట్టెని దించుతున్నారు పాకముందు.

రాత్రి తాను చేసిన విషయాలు జ్ఞానసుందరికి జ్ఞాపకం రావడం లేదు. ఏ మంది? ఏం కావాలి? ఏం మాట్లాడింది? ఆ గాలి, ఆ వర్షం—తను మరో అవతారం దాల్చింది. ఎవ్వరికీ అర్థంకాదు. అతని కర్థమౌతుంది, పాకకేసి నడుస్తోంది. సామానంత సర్ది జీపులోకి చేరవేస్తున్నారు. పెద్ద కర్రపెట్టెని, ఆ ముగ్గురూ జీప్‌లో ఎక్కిస్తున్నారు. కుండలు, చెంబులు మూజా పెద్ద బంగళాలోకి పట్టుకుపోతున్నాడు. ప్రయాణానికి సిద్ధంచేస్తున్నట్లుగా ఉంది.

"లేవండి".

"ఎక్కడికి?"

"ఇంటికి".

పక్కచుట్టి, బాగ్ లోపలపెట్టారు. మూజా బట్టలు మార్చాడు, బనీన్ తొడుక్కున్నాడు, టోపీ పెట్టుకున్నాడు. మధు లాల్చీ, పైజామా వేసుకున్నాడు. అతను మొహం తేటగా ఉంది. ఏదో మార్పుంది. అవును. గడ్డం చేసుకున్నాడు నున్నగా, ఆకుపచ్చగా మెరుస్తోంది గడ్డం. అదుగో గడ్డంకింద ఆ మచ్చ, అది కనబడకుండా గడ్డం పెంచాడా? ఏమో ఎవరికి తెలుసు? బుట్టనిండా రకరకాల రాళ్ళు, మరో బుట్టల్లో ప్లాస్టర్ చిత్రం—వెనకసీటంతా సామానులు సరిపొయ్యాయి. మూజా వెనకాల ఎక్కి, పెట్టెలపైన కాళ్ళతో నొక్కి కూర్చున్నాడు.

ఔరంగాబాద్ చేరుకునేటప్పటికి పదకొండైంది. ఏదో యింటికి వచ్చారు. దోవలో పత్రిక కొన్నాడు మధు.

"చదువుకుంటూ ఉండండి ఇప్పుడేవస్తాను" అని జీప్‌లో మూజాతో

వెళ్ళాడు. పత్రికలలో విషయాలు మరో లోకం వార్తలలాగున్నాయి. తనకి వాటితో సంబంధంలేదు. చదవాలని లేదు. కళ్ళుమూసుకుని పడుంది లేచే టప్పటికి పన్నెండైంది, వాళ్ళొచ్చారు. ముగ్గురూ హోటలు కెళ్ళి భోజనం చేశారు. అక్కడనుండి బండిలో స్టేషన్‌కి వెళ్ళారు.

ప్లాట్‌ఫారం చివరికి వెళ్ళారు. అక్కడ జనం లేరు. ఇంకా చివరికి, ప్లాట్‌ఫారం దాటారు. చెట్లు నీడలో నుంచున్నారు.

"రాత్రి ఎల్లాగో ప్రవర్తించాను కదూ ?"

నవ్వుతాడు.

"హిస్టీరియా" అన్నది తనే.

మాట్లాడడు.

"మనుషుల్ని ఎవ్వరూ అర్థంచేసుకోరు; అవునా?"

"ఎవ్వరూ అర్థంచేసుకోపోతేనే ఇంత బాధపడతాం, అర్థం చేసు కుంటే ఇంకెంత బాధపడతామో!" అన్నాడు. జాలేస్తుంది. ఇదివరకెన్నడూ చూడని వికాసం, ఒక తేజస్సు అతని మొహంలో అస్పష్టంగా మెరు స్తోంది. కళ్ళవెనక నీరూరినట్లు, తడి మసలుతోంది. కళ్ళల్లో ఎర్రచారలు తిర్చి వున్నాయి.

"రాత్రి నాకు బాగా నిద్రపట్టేసింది. నువ్వు నిద్రపోలేదు. కళ్ళు ఎర్రగా వున్నాయి."

"నిన్నరాత్రి సజీవుడనై వున్నాను."

"అంటే?"

"రైలొస్తోంది."

"అవును, రైలుపొగ కొండ వెనక పాకుతోంది

ముందు పట్టాలు అదురుతున్నాయి. జనం ముందుకి పరుగెడు తున్నారు. తను, అతను జనంలోకి వేగంగా నడిచారు. రైలు నిలిచింది. ఆడాళ్ళపెట్టెలో ఖాళీగా వుంది. తనని ఎక్కమన్నాడు. ఎక్కింది. బట్టల సంచీ, పక్కచుట్ట అందులో పడేశాడు మూజా. అతను తన పెట్టెముందు నిలబడాడు.

"రైలు కదిలే వేళయింది. ఎక్కరాదు?"

"ఫరవాలేదు. ఒక విషయం చెప్పనా?"

"ఏమిటది ?"

తన వక్షంకేసి తీక్షణంగా చూస్తున్నాడు. పమిట సర్దుకుంది.

"నన్ను క్షమించాలి."

"ఎందుకు?"

"రాత్రి ఒక అపచారం చేశాను."

గుండెలు కొట్టుకుంటున్నాయి. ఆ ఉదయం తను లేవగానే, ఒంటికేసి చూసుకుంది. ఎందుకో తెలుస్తోంది.

చెప్పు"

"మీకు వేడినీళ్ళల్లో నిద్రమందు కలిపిచ్చాను."

"అందుకనే బాగా నిద్రపట్టేసింది, మేలుకోవాలనుకున్నా సాధ్యం కాలేదు. ఎందుకు?"

"కదలకుండా, నిశ్చలంగా వుంటారని."

"రైలు కదిలే సందడి వినబడుతోంది. షూజా పక్క పెట్టెలో ఎక్కాడు. రైలు కదులుతోంది.

"నువ్వెక్కు."

నవ్వుతూ నిలబడ్డాడు, రైలు వేగం పెరిగింది. ఎక్కడేం ? ప్లాట్ ఫారం మీద నిలబడి నవ్వుతున్నాడు. అదేమిటి ?

చెయ్యి వూపుతున్నాడు. దూరంగా, పసివాడిలాగై పొయ్యాడు.

ఏదో స్టేషన్‌లో ఆగింది రైలు. షూజా పెట్టెదగ్గర కొచ్చాడు.

"అయ్యగారు రాలేదేం?"

"వారెటో వెడతారుట. మిమ్మల్ని దింపి రమ్మన్నారు. టిక్కట్లు నా దగ్గరున్నాయి.

"ఏ వూరుట ?"

"నాకు చెప్పలేదు."

రైలు కదిలింది. పక్కపరుచుకుని పరుంది జ్ఞానసుందరి. తనలో జ్ఞానంలేదు, సౌందర్యంలేదు. పేరులో రెండూ వున్నాయి. అందమైన పేరు. నిద్ర పట్టేసినట్లు తెలుస్తూంది. ఇంక తెలవడం లేదు.

ం ం ం

చెల్లెలిగారింటికి చేరుకునేటప్పటికి ఉదయం తొమ్మిదయింది. మరో బండిలో వెడతానని మూజా స్టేషన్‌లో దిగడాడు. ఇంటి దగ్గర నౌకరు లాల్‌గిరి వున్నాడు.

"అమ్మగా రేరి?"

"అమ్మ మీనాక్షిగారింటి కెళ్ళింది" అంటూ మధురభక్తి పరుగెత్తుకొచ్చి ఆమె వొళ్ళో కూర్చుంది. మధురంని కౌగలించుకుంది. అప్రయత్నంగా కళ్ళమ్మట నీరు కారుతున్నాయి.

"అంతా బాగున్నారామ్మా ?" ఏడ్చేస్తోంది. మధురం ఏడుపు ఆపుకొని నీళ్ళు తుడుచుకుని నవ్వుతోంది. రెండు జడలు. ఎర్ర గౌను పల్చటి మొహం, పెద్ద కళ్ళు మధురం ముద్దుగా వుంటుంది.

"నాన్నేడి ?"

"వస్తాడు"

"ఏడీ ? అమ్మని పిల్చుకొస్తా" మధురం పరుగెత్తింది. స్నానాని కెళ్ళింది జ్ఞానసుందరి, స్నానం చేసి కొత్త చీర—పసుపు పచ్చటి. ఎర్ర బోర్డర్ ఖద్దరుది కట్టుకుంది.

"ఆయనేరీ ?"

వెనక్కి తిరిగింది. చెల్లెలు నాగరాజ్యలక్ష్మి. ఆమె కౌగలించుకుంది. అల్లా నాలుగు నిమిషా లుండిపోయ్యారు. మధురం హాల్లో గంతులేస్తోంది. సంగీతం పాడుతోంది.

"రాలేదా ?"

"లేదు"

నాగరాజ్యలక్ష్మి ఏడ్చేసింది.

"చూశావా ?"

"మూడురోజు లున్నాను

"ఎల్లా వున్నారు ?"

"క్షేమంగా వున్నాడు

"మరి రాలేదేం ?"

ఏం సమాధానం చెప్పాలి ? చెల్లెలికేసి పరీక్షగా చూసింది. అమెను చూసి నాలుగైదు నెలలైంది. కాస్తంత లావెక్కినట్లుంది. మొహం వాచి నట్లుంది. కళ్ళ కింద గీతలు, వూడిన ముడి, ఎర్ర రాళ్ళ దిద్దులు, మెళ్ళో కొత్త పగడాల దండ.

"ఈ మధ్య చేయించావా ?"

కళ్ళు తుడుచుకుంది.

"మీనాక్షి కొంది. నన్నూ కొనమని చంపింది కాదనలేక పోయ్యాను. ముందిది చెప్పు, ఆయనేమైనట్లు—?"

జ్ఞానసుందరి చెప్పడం మొదలెట్టింది. ఏం చెప్పాలో ఎట్లా చెప్పాలో రోజల్లా రైల్లో అనుకున్నవి చెబుతోంది చూసిన యాత్రా స్థలాలు, బొంబాయిలో చెల్లెలి ఉత్తరం రావడం. అజంతాలో మధుని చూడ్డం, స్నేహిత బృందంలోంచి తాను విడిపోయిన ఉదంతం. పూజా ఆధారంగా అతను ప్రతిమ చెక్కడం—

"ఆ రాత్రి నిద్రపట్టేసింది. మొన్నాడు చూశాను. ఆ కుర్రాడిని నిలబెట్టి, కొలతలు కొలుస్తున్నాడు నా కప్పుడర్థం కాలేదు"

మర్నాడు ఎల్లోరా రావడం పాకలో మకాం సూర్యాస్తమయం—

"అలసి వున్నానేమో — నిద్రపట్టేసింది"

నల్లపిల్ల నగ్న దృశ్యం గురించి విడిచిపెట్టేసింది. అసలు ఆ పిల్ల విషయమే చెప్పలేదు. ఎల్లోరా గుహలు చూడ్డం. అక్కడి శిల్పాలని గురించి రాళ్ళని గురించి అతను చేసిన వర్ణన చెప్పింది. మర్నాడు పెద్ద

వర్షం తను పాకలోనే వుండిపోయింది. అతను వర్షంలో తడిసి వచ్చాడు. తనకి జ్వరం వచ్చింది.

"ఏదో మందు వేడినీళ్ళలో కలిపిచ్చాడు— బాగా నిద్ర పట్టేసింది. ఉదయానికి నయమైంది"

"చెక్కడం ఏమిటి ?"

చెల్లెలు కనుబొమ్మలు ప్రశ్నార్థకంగా చిట్లించినప్పుడు మరీ అందముగా వుంటుంది. ఎత్తు మరో రెండంగుళాలు వుండి వుంటే నిజంగా చెల్లెలు ఎల్లోరాలో నదీ సుందరిలా గుంటుంది.

"రాతిమీద శిల్పం చెక్కుతాడట, ఒక పురుషుడు కూర్చునట్లు— అంతవరకూ చూశాను"

"ఆయనకి శిల్పం ఏమిటి ?"

"ఏమో అక్కడెవరో ఆస్ట్రేలియా దొర ఒకాయన దొరికాడుట. అతన్ని చూసి నేర్చుకున్నాడట."

ఇంకేముంది? మొన్నాడు ప్రయాణం. తనకేం తెలుసు ? అతనూ వొస్తాడనుకుంది రాలేదు దిగడి పొయ్యాడు. పూజాని సాయం పంపించాడు.

"వా డేడీ ?"

"తిరుగు రైల్లో వాళ్ళ వూరెళ్ళిపోతాడుట."

"ఉత్తరం వ్రాయలేక పొయ్యావా ?"

"పెన్సిల్ గ్రాం ఇప్పించమన్నా, తిరగ్గొట్టేశాడు".

"ఎందుకు ?"

"ఎందుకో మరి"

"ఇంకేం చెప్పారు ?"

"కంగారుపడొద్దను. వారంలో వచ్చేస్తాను అని చెప్పమన్నాడు".

"లేచెడుతూ మొగుడికి చద్దికూడు ఇష్టమని చెప్పించటిట" అన్నది నాగులు.

తనకి వో సామెత జ్ఞప్తికి వస్తూంది— ఎక్కడా దొరక్కపోతే, అక్క మొగుడే దిక్కుట— ఎటొచ్చీ, ఇప్పుడు చెల్లెలి మొగుడు తనకి దిక్కు కాలేదుగా.

"ఎక్కడికెళ్ళి ఉంటా రంటావు? అసలు వస్తారంటావా- నువ్వెల్లా విడిచి వచ్చావే ?"

సమాధానం ఏం చెప్పాలో తెలీదు.

"ఇంక రైలులోంచి దూకాలి".

నవ్వింది నాగులు.

"నే అనుకోడం, కలకత్తా వెళ్ళివుంటాడని".

"ఎందుకు ?"

"అక్కడేదో శిల్పాల పోటీ ఏర్పాటు చేశారుట, తను చెక్కినవి అక్కడికి తీసుకెడతాడేమో. ప్రతిమని కర్రపెట్టెలో పెట్టడం చూశాను."

ఇంకేమీ అడగలేదు ఆ రోజు గడిచిపోయింది. జ్ఞానసుందరికి నిద్రపట్టలేదు. మధురంని దగ్గరగా లాక్కుని పరుంది. తన పోలి కెక్కడుంది ! మర్నాడు గడిచిపోయింది. చెల్లెలు కలకత్తాలో అన్నయ్యకి ముఖ్యప్రాణ్‌కి వ్రాసింది, అక్కడ కనిపించలేదని టెలిగ్రాం వచ్చింది. అన్నయ్యే వస్తున్నాడుట.

వచ్చాడు. సంగతులు తెలుసుకుని మళ్ళా కలకత్తా ప్రయాణము అయ్యాడు. నాలుగు రోజులు గడిచాయి మధుసూధనం జాడలేదు. చెల్లెలి ఆందోళన ఎక్కువవుతోంది రాత్రి తోటలో చెట్టుకింద కూర్చుంది. తనూ వెళ్ళింది. దీపం లేదు. చంద్రుడులేడు. చీకటిగా ఉంది. నక్షత్రాలు స్వచ్ఛముగా మెరుస్తున్నాయి.

"ఇంకేం జరిగింది ?"

ఏం జరుగుతుంది ? ఏమిటా ప్రశ్న ?

"ఏం జరుగుతుంది ? అసలు నాతో సరిగ్గా మాట్లాడండే. తిరగడం, రాళ్ళపోగు చెయ్యడం, చెక్కడం, గడ్డం పెంచేశాడు... స్వేచ్ఛగా.

స్వేచ్ఛగా అన్నందుకు పెదవి కొరుక్కుంది— నవ్వొస్తుంది. తనకి దిగులులేదేం ? చెల్లెలికి తన మాటలో నమ్మకం కుదిరినట్లు లేదు.

"కలకత్తా వెడతాను. చాలా రోజులైంది" అన్నది తాను. అల్లా ఎందుకంది ? అనకూడదు. కలకత్తాలో మధుసూధనం వుంటే ?

"నువ్వెడితే ఎట్లా— నేనేం కాను?"

"పోనీ వెళ్ళనులే."

రెండు రోజుల తర్వాత, ఉదయం ఎనిమిదింటికి బండిలో దిగాడు మధుసూధనం. మనిషి వాలకం వేరు. పాంట్, కోటు, కళ్ళజోడు—గడ్డం చేసుకున్నాడు. బండిలోంచి పెద్ద క్రరపెట్టి దించాడు బండివాడు. నాగ రాజ్యలక్ష్మి నవ్వుతూ ఆహ్వానించింది.

"క్షేమంగా వచ్చారా ?"

మధుర భక్తి, నాన్నని కౌగిలించుకుంది, ఏడుస్తోంది.

"ఏడుపెందుకే— వెర్రిపిల్ల".

స్నానం చేశాడు. టిఫిన్ తీసుకున్నాడు.

"ఎక్కడనుండి రావడం ?"

"ఆఫీసు కెడతాను. ఆ పెట్టెమాత్రం ఎవరూ తియ్యకండి.

"ఏం ?"

సమాధానం లేదు. అతను వెళ్ళాడు. అమ్మాయి స్కూలుకెళ్ళింది. మధ్యాహ్నం భోజనం చేసి, మళ్ళీ ఆఫీసు కెళ్ళాడు మధుసూదనం. అత డొచ్చాడు కనక, తనింక రాత్రి బండికి కలకత్తా వెడతానంది చెల్లెలితో. సాయంత్రం నాలుగింటి కొచ్చేశాడు మధు.

రెండు రోజులు కాంప్ వెళ్ళి రావాలిట— సామానులు సర్దుకుంటు న్నాడు. పత్రికొచ్చిందా అని అడిగాడు.

ఇంకా రాలేదన్నది చెల్లెలు

"ఈ పూటేగా వస్తే— అప్పుడే కాంపా !"

అతనేమి మాట్లాడలేదు. ఐదింటికి బయలుదేరి వెళ్ళాడు. తను మళ్ళీ

కలకత్తా ప్రయాణం విషయం ఎత్తింది చెల్లెలితో. అతను కాంప్ నుండి వచ్చిం తర్వాత వెళ్ళొచ్చునంది.

ఆ రాత్రి గడిచిపోయింది. మర్నాడు సాయంత్రం ఆ పెట్టెగురించి అడిగింది.

"పెట్టెలో ఏముందో— ఎందుకు తెరవ కూడదు ?" అన్నది నాగులు.

"నేనూహించగలను. అందులో రాతి విగ్రహం వుంటుంది. తీస్తే ఏమన్నా పగులుతుందని కాబోలు"

"అంత చూస్తేనే పగిలిపోతుందా- గాజుది కాదుగా"

"చూడొద్దంటే చూస్తాం గదూ—అందుకని మనం చూసేదీ లేనిదీ పరీక్ష చేద్దామని ఇల్లా అన్నాడు కాబోలు" అన్నది జ్ఞానసుందరి. తనిట్లా గనడం చెల్లెలికి నచ్చినట్లు లేదు. మొహం చిట్లించింది.

"వారి ఉద్దేశ్యాలన్నీ బాగానే పసిగడుతున్నావు" అంది చెల్లెలు.

తనకి కోపంవచ్చింది.

"అంటే ?"

"ఏకాంతంగా పరిశీలించి, మనస్సు ఎట్లా వుండేదీ వ్యాఖ్యానంచేసే అనుభవం..."

"ఏం మాటలవి నాగూ ?"

"మీరు గడపొచ్చు-నే అనకూడదు— పెళ్ళాన్నేగా !"

"ఊరుకో ఎట్లాగంటే ఇక్కడుండను ఈ పూటే వెళ్ళిపోతాను."

"నువెక్కడ కెడతావులే !"

ఆఁయ్ అని కసిరింది. ఎంత మాటంటె అంత మాట అనేస్తోంది. అక్కనేనా లేకుండా

"నే నిప్పుడే వెడతాను"

అని జ్ఞానసుందరి, దొడ్లో ఆరేసిన బట్టలు తీస్తోంది. తన పెట్టె మూత తీసి అందులో బట్టలు లుంగచుట్టి పడేస్తోంది. గడియారం నాలుగు గంటలు కొట్టింది.

"పెట్టెలో ఏముందో చూసి వెడుదువ్వగానిలే"

"నాకేం చూడాలనిలేదు. మీరు మీరు ఏమన్నాకండి"

పక్కచుట్ట సర్దుకుంటోంది.

"అందులో ఏముందో తెలుసు కాబట్టే, నీకు చూడాలని లేదు" అన్నది చెల్లెలు.

"అను, అను ఇష్ట మొచ్చినట్లు అను"

"ఇప్పు డేమన్నానూ !"

చర చరా గదిలో కొచ్చింది జ్ఞానసుందరి. అట్లకాడ పట్టుకొచ్చి పెట్టెకి చుట్టూకొట్టిన మేకులు పైకి లాగుతోంది. గబ గబ ఒక్కొక్కటె వూడ పెరుకుతోంది. మూల మరో రెండు వుండి పోయ్యాయి. బలంగా పైకి నొక్కిపెట్టి లాగుతోంది. పట్టుజారి మేకు వంకరోయి చేతివేలికి గుచ్చుకుంది. రక్తం వస్తోంది. బొట బొట. చెల్లెలు గుడ్డపేలికతెచ్చి కట్టు కడుతోంది. తను విదిలించేసింది. రక్తం బొట్లు చింది ఆమె మొహాన పడ్డాయి.

"ఇప్పుడు చూసుకో."

అని మూతలాగి గిరవాటేసింది. పెట్టె నిండా పాతగుడ్డలు, దూది రంపపొట్టు, చెత్త కాగితాలు పైన చుట్టూ కప్పి వున్నాయి. ఒక్కొక్కటే పైకి లాగుతోంది అన్నీ తీసేసింది. లోపల రాతివిగ్రహాన్ని పైకి లేవ దీసి మధ్య నున్న గుండ్రని బల్లమీద నుంచోబెట్టారు ఇద్దరూ కలిపి.

అది మూడున్నర అడుగుల ఎత్తైన రాతి శిల్పం. మోకాళ్ళ మీద కూర్చున్న పురుషుడు, వుంగరాలజుట్టుతల – మోకాలు, మోచెయ్యి వంక రలు తిరిగివున్నాయి. దీనంగా చూస్తున్నట్లు కళ్ళపైన దట్టంగా కనబడే కనుబొమ్మలు. ప్రక్కన ఒక స్త్రీ నిలబడివుండి. ఒక చెయ్యి. అతని మెడ మీద బిగించి వుంది, రెండోచెయ్యి పైకిలేచి వుంది. చేతిలో గరిటె లాంటిది—ఇనుముది—వుంది. ఆమె మెడలో నగలు లేవు— ఏ ఆభర ణమూ లేదు. గాజులు లేవు—నడుంకిచుట్టుకుని పరికిణీలా అంచులు, మడ తలు తీర్చినట్లుగా చిత్రితమైన స్త్రీ మూర్తి.

ప్రతిమ మొహంలో గాంభీర్యం. గర్వం వున్నాయి. మూతి బిగించి కాఠిన్యాన్ని సూచిస్తోంది.

పురుషుణ్ని బానిస చేసి, తానుపొందిన స్వేచ్ఛతో విర్రవీగు తున్నట్లు స్ఫురించే శిల్పం అది. ఇద్దరు పరీక్షగా చూశారు చెల్లెలు కళ్ళంట నీరు తిరుగుతోంది. ఆమె పెదవులు వొణుకుతున్నాయి. వేళ్ళు ఒణుకుతున్నాయి. అవి కదలకుండా. చేతులు బిగించి చీర కొంగులో దాచింది.

"నీ మొహమే."

అన్నది చెల్లెలు. తనకి భయమేసింది. అవునేమో అనిపిస్తోంది. ఆ శిల్పంలో ఒక లోపం తనకి స్ఫురించింది. పురుషుణ్ని బానిస చేసి స్వతంత్రం పొందిన స్త్రీ మూర్తిని చిత్రించడం వుద్దేశమైతే ఆమె మెడలో బోలెడన్ని ఆభరణాలుండాలి. సంపద సూచించాలి. ఇవి ఆ చిత్రంలో లేవు—— తనకీ ఆభరణాలు లేవు. అదొక పోలిక – తనకి ఆ రాత్రి నిద్ర మందిచ్చి. పక్కచుట్టమీద ఆనించి కూర్చోబెట్టి, దీపం మొహం ముందు వుంచి, ఆమె స్వరూపాన్ని రాత్రంతా చెక్కుతూ గడిపి వుంటాడు. లేక పోతె తన పోలికెట్లా వస్తుంది?

తనపోలికే వుందని ఎందు కనుకోవాలి? అది భ్రమ. తను ఆ శిల్పాన్ని ప్రేరేపించిం దనుకోవడంలో తృప్తి, అహంవున్నాయి. కాని చెల్లెలు కూడా అల్లాగే అంది. ఈ విషయంలో స్త్రీ ఎప్పుడూ పొరబడదు

"అవునా?"

"ఏమిటవును?"

"మూడు నిద్రలుచేసిన ఫలితం."

"ఛ, ఛ! ఎన్నిసార్లు చెప్పను? నీకు మతిపోయింది...అసలు ఏమీ — "ఏదీ...జరగందే..."

"ఆయనరాగానే వెళ్ళిపోతానని ఎందు కంటావు...?"

చరచర దొడ్లో కెళ్ళింది నాగులు. మళ్ళా ఒచ్చింది. చీర కొంగు లోంచి చెయ్యి బైటకి లాగింది. చేతిలో సుత్తితో, గబగబ శిల్పం మీద కొడుతోంది చెల్లెలు. తనడ్డుపడింది. వారించింది. సుత్తి రెండో చేతిలో తీసుకుంది, మళ్ళా స్త్రీ ప్రతిమమీద కొడుతోంది. గట్టిగా రెండు చేతులు పట్టుకుంది ఆమె విదిలించివేసింది. వెనక్కి తిరిగి మరో దెబ్బ కొట్టింది

"ఒద్దు ఒద్దు నన్నుకొట్టు — నా నెత్తి పగలగొట్టు, దాన్నొద్దు - నాగు—నాగు..."

మరో బలమైన వేటుతో మొత్తంగా బొమ్మకింద కూలింది. విరిగి ముక్కలైంది. స్త్రీమూర్తిచెయ్యి వూడింది. చేతిలో గరిట దూరంగా పడింది పురుషుడి తల పగిలింది. స్త్రీమూర్తినడుం విరిగింది. జ్ఞానసుందరి నడుం పైన రెండు చేతులూ బిగించి, కింద పడిపోయింది—నడుం విరిగినదానికి మల్లె.

హాల్లో అడుగులచప్పుడు. జోళ్ళు విడిచిన చప్పుడు.

"నాకు తెలుసు"

అని ఒక పురుషకంఠం. మధుసూదనంది. చెల్లెలు మూలగా మంచంమీద పడివుంది. మొహాన కొంగు కప్పుకుని ఏడుస్తోంది. అతను హాల్లో కెళ్ళాడు. మళ్ళా వచ్చాడు. పగిలిన ముక్కల్ని ఏరుతున్నాడు.

"ఇన్నిరోజు లుండడం విశేషమే." అంటున్నాడు. ఎవ్వరూ మాట్లాడరు.

"మీ అక్కయ్య పోలికను శిల్పంలో చిత్రించగల ప్రతిభాశాలి నయితే కళాప్రపంచం బ్రహ్మరథం పట్టును."

నౌకరు లాల్‌గిరి పత్రిక తెచ్చాడు. మధుసూదనం ఆత్రుతతో పుటలు తిప్పుతున్నాడు. చదువుతున్నాడు. పూర్తయింది.

"ఇదిగో పత్రికలో చూడు" అని చెల్లెలికి పత్రిక అందిచ్చి చదవవల్సిన భాగంవైపు వేలితో చూపుతున్నాడు. కొంగు కళ్ళ కిందికి లాగి,

వొణికిపోతున్న చేతులతో పత్రిక చూస్తోంది. పత్రిక చేతిలో వుండడం లేదు. అతను పట్టుకున్నాడు.

"చదువుకో."

చదివింది, తనూ లేచింది. దగ్గరగా వెళ్ళి మంచం ఒద్దిమీద కూర్చుంది. పత్రిక చూస్తోంది. ఆమెకేసి అతను దీక్షంగా చూస్తున్నాడు. చూపు తప్పించి చదివింది.

"వస్తువు ఉదాత్తమైంది కాకపోయినా, శిల్పంలో చూపిన నేర్పుకి మధుసూదనంగారి 'సేటి స్వేచ్ఛ' అనే కంచులో పోసిన శిల్పానికి వెండి పతకం లభించింది. ఫైనార్ట్ సొసైటీవారి బంగారు పతకం..."

నాగరాజ్యలక్ష్మి లేచింది. తనని గట్టిగా కౌగలించుకుంది. ఏడుస్తోంది.

"నన్ను...నన్నొదిలి వెళ్ళకు..."

మధుసూదనం నవ్వుతున్నాడు.

"ఇదెల్లానూ భగ్నమౌతుందని తెలిసే, ప్లాస్టర్ శిల్పం పూర్తిచేసి పూనాలో కంచులో పోతపోయించి కలకత్తా ప్రదర్శనకి పంపించాను. ఇంక ఇద్దరూ స్వేచ్ఛగా సాగించండి. నవ్వో ఏడుపో ?"

వెళ్ళాడు. నాగరాజ్యలక్ష్మి నవ్వుతోంది. లేచింది. అతని వెనకాలే వెళ్ళింది. బయట మధురభక్తి పాడుకుంటూ రావడం వినబడుతోంది.

మొహాన్ని రెండుచేతుల్లో దాచుకుంది జ్ఞానసుందరి. అది ఏడుపో నవ్వో తనకే తెలియదు.

# అరకులోయలో కూలిన శిఖరం

ఆ పచ్చటి పర్వతశిఖరాలు నీలి ఆకాశాన్ని మేలి ముసుగులా కప్పుకున్న తెల్లమేఘాన్ని అన్వేషించి, అందుకోలేక అలసి, క్రిందికి క్రుంగి లోయగా సాగాలి నగ్నంగా పవ్వళించిన ఏకాంతకన్యలు, విషాదములో జుట్టు విరబోసుకున్నట్లు చుట్టూ దట్టమైన అడవి... పెనవేసుకున్న ముంగురులులా వికృతమైన చెట్ల మ్రానులు, విరిగిన మొదళ్ళు, వర్షపు నీటికి చారలుతేరిన నల్లకొండరాతి బీటలు; ఆశకి భ్రమించి కళ్ళు తెరచినట్లు శిఖరాలమధ్య విడిన మబ్బునీడలు — వక్షాలమధ్య బాధతో జారిన కన్నీరు మాదిరి, వంకరలు తిరిగి అదృశ్యమయ్యే రోడ్డు, సగం ఎండిన పిల్లనదీ— తమ అందానికి సిగ్గుతో తలలువొంచి పాదాలకేసి చూసుకున్నట్లు, కిందికి యింకా కిందికి, యింకా యింకా కిందికి, అధోలోకంలోకి దిగజారి పోతున్న ఆ దృశ్యం, ఆ అనుభవం అరకులోయ.

సముద్రమట్టానికి రెండువేల అడుగుల ఎత్తున వున్న చల్లటి ప్రదేశము అరకులోయ. చుట్టూ పెద్ద కొండలు, అడివి, మధ్యగా ప్రవహించే పిల్లనది. సారవంతమైన నేల, సుందరమైన ఆ దృశ్యాలు విశాఖపట్నం నుండి మాచ్‌కండ్ జలవిద్యుత్ కేంద్రానికి వెళ్ళే యాత్రికులను ఆకర్షించాయి. ఇక్కడ వ్యవసాయం సాగించి, విద్యుత్ సహాయంతో ఒక మహా పట్టణాన్ని నిర్మించాలని పథకాలున్నాయి. మలేరియాని అరికట్టాలి; వసతులేర్పాటుచెయ్యాలి; కాలవలు తవ్వాలి; ఇక్కడ స్థిరపడిపోవడానికి సిద్ధపడ్డ వ్యక్తులు కావాలి; మాచ్‌కండ్ నుండి విద్యుత్ యీ లోయగుండా నడిపి, ఒక నాగరికత నెలకొల్పాలని ఎందరెందరో కలలుకంటున్నారు.

కాని కార్యానికి పూనుకున్నవారు లేరు; అది నిర్మానుష్యమైన అడవిప్రాంతం; కొద్దిమంది కొండజాతివారు అక్కడక్కడ కనబడి క్షణంలో మాయమవుతారు. సృష్టి ఆదిలో అల్లా వుండేదేమో ననిపిస్తుంది.

చెట్లు, మనుషులు, కొండలు, మేఘాలు, మృగాలు— అన్నింటికీ ఒకే చైతన్యం. నాగరికతలో మరణించి, చరిత్రగతంలో జనించడం లాంటిది అరకులోయ సహవాసం.

అందుచేత ప్రస్తుతం అందరి దృష్టి మాచ్‌కండ్‌పై మరలింది. మాచ్‌కండ్‌నది జలపాతం సహాయంతో పెద్ద జలవిద్యుత్ కేంద్రం నిర్మాణ మవుతోంది. అది పూర్తి అయింతర్వాత అరకులోయ వలస స్థాపన.

అది పూర్తిచేసే పనిమీద మాచ్‌కండ్ వెడుతున్న ఇంజనీర్ వర్మ పట్టాపొందన తర్వాత ఒకటి రెండేళ్ళు ఇంజనీరింగ్ కాలేజీలో లెక్చరర్‌గా పనిచేసి, స్కాలర్‌షిప్‌మీద మేన్‌చెష్టర్‌లో పైచదువు పూర్తిచేసి పెద్ద డిగ్రీ పొంది రాగానే, మాచ్‌కండ్ నిర్మాణశాఖ వారికి సలహాదారుగా నియమించారు. ఇదే అతను ప్రథమంగా మాచ్‌కండ్ రావడం. తను ముందుగా వెళ్ళి బంగళా అదీ ఏర్పాట్లు చేసింతర్వాత, సామాన్లు, సిబ్బందితో ఆ మరుసటిదినం అతనిభార్య రావడానికి ఏర్పాటు చేసుకొని ప్రయాణమై చక్కావొచ్చాడు.

స్టేషన్‌లో దిగగానే ఆశాభంగమైంది. మాచ్‌కండ్ అధికారులు తన కోసం పంపుతామన్న వాగన్ పంపలేదు. గుమాస్తా సోమయ్యని మాత్రం ఆహ్వానానికి స్టేషన్‌కి పంపారు.

సోమయ్య మాచ్‌కండ్ వుద్యోగైనా విశాఖపట్నం రవాణా బ్రాంచిలో పనిచేస్తున్నాడు. వాగన్ ఎందుకు రాలేదో అతనికి తెలీదు. దోవలో చెడిపోయిందేమో? వర్మగారి వుత్తరం వారికి సమయానికి చేర లేదేమో? తన పలుకుబడితో ఒక జీప్ సంపాదించాడు. ఉదయం ఆరుగంట లకి కొండ రోడ్‌మార్గాన, నూటముప్ఫైమైళ్ళ జీప్ ప్రయాణం సాగించారు.

వర్మ ఇంగ్లండులో పై చదువుపూర్తి చేసినవ్యక్తి అంటే నమ్మ డానికి వీలుగా కనబడతాడు. డబుల్ బ్రెస్ట్‌కోటు, టై, ఆకుపచ్చ కళ్ళజోడు సిగరెట్ టిన్, లెదర్ కేస్-యీవ్యక్తి పాపం! జీప్‌లో ప్రయాణం చెయ్యాల్సి వొచ్చింది. అనుకున్నాడు సోమయ్య వెనకసీట్లో సాధారణ పంచకట్టు,

ముతకచొక్కా, పైన కండువా, సోమయ్యవాలకంచూస్తే, చాలా అల్పుడయిన వుద్యోగిలా వున్నాడు. అతన్నేనా, ఆహ్వానానికి మాచ్‌కండ్ అధికార్లు పంపవల్సింది? వెళ్ళగానే అడగాలి. ఇంకా నయం. భార్య స్నేహలత తనతో వొచ్చిందికాదు ఇదంతా చూసి, ఏమనుకున్నో! నలుగురైదుగురు ఇంట్రోతులు, రెండుకార్లు, పెద్దపెద్ద వుద్యోగులు, రైలు దిగగానే సిద్ధంగా వుంటారని వర్మ వూహించుకున్నాడు. కాసేపు కోపగించుకున్నాడు— ప్రమాదకరమైన మళుపులు. జీప్ ముందు ప్రాణం కోసం పరుగెడుతున్న కుందేలు, వింజామరలు వీస్తున్న చెట్లకొమ్మలు, గార్డ్ ఆఫ్ ఆనర్ యిచ్చి సాల్యూట్ చేసి నిలిచిపోయిన రాతిబండలు— వీటిని గమనించనేలేదు వర్మ.

మళుపులో సూర్యకిరణం, కత్తిలా పొడిచింది. చెట్ల ఆకులనుంచి జారుతున్న మంచుకణాలు ఇంద్రధనుస్సులా విరిగి వెయ్యి కత్తుల వెలుగుతో బద్దకించిన చూపుని చీలుస్తున్నాయి. వర్మ కోపం దిగమింగున్నాడు. దేశానికి స్వాతంత్ర్యం వొచ్చింతర్వాత జరిగిన మార్పుకి అది చిహ్నం అనుకోకూడదు? వెనకటి, వొంగిసలాములు, జోహార్లు, బందోబస్తు, పటాటోపం తను ఆసించకూడదు. ప్రజలో నూతన వికాసం, వ్యక్తిత్వం స్వతంత్ర జిజ్ఞాస ప్రబలినాయి.

కొండ దిగుతున్నారు. కింద ఆకుపచ్చచీర కొంగువిప్పి పరున్న లోయ—పచ్చజోడులోంచి మరింత పచ్చగా కనబడుతోంది. ఎండకి కొండలు విరిగిపడినట్లు, అదృశ్యమౌతున్నాయి. ముందుకు పడిపోకుండా గట్టిగా పట్టుకున్నాడు గుప్పున చెమటవాసన వేసింది డ్రైవరు స్నానం చేసినట్లు లేదు. కోటు విప్పాడు, టై వొదులుచేశాడు. జీపు నిలిపి, సోమయ్యనిముందుకు పంపి, తను వెనకసీట్లో కూర్చున్నాడు. ఎనభైమైళ్ళ ప్రయాణంతో వర్మ అలసి పొయ్యాడు.

జీప్‌కూడా అలసిపోయింది. కదలడం లేదు. ఏదో చెడింది. డ్రైవర్ రిపేరింగ్ సాగించాడు, అరకులోయలో యాత్రికుల బంగళా

యింకా ఆరు మైళ్ళుంది. మాచ్‌కండ్‌నుంచి ఏదేనా వేగన్ రావచ్చు. మరో పాసింజర్ బస్ తగలొచ్చు. కాసేపు ఆ చెట్టుక్రింద విశ్రాంతి తీసుకుందాం అన్నాడు సోమయ్య.

వర్మ ఫ్లాస్క్‌లో టీ కాస్త పోసుకు త్రాగాడు. సిగరెట్ ముట్టించాడు. చల్లగా గాలి వీస్తున్నా అతని వళ్ళంతా వేడెక్కింది. చుట్టూ చూశాడు—అన్నీ గుట్టలు, పొదలు, పెనవేసుకున్న చెట్లు, ఆ రాళ్ళమధ్య కింద, దూరంగా కొలను. బైనాకులర్స్ తీశాడు. అవును నీరే. ఎక్కడిదో ? ఎక్కడి నుంచి పుడుతుందో ఎవ్వరికీ తెలీదు— ఆ విధముగా అక్కడక్కడ జలం వూరుతుంటుంది అదొక వింత అన్నాడు సోమయ్య. వర్మ కిందికి రాళ్ళల్లోకి దిగాడు. నీళ్ళు స్వచ్ఛంగా ఉన్నాయి. అడుగున యిసిక, నాచు కనిపిస్తున్నాయి. దోసిలితో తీసుకొని మొహం తుడుచుకున్నాడు. మళ్ళా ఆ పచ్చటి నీడలమధ్య జారుతున్న నీటిని చూశాడు. ఇంకా కింద, ఇరవై అడుగుల దిగువన, మరొక కొలను చుట్టూ రాతి బండలు, సూర్యరశ్మిని అల్లికపొద— నగ్నంగా స్నానం చేస్తున్న ఒక స్త్రీ బైనాకులర్స్‌లో కనిపించింది. తీక్షణంగా చూశాడు. నడుంకి కాస్తంత ఎర్రబట్ట ఉందేమో— బలంగా స్ఫుటంగా యవ్వనం తీరికగా తీర్చిదిద్దిన ఆమె అవయవాలు అతని అస్థిపంజరాన్ని కదిల్చాయి.

"ఆ నీళ్ళు మాత్రం త్రాగమోకండి" అని పైనుంచి సోమయ్య కేక వేశాడు. వర్మ ఎందుకో ఉలిక్కిపడి పైకి వచ్చేశాడు.

"నీళ్ళు మంచివి కావంటా రండి" అన్నాడు సోమయ్య. ఒక రాతిమీద దులుపుకొని, కారు సీటు తలకింద పెట్టుకుని వెన్ను వాల్చాడు వర్మ.

"ఈ ప్రాంతంలో మనుషులెవళ్ళూ ఉండరా?"

"ఉండకేమండి—కొండజాతివాళ్ళు మందులాళ్ళు. అక్కడక్కడ మసలుతూనే ఉంటారు. కొందరేమో మాచ్‌కండ్ పోయి కూలిచేసుకుంటారండి."

"ఇక్కడేపి ఇళ్ళు కనబడవేం ?"

"వాళ్ళకి యిళ్లెందుకండి— కొండ గుహల్లోనూ, చెట్లకిందా తిరుగుతూ ఉంటారండి" అన్నాడు సోమయ్య ఆవులింతని ఆపుకుంటూ.

"మరి భుక్తి ?"

"ఏదో పండించుకుంటారండి. వేటాడి మాంసం, తేనె తీయడం, మూలికలు అమ్మడం— అల్లాగే గడుపుకుంటారండి."

సోమయ్య ఆవులింతల్ని ఆపలేకపోతున్నాడు, తనూ జీప్‌లో కెళ్ళి కన్ను మూశాడు.

మళ్ళా బైనాక్యులర్స్‌తో కిందికి చూశాడు వర్మ. స్నానంచేస్తున్న స్త్రీ లేదు. నాలుగు మూలలా చూశాడు. ఎక్కడా కనబడ్లేదు. పాశ్చాత్య శిల్పకళలో తప్ప అతనెప్పుడూ అల్లాంటి శరీర సౌందర్యం చూడలేదు. మనవారి ఆచారాలు, బట్టకట్టు, అలవాట్లు, సహజ సౌందర్యాన్ని వికసించనీకుండా చేస్తాయని వర్మ వూహ. పాశ్చాత్య స్త్రీల శరీరాలు కొంత మెరుగు. పొదల మధ్య, కాళ్ళ నీళ్ళలో మరుగుపడి పూర్తిగా కనబడని అవయవాలతో యిందాక తను చూచిన స్త్రీ. వీనస్‌డిమైలో శిల్పంలాగ వుంది. ఛాయ మామూలు నలుపే, మొహం సర్గ్గా కనపడలేదు. కాని ఆ బలమైన అవయవాలు, స్థిరపడిన కండరములు, యుగయుగాల రాపిడికి కూడా చెదరని రాతిచెక్కడానికి మల్లే, దేనికీ లెక్కచెయ్యని ఆ రొమ్ములు— యిసుకలో తలదూర్చి, సృష్టిసౌందర్యం భరించలేక ఏడవాలనిపించే ఆ మూర్తి, వర్మని ఒక సహజమైన పురుషుణ్ణిగా మార్చింది. ఏవేవో వింత భావాలు, విపరీతమైన పులకరింపు, అతను స్పృశించలేని సత్యానికిమల్లె వూహలో బంధించబడాల్సిందే !

సోమయ్య, డ్రైవరు అటుపోతున్న ఎడ్లబండిని నిలిపి, దానికి జీప్‌ని కట్టి, మళ్ళీ ప్రయాణం సాగించారు. బంగళాకి చూరుకునేప్పటికి ఒంటి గంటైంది. వారి కోసం మాచ్‌కండ్‌లో బైలుదేరిన వేగను అక్కడ నిలిచింది. ఇద్దరు వ్యక్తులు మందహాసం చేశారు. ఒకాయన ముందుకొచ్చి

నమస్కారం చేసి, ఒక చీటి యిచ్చాడు వర్మకి రెండో వ్యక్తి దూరంగా నిలబడే తలపంకించాడు అతడు నమస్కారం చెయ్యనందుకు వర్మ విసుక్కున్నాడు. చీటీ చదువుతున్నాడు. వేగను ఎందుకు సకాలానికి పంపలేక పొయ్యారో తెలిపి మాచ్‌కండ్ బంగళా మొన్నాడు కాని ఖాళీ అవదు గనక అంత వరకూ అరకులోయ బంగళాలో వుండవల్సిందని అధికారులు కోరుతూ వ్రాసి పంపిన ఉత్తరం అది. వర్మకి పూర్తిగా కోపమొచ్చేసింది. కాని ఎవరి మీద ఎల్లా ప్రకటించాలో అతనికింకా తెలీడం లేదు.

"నాకు మీ వేగను అక్కర్లేదు—రేపు ఉదయం స్టేషనుకెళ్ళి సరిగ్గా పదింటికి అమ్మగార్ని సామానులు తీసుకురండి— మీతో సోమయ్య కూడా వస్తాడు. ఇక్కడేమున్నా భోజనం దొరుకుతుందా ?" అన్నాడు వర్మ.

"కారియర్ తెచ్చామండి" అన్నాడు చీటితెచ్చిన వ్యక్తి తమ్మయ్య.

సామానులు, వర్మ బంగళాలో ప్రవేశించాడు. దూరంగా వ్యవసాయ శాఖ వారి ఒకటి రెండు యిళ్ళు, టీ దుకాణం తప్ప మనిషి అలజడిలేదు. కోటు, జోళ్ళు విప్పి, వర్మ భోజనానికని బల్ల దగ్గర కొచ్చాడు. విప్పి, అన్నీ సిద్దంచేసి వుంచారు. కాని కారియర్‌లో అన్నం మాత్రం లేదు. వర్మ ఒళ్ళు మండిపోయింది. ఏమిటిదని గర్జించాడు.

"కోతులు ఎత్తుకెళ్ళినాయి బాబోసండి" అన్నాడు తమ్మయ్య చేతులు నలుపుకుంటూ.

"మీ ఏర్పాట్లు బాగున్నై. మాచ్‌కండ్‌లో పనులుసాగడం లేదంటే ఆశ్చర్యమేముంది ! మీ బోటిగాళ్ళందరూ వూనుకున్నప్పుడు. ఆ వెటకారానికి దూరంగా గేటు దగ్గర నిలబడ్డ వ్యక్తి నవ్వాడు. అక్కడక్కడ చిరిగిన లాల్చీ, నాలుగు రోజులు కత్తి తగలని గడ్డం, ఖద్దరు పైజామా, చేతిలో రెండడుగుల పొడవుగల టెలిస్కోప్, దీనంగా నిశ్చలంగా చూసే కళ్ళు— అదీ అతని ఆకారం. నవ్వుకుంటూ వెళ్ళాడు ఆ వ్యక్తి. వర్మ టీ కోసం ప్లాస్కు బోర్లించాడు. బుట్టలో వున్న బ్రెడ్ తీసి

కొని, కొయ్యకుండానే తినడము సాగించాడు. మాసిన గడ్డం వ్యక్తి అర గంటలో ఓ కుర్రాడి నెత్తిన అరటి పళ్ళు, ఒక సోడాకాయలో నీళ్ళు, మరొక సోడాకాయలో టీ పెట్టించి తీసుకొచ్చాడు. ఇవన్నీ వర్మకి అంద జెయ్యమని తమ్మయ్యతో చెప్పి వెళ్ళిపోయాడు.

అందరూ తలోవైపుకూ వెళ్ళారు. సోడా కుర్రాడు గంగడు తప్ప. వాడు మండువాలో పడుకున్నాడు వర్మ పడుకొని లేచేటప్పటికి మూడు గంటలు దాటింది. గంగణ్ని లేపి నీళ్ళు తీసుకు రమ్మన్నాడు. మొహం కడుక్కొని కొత్త బట్టలు వేసుకుని గంగణ్ని వెనకాలసీటులో కూర్చోమని వర్మ జీప్ నడపడం సాగించాడు. టీ దుకాణంలో యిద్దరూ టీ త్రాగి ప్రయాణం సాగించారు.

"మాచ్‌కండ్ అటుగా దండి ఇటంకి. అది మీరిందాకా వొచ్చిందే నండి" అన్నాడు గంగడు.

"నాకు తెలుసులేరా"

నీ రుబికిన రాతిబండల దగ్గర కొచ్చారు పావుగంటలో.

జీపు ఆపుచేసి, వర్మ వాళ్ళ మధ్య నీళ్ళలోకి దిగి చూశాడు. ఎవ్వరూ లేరు. కొండ పైకి చూశాడు. ఒక కొమ్మను ఆనుకుని గడ్డం పెరిగి లాల్చి వేసుకున్న వ్యక్తి టెలిస్కోప్‌లోంచి చూస్తున్న దృశ్యం కనబడింది. బైనాక్యులర్స్ లోంచి జాగ్రత్తగా చూశాడు. ఆ వ్యక్తికి గడ్డం లేదు. క్షౌరం చేసుకున్నాడు కాబోలు! అతనే సందేహం లేదు. తనొచ్చిన పనిమీదనే అతనూ వచ్చాడా? అతనెవరు?

రోడ్డుమీద కొచ్చాడు వర్మ.

"అదుగో ఆ రాయి మీద కూర్చున్న మని షెవర్రా?" అనడి గాడు గంగణ్ని.

"ఆరు సచ్చితానందంగారండి— మేస్త్రీ కాబోలు; ఇక్కడే తిరుగు తూంటారండి, గొట్టంలోంచి చూస్తూ అడుగో తమ్మయ్య, ఆయనకి తెలుసుద్దండి" అని వారికేసి వస్తున్న వ్యక్తిని చూపించాడు. ఆ వచ్చిన

వ్యక్తి తనకు చీటి తెచ్చిన తమ్మయ్య. అతనొక మేస్త్రీ. నమస్కారం పెట్టాడు.

"మీకేమన్నా పండ్లు తెద్దామని బయలుదేరానండి ఇక్కడ మంచి సపోటా లున్నాయి, అనాస కూడా ఉందంటారండి" అని స్వగతంగా చెబుతున్నాడు.

"మిమ్మల్ని కుటుంబం సామానుతో గనక వస్తే యిక్కడ బంగళాలో యీ రాత్రి గడిపి, రేపు మాచ్‌కండ్ రమ్మన్నారండి—మీరొక్కరే గనకైతే యీ పూటే రమ్మన్నారండి, ఎక్కడో అక్కడ సర్దుకోవచ్చునని. వెడదామాండి."

"ఈ పూట ఇక్కడే ఉంటాను. రేపు అమ్మగారొచ్చాం తర్వాత అందరం కలిసే వెడదాం" అన్నాడు వర్మ. జీప్‌లో ఎక్కమని సంజ్ఞ చేశాడు. తమ్మయ్య ఎక్కాడు లోయలో బంగళాకేసి పోతున్నారు.

"నీతో యిందాక వచ్చిన మరో వ్యక్తి ఎవరు ?" అని అడిగాడు.

"సచ్చితానందమని మా గొప్ప తెలివైన మనిషండి. డిగ్రీ చదువు లేదంట, పై పన్లు చూస్తూ మేస్త్రీగానే బలపుట్‌డామ్‌కాడ వుంచారండి. మాఫ్‌లు గీస్తాడు, సర్వే చేస్తాడు ఏదో కొత్త కొత్తవి కనుక్కొని, బలే చురుకుగా పని సాగిస్తాడండి అక్కడ యింజనీర్లందరూ యీయన చేతే పనులు చేయించుకుంటారండి..."

"అది సరే– డిగ్రీ ఎందుకు లేదు ?"

"నాకు బాగా తెలవదండి. కాలేజీలో కొంతకాలం చదివాడంట. మరి, ఏం తిరకాసొచ్చిందో పరీక్ష కెడతానికి లేకుండా కాలేజీలోంచి పంపించి వేశారుటండి..." అన్నాడు తమ్మయ్య. ఈ మాట వినగానే, వర్మకి యింతవరకూ బాధిస్తున్న సందేహం తీరింది. సచ్చిదానందాన్ని కాలేజీలోంచి పంపించిన సంవత్సరమే అతను అక్కడ లెక్చరర్‌గా చేరాడు. వివరాలు జ్ఞాపకంలేవు. సచ్చిదానందం లేబరేటరీలోంచి రెండు

వేలు ఖరీదయిన టెలిస్కోపుని తీసికుని, పోయిందన్నాడన్న ఫిర్యాదు చేసి డబ్బు కట్టమన్నారు. అధికారులు నేరమూ వప్పుకోలేదు. డబ్బూ కట్టలేదు అందుచేత ఆతన్ని కాలేజీలోంచి పంపించివేశారు. తరవాత ఏమయ్యాడో ఎవరికీ తెలీదు అతనికి తల్లిదండ్రులు లేరు. మేనమామ అతని వయసం అడుగుతూ, ఎక్కడేనా కనిపిస్తాడేమో అని వెదుకుతూండేవాడు. ఇంట్లోంచి పరారీ అయి యీ అడవిలో అవతరించాడన్న మాట! ఆనాడు దొంగిలించిన టెలిస్కోపు అదే కాబోలు! ఈ విషయాలన్నీ తెలిస్తే అతని మేస్త్రీ ఉద్యోగం ఉంటుందా? కాని దాచకుండా అందరిలోనూ చెప్పేశాడు. చిత్రం! నేరస్థుడి గర్వం, అహంభావం అట్లాంటివి కాబోలు! తనని గుర్తుపట్టాడా? తల పంకించాడు కాని, నమస్కారం చెయ్యలేదు.

ఎంత అహం?

బంగళా దగ్గరకొచ్చాడు నాయుడు గైంది. సూర్యుడు దూరాన కొండ కిందికి దిగుతున్నాడు.

"ఇక్కడేం చేస్తున్నాడింతకీ?" అనడిగాడు వర్మ.

"అతను చేసేది ఒక రకం పనిగాదండి. అట్లా సైకిలు మీద తిరిగి ఏవో పరిశోధన చేస్తుంటాడండి. ఇసిక, రాళ్ళు, చెట్లు తవ్వడం, కొలవడం— ఏదో ఒకటి. ప్రస్తుతం వొంతెన పిచ్చిలో పడ్డాడండి" అన్నాడు తమ్మయ్య.

"అంటే?"

'అటుకేసి అయిదారుమైళ్ళు వెడితే అతను కడుతున్న వొంతెన కనిపిస్తుంది అక్కడ ఒక చిన్న నది వుందండి—పెద్ద కాలవ అనుకోండి. వర్షాలుపడితే బాగా నీరుంటుందండి. లేకపోతే లేదు. కొండల్లోంచి జలపాతాలుగా పడుకుంటూ, తిరుక్కుంటూ ప్రవహిస్తుందండి. ఆ నది వారిస్నావారికి సరిహద్దండి. అక్కడ వొంతెన పడేస్తే, అటుజనం యిటు, యిటు జనం అటు సుళువుగా వెళ్ళి, రాకపోకలు బలిసి, ఐకమత్యంగా

కూలిజనం ఎగబడతా రంటాడండి. ఈ ఒంటిన విషయం ఎవళ్ళకి పట్టదండి. తనే స్వయంగా వేస్తానని, చుట్టుపక్కల కొండజనాన్ని పోగుచేసి పెద్ద చెట్లు కొట్టించి, ఒంటిస మొదలు పెటాడండి...'

'పదండి చూద్దాం' అన్నాడు వర్మ. జీప్ ముందుకి సడుపుతూ. ఐదారుమైళ్ళ తర్వాత నది కనిపించింది. ఒంటిన యింకా ఎగువున గుట్టలు వెనక వుంది. అక్కడికి జీప్ వెళ్ళడు. నడిచి వెళ్ళాల్సిందే. మూడు పర్లాంగులు నడిచాడు. వర్మకి ఆయాసంగా వుంది ఆకలేస్తోంది; దిగువున నది కనిపిస్తోంది; కాసేపు విశ్రాంతి తీసుకుందామని కూర్చున్నాడు. రాత్రి భోజనం ఏర్పాటు చెయ్యడానికి తమ్మయ్య వెడతానని సెలవు తీసుకు వెళ్ళాడు. గంగణ్ణి, వెనక్కి బంగళా దగ్గర దుకాణానికెళ్ళి, టీ తీసుకు రమ్మని పంపించాడు.

వర్మ మరో పదడుగులు దిగింతర్వాత వంగి చూస్తే, నీళ్ళల్లో ఒక స్త్రీ స్నానం చేస్తున్న దృశ్యం చూశాడు. బైనాక్యులర్ లోంచి చూశాడు. తాను మధ్యాహ్నం చూసిన స్త్రీయే. దగ్గరగా వుండడం మూలాన బాగా స్పుటంగా కనిపిస్తోంది. నడుంలోతు నీళ్ళ—కాసేపు యీది, మళ్లా రాతి బండమీద కూర్చుంటోంది. చేతులకి ఎర్రగాజులు తప్ప, శరీరం మీద ఏ వస్తువూ లేదు. కిందికి దిగాడు. వొడ్డుకి చేరుకున్నాడు. ఆమె వెనుకభాగం కనిపించింది. నడుంకి ఎర్ర లంగా బిగించి వుంది. ఇంకేమీ లేదు. లండన్ ఆర్టుగేలరీలో చూసిన పోతవిగ్రహాలు స్మరణ కొచ్చాయి. వయస్సు పాతికేళ్ళ లోపు, పరిపూర్ణంగా వికాసం పొందిన యౌవనం, నిర్మలమైన చర్మం, ఆ వంపులు; వయ్యారం, హుందాతనం అతన్ని ముగ్ధుణ్ణి చేశాయి. అదొక రాతివిగ్రహం అవుతే, ఆ పదంపై తలపగల కొట్టుకోవాలనిపిస్తుంది. వెనక్కి తిరిగింది. భయంతో పదేపదే కళ్ళు చిట్లించింది. మూసుకున్నా తెరుచుకున్నట్టు కనబడే పెద్దకళ్ళు, సృష్టి స్పృశించని యౌవనం కళ్ళల్లో, పళ్ళవరసలో మెరుస్తోంది. గోధుమరంగు జుట్టు ...ళ్లా! నుదుటిని బిగించి

చిక్కుపడి గుబురుగా లేచింది. రెండు చేతులతో రొమ్ము కప్పుకుని బండ మీద కూర్చుంది.

వర్మ మాట్లాడాడు ఆ అమ్మాయికి అర్థం కాలేదు. పేరడిగాడు. లోతుందా? అడ.గున బురదా, యిసికా? చలేస్తోందా? సమాధానం లేదు. నవ్వుతోంది. ఏవో ధ్వనులు చేస్తోంది. చేతులు తిప్పుతోంది. నిండైన వక్షం, బలంతో పైకి నిట్టూర్చినప్పుడల్లా, లేచి పడుతోంది—చందమామ కోసం లేచిన సముద్రంలో కెరటానికి మల్లె. రెండుకొండలమధ్య లోయ లాంటిది. అక్కడ నుదుటిని ఆనించి కన్నుమూస్తే, శాంతి దొరుకుతుంది.

తెలుగు, ఇంగ్లీషు, హిందీ-అన్నీ యత్నించాడు. అర్థం కాలేదు. తను నీళ్ళల్లోకి వెళ్ళి ఆతన్ని రమ్మని సంజ్ఞ చేసింది. అతను ఆమె కేసి తీక్షణంగా చూడలేకపోతున్నాడు. ఏ అవయవం చూడడం? నడుమా, మెడా, జుట్టా, అలలుగా చెదిరిన నీళ్ళల్లోంచి ప్రతిబింబించి కనబడీ కనబడనివక్షమా? నీటిలో సూర్యకాంతి మొహాన్ని వెలిగించి, కళ్ళన్నీ కలవర పెట్టిన నగ్న నీడనా? పెదవులు దగ్గరగా మూసుకున్నప్పుడు చెక్కిలిమీద మిగిలిపోయి, కళ్ళలో దాక్కుని రహస్యంగా పిలుస్తున్న చిరునవ్వునా?

రమ్మంటోంది. ఆధైర్యానికి వర్మ చకితుడయ్యాడు. అతనికీతరాదు నీళ్ళంటే భయం. అయినా, స్నానం చెయ్యాలనుంది. చొక్కా తీశాడు. బనీనుంది. తువ్వాలు లంగోటీలా కట్టి నీళ్ళలోకి దిగాడు. వేలుతో చూపించి నీ పేరేమిటన్నాడు. మూనా అంది మోనాయో, మూనాయో, మున్నాయో అతనికి తెలవలేదు. 'ము' 'న' రెండక్షరాలుగల ధ్వని ఆ పేరు. లినార్డో దవిన్సీ గీసిన మోనాలీసా చిత్రపటం జ్ఞాపకాని కొచ్చింది. ఆ పటం, పారిస్‌లూవరీలో వుంది. అది 1504 లో గీయబడింది. ఆ పటాన్ని 'ఫ్రాన్సిస్కోడి గాయో 'కొండ' భార్య లీసా'ను చూసి వ్రాశాడు. వర్మ ఆ చిత్రం నకలుని ఇంగ్లండులో కొన్నాడు. ఈ దృశ్యం అట్లాంటిదే: వెనకాల రాళ్ళ కొండలు—యుగయుగాలుగా నిలిచిన కొండల—

ప్రాచీన బలం. స్థిరత్వం ఆమె శరీరానికి అమరత్వాన్ని అపాదించినట్లు- ఆమె ప్రకృతిలో ఒక సజీవ భాగం. చలనంలేని ఆ సౌందర్యాన్ని మనిషి దూరంగా ఆరాధించగలడుగాని తాకలేడు. స్వచ్ఛమైన కళతో పరిచయం పెరిగినకొద్దీ: యథార్థ సంఘటన కళారూపాన్ని పొంది, స్వప్నంలాగ, స్పృశించలేని దప్పుతుంది. కలసి కెలికితే, కోటి తుంపరలుగా కదలి కృశించి, కుంగి, వార్ధక్యంలో, మృత్యువులో మిశితమయి, మరి కనబడదు. కాని శరీరం వున్నంతసేపూ తాకక తప్పదు. జీవితరంగంలో ఈ పెనుగు లాట తథ్యం యథార్థ సౌందర్యాన్ని చూసి కలగంటాడా ? కలలో చూసిన సౌందర్యాన్ని యథార్థ జీవితంలో చూసి తనది చేసుకుంటాడా? జీవితంపై ప్రభావంలేని కళకి ప్రయోజనం లేదు ఆమె చెయ్యి పట్టుకుని రెండ డుగులు వేశాడు ఆమె దూరంగా లోపుకి వెళ్ళింది. సంధ్యలో వెలిగిన నీళ్ళకాంతి, వపంమీద పడి, మృదువయిన చర్మంవెనుక రక్తాన్ని వెలిగిం చింది. అతను ముందుకు పడిపొయ్యాడు. చేతులు ఆమె మెడచుట్టూ పడ్డాయి. ముందుకు తోసేసింది. వెనక్కు పడ్డాడు. బండమీద కూర్చున్నాడు- ఆమెకేసి చూస్తూ. వెనక్కి తిరిగింది. వేళ్ళతో నీళ్ళు చిమ్ముతోంది. వొంగిన చెట్ల చిటారుకొమ్మల ఆకులు సంధ్యవెలుగులో ఎర్రగా మండుతూ, నీళ్ళల్లోపడ్డ నీడలు పచ్చగా, ఎర్రగా ఆమె శరీరాన్ని వెలిగిస్తున్నాయి. అదిమరపురాని సౌందర్యానుభవం. సంధ్యని, వెన్నెలని, కొండ శిఖరాన్ని చూసి ఆనందించినట్లు, చూసి పొందిన ఆనందంతో తృప్తి పడకూడదు ? సౌందర్యం మానవుణ్ణి యోగిగా చేస్తుంది. కాని తనలో మానవత్వమే, మళ్ళా మనిషిగా మార్చి వేస్తుంది. ఏదో శక్తి, స్వప్నంలో మెదిలిన కోరిక శరీరంలో ప్రజ్వరిల్లి అతన్ని ప్రాచీన ప్రాణిగా ముందుకు నెట్టి, తపస్సునుండి కార్యానికి రగిల్చింది. కార్యం తపస్సు నాశనహేతువు, యౌవనం నశింపుకి, ప్రాణి చావుకి ఈ ప్రాకు లాట, ఈ వుబలాటం, తనదిగా వుంచుకోవాలన్న ఈ వాంఛ కారణాలు కాబోలు! అనుకుంటూ ఆయాసం తీర్చుకుంటున్నాడు.

వర్మ నిలబడ లేక పోతున్నాడు, నీళ్ళల్లో కూర్చుని ఆమె వాళ్ళో పడిపొయ్యాడు చలిలో. అడవి కాలినట్లు, కొండ బ్రద్దలై నిప్పు వ్యాపిం నట్లు ఆమె శరీరం అతని చేతుల్లో, బుగ్గలమీద కాలింది. శరీరం కరి నట్లు, ముద్దగా కాలినట్లు నరాలు దోవతెలీని రక్తంలో తన్నుకులాడతున్నాయి. గడ్డం కింద చెయ్యిపెట్టి ఒక్కతోపుతోసి ఒడ్డుకి వెళ్ళింది మూనా పొద వెనక వుంచిన తెల్లగుడ్డ తెచ్చి, ముహం తుడుచుకుని కప్పుకుంది. తడికి రొమ్ముల మీద వస్త్రం బిగిసింది. కూర్చుని లంగా నీళ్ళు పిండుతోంది. ఆతనూ వచ్చేశాడు. బనీను ఆరబెట్టుకుంటున్నాడు. ఒక్కసారి ఆకాశం నల్లమేఘాలతో చీకటైంది. చివరి సూర్యకిరణాలు విరిగిన కత్తులలా మేఘాల వెనక అదృశ్యమయినాయి. దట్టంగా నలుపుని పూరించుకుంటూ, శిఖరాల్ని తన్నుకుంటూ, మేఘాలు విజృంభించి ఆకసమంతా వ్యాపిస్తున్నాయి.

మేఘాలకేసి చూపించింది మూనా. ఇద్దరూ చరచరా నడిచి పోతున్నారు. వెనక మేఘాలు, సుడిగాలి. వూడిన ఆకులు, విరిగిన కొమ్మలు, తాకిడికి జారుతున్న పిల్లరాళ్ళ ప్రవాహం, అడివి కీటకాల కోలాహలం, మూనా శరీరంలోని వింతవాసన సుడిగుండంలా అతన్ని ముంచి వేస్తున్నాయి. నడవలేక పోతున్నాడు. ఆతని చెయ్యి పుచ్చుకుని, పైకి లాక్కుపోతోంది. మూడు పెద్దరాళ్ళమధ్య ఒక గుహలోకి చేరుకున్నారు. వర్మ ఆయాసం తీర్చుకుంటున్నాడు. కిందకి చూశాడు. నదీ ప్రవాహం కనబడింది. కాళ్ళు తేలిపోతున్నాయి. అతనికి భయం సాక్షాత్కరించినట్లుగా వుంది, పాపం చేసినవాళ్ళు ఎత్తునుండి క్రిందకి చూడలేరని ఏదో మానసిక శాస్త్ర పుస్తకంలో చదివాడు. కిందకి చూడలేని భయం అతన్ని అల్పుణ్ణి చేసింది. గాలికి పడిపోకుండా ఉండేందుకన్నట్లు ఆమె మెడ గట్టిగా పట్టుకున్నాడు. అతని నెత్తిమీద వున్న తేనెపట్టులో వేళ్ళు పెట్టింది మూనా. కంతలలో కెలికి రాణి ఈగను లాగింది. మిగతా తేనెటీగలన్నీ జొయ్యిమంటూ సుడిగాలిలా బయటపడి అతన్ని ఆవరించి, కవ్వించి కుట్టే

సున్నాయి. వర్మ పరుగులు సాగించాడు. అతన్ని పొగాలా చుట్టాయి తేనెటీగలు. మూనా నవ్వుతూ వెనకాల వస్తోంది అతని జేబులోంచి అగ్గిపెట్టె తీసింది చిదుగులతో మంట చేసింది. పొగని తన నోట్లోకి తీసుకుని వాటిమీద వూదింది. వేళ్ళల్లోపట్టిన రాణి ఈగను వాటిముందు ప్రదర్శించింది దూరంగా తీసుకెళ్ళకంతలో రాణి ఈగను దాచింది, మిగతా ఈగలన్నీ వర్మని విడిచి, క్రీదానిచుట్టూ కంతల్లోకి పోయాయి.

మూనా తొందరగా నడవమని సంజ్ఞ చేసింది. ఏదో.. పాట మొద లెట్టింది. ఆ పాట వికృతంగా, భయంకరంగా వినిపించింది. ప్రకృతిలో ప్రాణి చనిపోయినప్పుడు, ప్రకృతంతా ఏడ్చినట్లు ధ్వనించింది జీపు కన బడటంలేదు. అతనికి దోవ తెలీడంలేదు. ఏదో తోవని ఎక్కడికో అడవి లోకి వచ్చేశారు. అన్నీ పెద్దపెద్ద రాళ్ళు, జుట్టు విరబోసుకుని, దయ్యా లకిమల్లే నల్లమానుచెట్టు గాలిలో దగ్గరగా జరిగి భేతాళ నృత్యం సాగించాయి. ఆకాశంలో పిడుగులు ప్రతిధ్వనిస్తున్నాయి. రాళ్ళు బ్రద్ద లయినట్లు, శిఖరాలు కూలినట్లు మెరుపులు ఒక్కసారిగా దట్టమైన చీకటిని చీలుస్తున్నాయి. ప్రకృతి గాయపడి, రక్తం కాలవలుగా ప్రవహిస్తున్నట్లు- మెరుపులు, వురుములు వాళ్ళని తరుముతున్నాయి. ఇంక అతను నడవ లేడు. మరో గుహ. మరో మెరుపు ఉరుము-అక్కడే వాలిపోయ్యాడు, ఆమె భుజంమీద తెల్లగుడ్డ తీసి అతని తలని కప్పింది.

క్షణంలో వర్షం ప్రారంభమైంది. రాతిబండల మధ్య వాళ్ళున్న స్థలం కాస్తంత పొడిగా వుంది బీటలలోంచి వర్షం ధారలా పడుతోంది- దిక్కు తెలీకుండా ఆకాశంలో నిర్మాణమైన ముళ్ళ కర్మాగారంలోంచి పడినట్లు నలుదిక్కులా దుమ్ము్యబడుతోంది. అతని తువ్వాలు, ఆమె పైబట్ట రెండు వైపులా బీటలలో బిగించి కట్టింది. అతని చేతులు, కాళ్ళు అరచేతు లతో వేడికోసం రాస్తోంది. వర్షం లోపలికొచ్చి పడుతోంది. ఆమె మూలకి జరుగుతోంది. అతను ఆమెకేసి జరుగుతున్నాడు. అతని తల ఆమె

వొడిలో పడి, చేతులతో ఆమె మెడని పెనవేసు ఏని దగ్గరగా వేడిని కాంక్షిస్తూ, యింకా దగ్గరగా వస్తున్నాడు. ఆమె మోకాళ్ళమీద కూర్చుని గోడని ఆనింది. అతను గోడకు అదిమి, పైకి ఎగబాకుతున్నాడు. వేళ్ళు ఆమె పెదవులను వెదుకుతున్నాయి ఒక చెయ్యి అతని గొంతుపైని వేసి, రెండో చేతితో గోడని అనుకొని ఒక్కసారి పైకిలేచి నిలబడింది మూనా. అతని తల తటాలున కింద రాతిమీద పడింది. 'అమ్మో' అన్నాడు. చిన్న గాయం తగిలింది, రక్తం చుక్కగా కారి వర్షం నీటిని ఎర్రగా మార్చింది.

వర్షం నిలిచింది. అతని తలకింద గుడ్డలు పెట్టింది. గాయాన్ని కడిగింది. లేచి బయటకు వెళ్ళింది. పది నిమిషాల్లో వర్మ బయటకు వచ్చాడు. గాయం తడిమి చూసుకున్నాడు. అంతా కారుచీకటి జేబులో అగ్గిపెట్టె తడిసి వెలగడంలేదు. సిగరెట్ కాల్చాలని వుంది—అవి తడిసి విడిపొయ్యాయి. దోవ తెలీడంలేదు. ఎటో పోతున్నాడు మూనా ఏవో కేకలు వేసుకుంటూ వచ్చింది. చెయ్యి పట్టుకుని నడిపించుకుంటూ తీసు కెళుతోంది అక్కడంతా చదునుగా వుంది ఒక బండ మీద కూర్చుని, అతని తల తొడమీద ఆనించి, తెచ్చిన ఆకులు పిండి రసం గాయానికి రాసి, ఆకులు పైనవుంచి గుడ్డ చించి కట్టుకట్టింది.

జీపు నిలిచినచోటు దగ్గరలోనే వుంది. గంగడు కేకలేసుకుంటూ వచ్చాడు. ఇద్దరూ అతన్ని జీపులోకి జేరవేశారు. అతను డ్రైవ్ చేసే స్థితిలో లేడు. గంగడు తడిసి, చలికి వొణికిపోతున్నాడు. మూనా పావు గంటలో ముగ్గురు మనుషుల్ని తీసుకొచ్చింది వారు జీపు లాగుతూ, తోసు కుంటూ వెడుతున్నారు. ఆమె తన గుడిసెకి వెళ్ళింది.

జీపు బంగళా చేరేప్పటికి రాత్రి పదకొండయింది. వర్మ అలాగే మంచంమీద వాలిపొయ్యాడు. గంగడు కాళ్ళూ, అవీ పడుతూ సపర్యలు చేస్తున్నాడు. వర్మ కళ్ళు తెరిచి, లేచి కూర్చున్నాడు. బాగ్‌లోంచి సిగరెట్ పాకెట్ విప్పాడు. సోమయ్య, తమ్మయ్య వాగన్‌లో విశాఖపట్నం

వెళ్ళిపొయ్యారుట పెళ్ళేముందు భోజనం, వడ్డనసామగ్రి అన్నీ సిద్ధంచేసి వెళ్ళారు.

వర్మ ఆకలి తీర్చుకున్నాడు.

'ఎవర్రా ఆ పిల ?' అని అడిగాడు గంగణ్ణి. నిద్రమత్తులో ఉలిక్కిపడి లేచి కళ్ళు నులుముకున్నాడు గంగడు.

"నువ్వెరుగుదువా?" అని మళ్ళీ ప్రశ్నించాడు.

"ఎరక్కేమండి—కొండజాతోళ్ళ. తండ్రి లేడు. అవ్వుంది గుడిసి కాడ. తనేమో ఇన్నాళ్ళూ తేనెతీసి అమ్ముతుండేది."

"ఇన్నాళ్ళూ అంటె ?"

'ఇప్పు డింక సచ్చిదానందంగా రున్నారండి.' అని మెల్లగా అన్నాడు.

'ఉండటం అంటే?'

'ఆయన ఆమె ఎప్పుడూ తిరుగుతుంటారండి – నెలకు పది రోజుల మకాం ఆమె గుడిసెలోనే.'

'వాళ్ళ భాషేమిటి?'

'ఒరియా కాబోలునండి, కొండజాతోళ్ళ భాష మన కర్థం కాదండి.'

'మరి సచ్చిదానందాని కర్థమవుతుందా?

'ఏమో నండి.'

వర్మ ఆలోచనలు కొత్త తోవతీశాయి వాళ్ళిద్దర్నీ ఆ చల్లటి చెట్ల నీడల్లో. సంధ్య వెలుగుల్లో పచ్చగడ్డిలో వెన్నెలకింద వూహించి బాధపడ టంలో వొక ఆనందం పొందాడు. హెన్రీమూర్, రోడిన్, ఎప్స్టీన్, రాయ్‌చౌదరి శిల్పాలని స్ఫురింపజేసే మూనా శరీరం. ఆ వింతగడ్డం, చిరిగిన లాల్చీ, దిగులుతో మూసుగునే నేత్రాలతో సచ్చితానందం పొందిన అనుభవం, అతనిలో కొంత ప్రవేశించి నట్లయింది. వర్మ మనస్సు వుద్రేకాలు ఉప్పొంగి, నీరసించాయి; కాని శరీరం వాంఛతో విజృంభిస్తోంది. దిండ్లకింద చేతులు, తల దాచుకున్నాడు.

మరునాడు వర్మ నిద్రనుండి లేచేటప్పటికి ఏడు దాటింది. మండ వాలో కొచ్చి చూశాడు దూరాన మంచులో మసగగా మెరిసే పర్వత శిఖరాలు, విషాద కన్యలు ఆరేసిన ఆకుపచ్చ చీరలా విశాలమైన బయళ్ళు చుట్టూ పల్చటి ముసుగులా ఆవరించిన మంచు. మంచు తుంపరలను, ఇంద్ర ధనస్సులుగా చీల్చిన సూర్యకిరణాలు, పరమాత్మగిసి, ప్రేమ్‌తో సహా అమర్చి ఆకాశంలో తగిల్చిన తైల చిత్రంలా వుంది ఆ దృశ్యం.

క్షవరం, స్నానం, కాఫీ ముగించి వర్మ ఒంటిగా జీప్‌లో నదివైపు బైలుదేరాడు. తొమ్మిదైంది నదికి చేరుకునేటప్పటికి. రాత్రి వర్షానికి కాబోలు, నీరు వడిగా ప్రవహిస్తోంది. గట్లని కప్పేస్తూ సుడిగుండంలో నాట్యంచేస్తూ, గట్లమీద పచ్చిక, రాళ్ళు పూల చీరలా వున్నాయి. జీప్ నిలిపి రెండు ఫర్లాంగులు నడిచాడు. వంతెన కనిపించింది. ఇంకా పూర్తి కాలేదు. మరో నాలుగైదడుగులు మినహా వుంది. అవతలి ఒడ్డుకు, అడ్డంగా రెండు మూడు దూలాలు పెద్దతాళ్ళతో కట్టబడి, మధ్యమధ్య పెద్ద కర్రలు నాటి, వాటిమీద అడ్డంగా మరికొన్ని కర్రలు అమర్చబడి వున్నాయి. గట్లమీద బండలు, కొంచెం యిసక, దూలాలు కర్ర గునపాలు, తాళ్ళు వున్నాయి.

వర్మ ఆగిపోయాడు. రాతి బండలమీద నీడలో, మూనాబుజాలపై తల ఆనించి సచ్చిదానందం పడుకున్నాడు. ఆమె శరీరంలోని తీక్షణ శక్తి కొంత విడి తన దగ్గరకొచ్చినట్లయింది. క్రితం సాయంత్రం, ఆమెచేష్టలు జ్ఞప్తికొచ్చాయి. అతని చర్యలను ప్రబలంగా నిరసించింది. ఎందుకు? అది కవ్వించడమా? వేటకి రగల్చడమా? దబ్బాశా? సచ్చిదానందం ప్రేమతో తృప్తిపడిన పాతివ్రత్య ప్రకర్షా? కొండజాతి స్త్రీకి నీతి వుంటుందా? అది అంతా నటన. రుజువు చేసుకోడానికి నిశ్చయించుకొని బంగళాకు వచ్చేశాడు వర్మ.

పదకొండింటికి ఒక ఉత్తరం వ్రాసి సచ్చితానందాని కిమ్మని గంగణ్ణి పంపించాడు.

తనకి సర్వే నిమిత్తం కొన్ని పరికరాలు, పనిముట్లు కావాలి కాబట్టి, అతను వెంటనే మాచ్‌కండ్ వెళ్ళి వాటిని తీసుకు రావాలని ఆజ్ఞాపిస్తూ వ్రాసిన ఉత్తరానికి సచ్చితానందం జవాబు మధ్యాహ్నం రెండింటికి పంపించాడు. తను మాచ్‌కండ్ అధికారుల ఉత్తర్వు ప్రకారం, నది ఎగువన కొన్ని కొలతలు పరిశోధనలూ జరపడానికి వెడుతున్నానని, మళ్ళా రాత్రికి కాని తిరిగి రాలేననీ, అంచేత ఆ పని తాను చెయ్యలేనందుకు క్షమించమనీ, అతను పంపిన జాబులో వుంది.

వర్మకి కోపం దిగమింగినకొద్దీ తీవ్రమైపోతోంది. అతని విషయం మాచ్‌కండ్ అధికారులతో చెప్పెయ్యడానికి నిశ్చయించుకున్నాడు. ఆ వంతెన పూర్తికావడానికి వీలులేదు. అది గట్టి వంతెన కాదు; పది మంది నడిస్తే కూలిపోతుంది. దానివల్ల ప్రాణ నష్టం కలుగుతుంది. దాన్ని పడగొట్టాలి...ఏవేవో భయంకరమైన ఆలోచనలు. కాని నిజంగా అవి ఆలోచనలు కావని అతనికి తెలుసు. ఆలోచన నుండి ఇంద్రియాలు పారిపోతూ పడుతున్న తికమకలవి. ఊహ ఆలోచన లేకుండా ఒక్క శరీరం వికసించి, వ్యాపించి, స్థాయిపడటం ఎంత గొప్ప అనుభవం ! అదే సమాధి, అదే నిర్వాణం, తను తన నాగరికత కృత్రిమం. ఈ దుస్తులు, వేషం, యీ భాష, భావాలు, ఆచారాలు, నియమాలు—అన్నీ అసహజం. సహజమైన జీవితంకోసం ఎందరో యోగిపుంగవులు సంఘాన్ని త్యజించారు.

కవులు ప్రకృతిలో ఏకాంతాన్ని కామించారు. వర్డ్స్‌వర్త్, షెల్లీ, తోరియో, టాల్‌స్టాయ్, విట్‌మన్, వేమన్న అలా ఏకాంతంలో సజీవులయినవారే ! దాన్ని వెదుకుతూ లారెన్సు ఎన్నో దేశాలు తిరిగాడు. చలంగారి హంపీకన్యల అన్వేషణ. చిత్రకారులు వాన్‌గో, గాగిన్‌ల లంకా ప్రవాసం—యివన్నీ ఆలోచననుండి పారిపోవడానికి చేసిన ప్రయత్నాల ఫలితాలే !

సచ్చితానందం ఒకప్పుడు దొంగతనం చేశాడు; సంఘం నుండి పారిపొయ్యాడు.

ఈ అడవి ప్రదేశంలో దొంగెవరు? దొరెవరు ? నిజాన్ని కొలిచే విలువలు లేవు. ఆలోచనకి వయస్సులేదు. నియమాలు, ఆచారాలు, పాప పుణ్యాలు రాళ్ళుగా, చెట్లుగా, నదులుగా చిరస్థాయిగా మారిపోయ్యాయి. వాటికి వయస్సులేదు; పరిణామం లేదు. అందులో ఒకడైపోయ్యాడు. సచ్చితానందం మానాతో కలిసి నగ్నంగా ఏడమ్ ఈవ్‌లకిమల్లె ఫలాలు. ఆకులు తింటూ, తేనె త్రాగుతూ, నదితో ఆడుకుంటూ చల్లటి నీడలమధ్య గడ్డిలో ఆమె గుండెపై చెవిని ఆనించి, విశ్వం పరిభ్రమిస్తున్న నాదాన్ని, లయని వింటూ, ఆలోచనని ఆమె మెడలో పాతేసి, ఊహని ఆమె నడుం చుట్టూ తన చేతులతో కట్టేసి ఋతువులతో మారుతున్న తృష్ణని ఆమె కనురెప్పల వెనక ముద్దులతో మూతపడేసి, ఆనందంతో భాషని వెదుకుతూ బయటపడిన నాలుకని ఆమె అధరం వెనక హత్యచేసి, నిశ్శబ్దంగా కాలాన్ని కామంతో బంధించి, వారి ఉనికే లోకానికి తెలీకుండా అనంత ములో లీనమైన ఆ వ్యక్తుల జీవితం వర్మకు కావాలి కానీ సాహసం లేదు; ఆ త్యాగం చెయ్యలేడు.

సంఘాన్ని విడిచిపెట్టి ఏకాంతంలోకి పారిపోయినవారు నిజంగా అక్కడ ఆనందంపొంది తృప్తిపడతారని విశ్వసించడం కష్టం. మరో పదిమంది నగ్నదంపతులు అరకులోయలో నివాసం ఏర్పరుచుకుంటే, మళ్ళా అదొక చిన్న సమాజంగా తయారవుతుంది. అక్కడ స్పర్ధలు, అసూయలు, ద్వేషాలు, పగలు, రాజకీయాలు అదొక తాత్కాలికానుభవం కాని జీవితపరమావధి కాకూడదు. వీళ్ళందరూ ధైర్యం, త్యాగం అను కుంటున్నది నిజానికి పిరికితనమూ, అసహాయతానూ.

తనకా ధైర్యం లేదన్న చైతన్యం వర్మని కార్యానికి పురిగొల్పింది. రెండయింది. స్నేహలత సామానులు సాయంత్రం ఐదు, ఆరు గంటలకి కాని రావు. వచ్చినా రాత్రి యిక్కడేవుండి, మర్నాడు వెళ్ళడానికి నిశ్చ యించుకున్నాడు. భార్యని తనతోటే తీసుకురానందుకు తన్నుతాను అభినందించుకున్నాడు. స్నేహలత మూర్తి ఊహలో మెదులుతోంది.

ఆమె సన్నంగా, నాజూకుగా, లతలా వుండి, తనని అల్లుకుంది. స్త్రీ అంటే 'ఒక ఎముక; పిడికెడు జుట్టు; గుడ్డపీలిక'... అని బర్న్స్ కవి వర్ణన జ్ఞాపకానికొచ్చి నవ్వుకున్నాడు. అతని అరచేతికింద గట్టిగా తగిలిన ఆమె భుజాల ఎముకలు స్మరణకొచ్చాయి.

గ్రహణంనాడు ఆమెతో సముద్రస్నానానికి వెళ్ళిన ఘట్టం అతను మరిచిపోడు. నీళ్ళలోకి దిగగానే ఆ పల్చటి ఆకుపచ్చ చీర ఆమె తడిసిన శరీరాన్ని అంటించేసి, అల్పమైన అవయవాల్ని ప్రదర్శించింది. నీటికి లుంగ చుట్టుకుని, జుట్టంతా పిడికిటిలో ఇమడ్చేట్టుగా వుంది. నీటి బిందువులు భుజాల ఎముకలవల్ల ఏర్పడిన ఒంపులో నిలిచిపోయాయి. జూలు కత్తిరించిన గుర్రంలా, రెక్కలూడిన పక్షిలా, ఎండిన కాలువలా... ఎల్లాగో అయిపోయింది. నడుంలోతు నీళ్ళు— పెద్ద కెరటం అతన్ని లోపలికి గెంటింది. చెయ్యి పైకెత్తి పట్టుకోమని సంజ్ఞలు చేస్తున్నాడు. ఆమె గమనించలేదు. తను యిసకలోకి వెళ్ళింది. కూసం విడిచిన పాములా. మరో కెరటం ముందుకు తోసింది. తనూ బైట పడ్డాడు. చీకట్లో అర్ధరాత్రి 'ఫిషర్ ఎవెన్యూ' పరిమళంలో, వారు చేసుకున్న ప్రేమ ప్రమాణాల విలువ ఎంతటిదో అతనికి తెలిసొచ్చింది. అతనికి నీళ్ళంటే ఎంతభయమో, ఆమెతో నిజం చెప్పడం కూడా అంత భయం. ఆ రాత్రి కూడా సిగరెట్ పొగవొద్దన్లూ, మళ్ళా ప్రమాణాలు. తెచ్చి పెట్టుకున్న ఉద్రేకంలోని పల్చటి కన్నీరు—అంతా అందమైన భ్రమ! మూడైంది. అప్రయత్నంగా జీప్ వద్దకు నడిచివెళ్ళాడు. లోపలికి ఎక్కాడు. అతని ఊహలో వెన్నెల నక్షత్రాలు కదుల్తున్నాయి—నక్షత్రాలకేసి టెలిస్కోపులోంచి చూస్తున్న సచ్చితానందం సాటర్న్ గ్రహం చుట్టూవున్న 'రింగ్స్' ఆ టెలిస్కోపులో కనిపిస్తాయి. దిగ్భ్రమగొల్పే ఆ వింత దృశ్యాన్ని 'మూనా'ని చూడమంటాడు. జూపిటర్ గ్రహం చుట్టూ తిరిగే చిన్న గ్రహాల నీడలు అందులోంచి కనిపిస్తాయి. విశ్వం నీలి గుప్పిటలో దాచుకున్న వింతలన్నిటినీ చూస్తాడతను. చూసి సాధించే

దేమిటి ? వొంతెన కట్టడానికీ, ఖగోళశాస్త్రానికీ ఏ సంబంధమూలేదు. కాని ఎందుకు అట్లా చూడటం ? చెట్టు కొమ్మమీద కూర్చుని, సంధ్యవేళ పశ్చిమ ఆకాశంకేసి చూస్తూ కూర్చున్న సచ్చితానందం, అతని భుజం మీద తల ఆనించి నగ్నంగా కూర్చుని వీనస్ చూస్తున్న 'మూనా' అరకు లోయలో వొకదానిచుట్టూ వొకటి తిరుగుతూవుండే గోళాలు...'టెలిస్కోపిక్ బైనరీస్'... టెలిస్కోప్‌లోంచి తప్ప కనుపించవు. అతని ఊహ టెలిస్కోప్‌లా ఆ దృశ్యాల రహస్యాన్ని బైటపెడుతోంది. పాతపత్రికలో ఆ నెలకో ఆకాశం తీసిన ఫోటోలు, వ్యాసం చూశాడు. అతనికేమీ బోధపడలేదు. వీనస్ పశ్చిమ ఆకాశంలో, సూర్యాస్తమయం అవగానే ఎక్కువ కాంతివంతంగా మెరిసి, అరగంటలో మాయమవుతుందట.

జీప్ నడుస్తోంది. అత నెక్కడికి వెడుతున్నాడు ? జీప్‌లో ఆకాశం లోకి ఎగిరి, కొన్ని కోట్ల సంవత్సరాలు అనంతంలో తిరిగితే చివరికి యిదే స్థానానికి చేరుకుంటాడు. విశ్వం అనంతం కాదుట. దానికి పరిమితి ఉందట. స్థలం—తనవైపుకే వొంకర తిరిగి ఉందట— తను ఎక్కడికీ వెళ్ళలేదు. తిరిగి యిక్కడికే రావాలి!

ఎక్కడి కొచ్చాడు తను ?

వొంతెన సమీపంలో కొచ్చాడు. జీప్ నిల్చి పోయింది. దిగువున లోయలో నది వడిగా ప్రవహిస్తోంది. నీటివడికి వొంతెన తెగలేదు. ఆ వొంతెన ప్రయోజనం ఏమిటి ? ఎవరి అవసరాలకు వారు తలోవొంతెన స్వయంగా వేసుకుంటే ప్రభుత్వం ఎందుకు ? పథకాలెందుకు ? 'మూనా' ఒరియాపిల్ల— ఆ ఒంతెన వేస్తే, ఒరిస్సా ప్రాంతం పనివాళ్ళంతా ఇటొచ్చి పనులు సంపాదించడంతప్ప వేరే ప్రయోజనం ఏముంది ? దానివల్ల నష్టం కూడా వుంది. ఇటువారు అటూ, అటువారు యిటూ వెళ్ళి వలస లేర్పరుచుకుంటారు. దానితో తగాదాలు బైలుదేరుతాయి. అంతేకాదు ఒక్కసారిగా దానిమీద వో యాభైమంది నడిచారో— అది కూలి అంతా నీటి పాలవుతారు. ప్రాణనష్టం కలుగుతుంది.

వొంతిన చేరువలో, కొండమీదకి ఎచ్చేశాడు వర్మ.

కాస్త దూరంలో మరో ఎత్తుకొండ ఉంది. దాని శిఖరానికి తిన్నగా దిగువున వొంతెన ఉంది. అటసి ఒక భావం స్ఫురించింది గబగబ ఆ కొండమీదకి వెళ్ళాడు. నాలుగ్గంటేది. నలువైపులా చూశాడు. ఎవ్వరూ జనం లేరు. కొండమీద పెద్ద పెద్ద బండలు వొరిగి కదిపితే జారే కోణాలమీద నిలబడి ఉన్నాయి. ఏడెనిమిది పెద్దవి, చిన్నవి కనిపించాయి. ఒకదాన్ని చూశాడు. చాలా పెద్దది. అది కదల్లేదు. దాని ముందుగా కొంచెం ఎత్తున నాలుగైదు చిన్న బండలున్నాయి.

ఇంగ్లీషు సినిమాలలో దృశ్యాలు జ్ఞప్తికొచ్చాయి. నాజూకు, నాగరికత—సహజమైన శక్తుల్ని 'కసిని', ఉద్రేకాన్ని మరుగు పరుస్తున్నాయి. కాని ఆ ప్రచండ శక్తులు ఎప్పుడో వొకప్పుడు బైటపడక మానవు. అసలందుకే యుద్ధాలు. ప్రజలలో దాగిన 'తృష్ణ', 'కసి', 'పగ', 'పోటీ పడటం'—మొదలైనవి అది మానవుల ఉద్రేకాలు బైటపడేటందుకే, కుస్తీ పట్లు, బాక్సింగ్' మొదలైన వినోదాలు పాశ్చాత్య దేశాలలో ప్రబలాయి. టార్జాన్ చిత్రాలంటే అందుకే ప్రేక్షకుల కంత మోజు. 'హెమింగ్ వే' ఈ రకం తన్నుకునే, గుద్దుకునే కథలు వ్రాశాడు— ఆ రచనలు ఉత్తమ సాహిత్యం అంటున్నారు. లారెన్స్ నవలలో నాయికా నాయకులు తిట్టుకుంటారు. తన్నుకుంటారు. హింసించుకుంటారు. రక్తంతో వినోదిస్తారు, లారెన్స్‌ను సారస్వత గురువుగా పూజిస్తున్నారు. మన దేశంలో వీటికి స్థానం లేదు— ఇక్కడంతా శాంతి, మృదుత్వం, దయ, క్షమ, ఔదార్యము, భక్తి, పాతివ్రత్యం, త్యాగం మొదలైన విలువలు, యీ ప్రాచీన శక్తుల భేతాళనృత్యానికి తయారుచేసిన వేదిక కూలిపోకుండా వుంటుందా?

చిన్న బండలని బలం అంతా ఉపయోగించి వర్మ వరసగా తోసేశాడు. అవి వెళ్ళి ఆ పెద్ద బండలు మూడింటిని కదిపాయి. అన్నీ కలిసి కిందికి నదిలోకి శబ్దం చేస్తూ పడ్డాయి. రెండు మాత్రం వంతెనమొగలో పడి నాలుగైదు గజాల మేర వంతెన కర్రలని కూల్చివేశాయి. ప్రకృతి

హృదయం పగిలినట్లు పెద్ద శబ్దం. మరుక్షణం ప్రకృతి ఆశ్చర్యంతో వూపిరి బిగబట్టినట్లు నిశ్శబ్దం.

ఆ నిశ్శబ్దాన్ని చీల్చుకుని ఒక స్త్రీ కంఠం వినబడింది. మూనా పాడుతున్న వికృతమైన విషాద కంఠం అంది ముచ్చేసినట్లు పోసేశాయి. అగ్గిపుల్లని నోట్లోపెట్టుకొని, సిగిరెట్టుని అగ్గిపుల్లగా రాస్తున్నాడు! ఆ కంఠం వల్లకాటిలో వేసినకేక ప్రతిధ్వనిలా ధ్వనించింది. తనని రమ్మంటోంది వెడుతున్నాడు! కిందికి యింకా కిందికి.

ఆ కంఠంవైపు దిగుతున్నాడు. పాట దగ్గర కొచ్చింది. ఎదురుగా మూనా. గడ్డిపూలు రెండు చేతులకూ గాజులుగా అమర్చింది. ఎర్రపూలు చిక్కు జుట్టులో బిగించింది. ఎర్రటి పరికిణి నిండా చిరుగులు అతుకులు నవ్వింది.

వర్మ సిగరెట్ పైకి తీశాడు. నీళ్ళల్లోకాళ్ళు పెట్టి ఒడ్డున కూర్చుంది. ఏదో అంటోంది నీళ్ళల్లోకి రమ్మనా? నీళ్ళు బురదగా, వడిగా వున్నాయి. అతను దిగదల్చుకోలేదు. సిగరెట్టు ముట్టించాడు. అతను వదిలిన పొగను తను వూదుతూ పీలుస్తోంది. పర్సులోంచి పదిరూపాయల నోటు తీశాడు. ఆమె కళ్ళు సంతోషంతో మెరిశాయి. దగ్గరగా చూడ్డానికి వంగింది. భుజం మీది గుడ్డ జారినప్పుడు సంధ్య వెలుగులో రొమ్ముల నీడలు గుండ్రంగా రాతిబండ మీద పడుతున్నాయి. రెండు చేతులూ ఆమె భుజాన వుంచాడు. కిందికి జారుతున్న అతని వేళ్ళని తొలగించి తన చేతులతో బిగించి అతన్ని లేవతీసింది. నోటు తీసుకుని పరికిణిలో ముడిచింది.

వర్మకి ధైర్యం పెరిగింది—లేచాడు. ఆమె నడుస్తూంది— తనూ నడుస్తున్నాడు. పరుగెడుతూంది. తనూ పరుగెడుతున్నాడు. సంధ్య పడమటి ఆకాశంలో కరిగి, ఊహగా మారుతోంది. నీడలు పడడం లేదు. సన్నటి చందమామ నీటిలో ప్రతిబింబించటం లేదు చందమామ ప్రక్క ఒక నక్షత్రం పడమటి ఆకాశంలో మరో నక్షత్రం కనబడుతున్నాయి.

వంతెన దగ్గర కొచ్చేశారు. ఆమె వంతెన మీదకు నడిచింది.

అతన్ని రమ్మంది. వచ్చాడు. కింద నీటి వడికి తన తల తిరుగుతోంది. అతన్ని పట్టుగుంది. మెడచుట్టు చేతులు వేసి దగ్గరకు లాక్కొని బుగ్గలు, గడ్డం గిల్లుతూ లోతుగా కళ్ళలోకి చూసి విరగబడి నవ్వింది. ఏదో అంటోంది. వర్మ శరీరం పట్టు తప్పి ఉద్రేకంతో వూగిపోతోంది. ఆమెను గట్టిగా కౌగిలించుకున్నాడు. అతని పెదవులు ఆమె మొహాన్ని తడుము తున్నాయి. గుండె మీద గుప్పిడి బిగించి, ఒక్క వూపుతో ముందుకు తోసేసింది. వర్మ నీళ్ళల్లోపడి కొట్టుకుపోతున్నాడు.

కేకలువేస్తూ, మునుగుతూ, తేల్తూ, చెయ్యి పైకి విసరివేస్తూ కొట్టుకుపోతున్నాడు. కేకలు తగ్గాయి. నీళ్ళు మింగుతూ శబ్దాలు చేస్తు న్నాడు. పదడుగులు, పదిహేనడుగులు, ఇరవై—వెళ్ళిపోతున్నాడు. ఒడ్డునున్న ఏదో రాతిబండ కాసేపు కాలికితగిలి నిలబడినా, పట్టుదొరక్క మళ్ళీ కొట్టుకుపోతున్నాడు. ముప్పై నలభై అడుగులు—వెళ్ళిపోతున్నాడు చేతులు నీళ్ళపైకి రావడం తగ్గుతోంది. శబ్దం సన్నగిల్లుతోంది. నది మలు పులో ఒడ్డున వచ్చిన సచ్చితానందం చూశాడు. సైకిలు చెట్టుకు ఆనించి, లాల్చీ తీసేసి, డ్రాయరుతో చేతిలో టెలిస్కోప్‌తో సహా నీళ్ళలోకి దూకే శాడు. టెలిస్కోప్ వర్మ చేతికి తగిలి దాన్ని గట్టిగా రెండు చేతులతో పట్టుకున్నాడు. సచ్చిదానందం టెలిస్కోపు పట్టు వదలకుండా, ఒక చేతితో వర్మ మొహాన్ని పైకి నెట్టుతూ, ఒడ్డుకు చేరవేశాడు.

సంధ్య కరిగి చీకటి అలుముకుంటోంది. ఒడ్డున పడిన వర్మకి ప్రథమ చికిత్స చేశాడు. నీళ్ళు తాగేసరికి వర్మ నిస్త్రాణగా కళ్ళు మూసు గుని పడుకున్నాడు. ఒడ్డున పొదల వెనక కీటకాలు చెలరేగాయి. అడివి కూసినట్లుగా. మందమైన ఆకులు రాలుతున్నాయి.

సచ్చితానందం ఒక్క క్షణంలో ఆరిపోయింది. వెనక్కి చూశాడు. మూనా దూరంగా నిలబడి వుంది. ఆమెకేసి నడిచాడు. అతని విడిచిన దుస్తులు ఆమె దగ్గరున్నాయి. ఒడ్డున కూర్చున్నాడు. మూనా తల తుడుస్తోంది. కణతలు నొక్కుతోంది. లంగా సద్దుకోడంలో నోటు బైటపడింది. అతనికిచ్చింది. ఏదో మాట్లాడింది. అతను బట్టలు వేసుకున్నాడు. ఆమె సైకిల్ తీసుకుని నడుస్తోంది. అతను మెల్లగా నడుస్తూ టెలిస్కోప్‌లోంచి చూస్తున్నాడు. పశ్చిమ ఆకాశంలో ఎరుపు చిక్కనై నలుపైంది. "వీనస్—" పెద్దగా మెరుస్తోంది. భూమి అంచు నిశీథి ముసుగులా కమ్మేసింది. వర్మ దగ్గరకు చేరుకున్నారు. అతని పంట్లాంజేబులో పర్సు తీసి, అందులో నోటు పెట్టి, ఆ జేబులోనే వుంచాడు. మళ్ళీ నడుస్తున్నాడు. రోడ్డు మీదికి వచ్చేశాడు. దూరంగా అతనికేసి ఒక వేగన్ వస్తోంది. సంజ్ఞలతో దాన్ని నిలిపాడు. అందులోంచి సోమయ్య దిగాడు. అతని వెనకాల వర్మ భార్య స్నేహలత దిగింది. చలికి కాబోలు! ఆమె కొంగుని జుట్టుమీద, చెవులమీద కప్పుకొంది. ఆమెని అక్కడే వుండమని, సోమయ్యని డ్రైవర్‌ని తీసుకొని వర్మ దగరికొచ్చాడు. ముగ్గురూ సాయం పట్టి అతన్ని వేగన్‌లోకి చేరవేశారు. ధ్వనికి ప్రశాంతత మైలబడుతుందేమో నన్నట్లు, ఎవ్వరూ మాట్లాడటం లేదు. దూరంగా నదిమూలుగు, కీటకాలరొద, శిఖరాలపై వికృతంగా బండలు, వాటి మధ్య "వీనస్" వెలుగు — జబ్బుచేసిన పరమాత్మ అరకులోయలో అడుగు పెట్టినట్లు శూన్యం సజీవమైన క్షణాలు గడిచాయి.

వేగన్‌లో చిన్న దీపం వెలుగులో వర్మ కళ్ళు తెరిచాడు. చుట్టూ చూశాడు. భార్య మొహం చూసి నీరసంగా నవ్వాడు.

"అసలేం జరిగింది ?" అని అడిగింది స్నేహలత. ఏ ఒకర్నీ సంబోధించకుండాన్నే విశ్వం చేసిన కడసారి గానానికి శ్రుతిలా ఆ కంఠం అసహజంగా వినబడింది.

వర్మ మాట్లాడబోయాడు వద్దని సంజ్ఞచేసి, సచ్చితానందం సమాధానం చెప్పాడు.

"ఏం లేదండీ— నేను సర్వే పూర్తి చేసుకుని రోజూలాగే నది మధ్యగా వంగిన ఆ చెట్టుకొమ్మ మీద కూర్చుని "వీనస్" గ్రహం కని పిస్తుందేమోనని టెలిస్కోప్‌లో చూస్తున్నాను. పట్టుజారి నీళ్ళ పడి పోయాను. ఒడ్డున వస్తున్న వర్మగారు నన్ను చూసి నీళ్ళలోకి దూకి ఇద్దరం ఒడ్డుకు చేరడంలో నీళ్ళు తాగేశారు.

వర్మ కళ్లు తెరిచి జాలిగా అతనికేసి చూశాడు. చెయ్యి పైకితీసి అతని భుజం మీద వుంచాడు. యేదో మాట్లాడబోయాడు. సోమయ్యకి దగ్గరగా రమ్మని సంజ్ఞచేసి, అతని చెవులో ఏదో చెప్పాడు. "మీరు విశ్రాంతిగా పడుకోండి. వంతెన గురించి అదుర్దా పడకండి. ఆ పనికి మీరెందుకు ? మేమందరం పూర్తి చేస్తాంగా" అన్నాడు సోమయ్య.

వేగన్ బంగళాకేసి నడుస్తోంది. స్నేహితల వీనస్ కేసి చూసింది. తన భర్తకి యీదడం రాదని నీళ్ళంటే భయమనీ ఆమెకు తప్ప ఎవ్వరికీ తెలియదు. ఈ రహస్యం ఎవ్వరితో చెప్పనులే అన్నట్లు "వీనస్" శిఖరం వెనుక లోయలో భూమి అంచు వెనక దిగి అంతర్ధానమైంది. కూలిన శిఖరంగా అరకులోయ చీకటి సౌందర్యం ముసుగులా పైకి లాక్కుని పరుంది.

# అనురాగప్రస్థారం

సృష్టిలో ఏ ఇద్దరూ ఒకలా వుండరు. అంతేకాదు— ఏ ఇద్దరి శీలము, ప్రవర్తనా, మనస్తత్వము ఒకలావుండవు. సృష్టి వైచిత్ర్యమంటే ఇదేనేమో అనిపిస్తుంది మానవజాతిలో యింతటి వైవిధ్యమున్నప్పటికి, మనుషుల్ని తెగల కిందా, జాతుల కిందా, కూటాల కిందా విడదీసి వారి వారి ప్రవృత్తులను బట్టి పలానా తెగకిచెందిన వ్యక్తులుగా వర్ణించి అంతస్థు నిర్ణయించి విలువ కట్టి విడిచెయ్యడం సాధ్యమవుతోంది సాంఘిక చరిత్ర కారులకి.

నియంత నెరుగుదుం, రౌడీ నెరుగుదుం, కాని ఏ ఇద్దరు నియంతలూ ఒకే రకం దౌర్జన్యకాండ కొనసాగించలేదు. ఏ ఇద్దరు రసికులు ఒకే రకం ప్రణయకాండకు పూనుకోలేదు, ఏ ఇద్దరి వెర్రి ఒకే పక్కిలో వ్యక్త మవదు. యే ఇద్దరు కవులూ, ఒకే మాదిరి కావ్యం రచించలేదు. లోకంలో పెద్ద మనుష్యలంతా ఒకేరకం పెద్దమనుషులేమో తెలియదుగాని, రౌడీ లలో వున్న వైవిధ్యం ఇంకెవరిలోనూ లేదంటాడుషా. అయినా వీరందరూ వైఖరిని బట్టి, బుద్ధినిబట్టి తెగలుగా మనకి పరిచితులే. వైవిధ్యంలో పోలి కనీ, భిన్నత్వములో యేకత్వాన్ని చూడగల శక్తి ఒక్క మానవుడికే వుందేమో!

ఈ రకంగా తెగలకింద విడదీసి విలువలుకట్టే చరిత్రకారులు పురుషులవడంమూలాన కాబోలు స్త్రీలలో ఇంతటి వైవిధ్యం కనబడదు. పద్మినీ, హస్తినీవగైరా జాతులుగా వర్ణించడము ఎరుగుదుం స్త్రీ రహస్యం వుంచుకోలేదని ఎరుగుదుం. వారి అసూయ, సహనం, గయ్యాళితనం, చాంచల్యం— ఇవన్నీ మానవచరిత్ర ప్రారంభమైనప్పటి నుండి ఎరు గుదుం. ఆధునికయుగంలో ఈ జాబితాకి ఒకటి రెండు చేర్చాలేమో—— చదుకొన్న స్త్రీ— అంటే ఇంగ్లీషు విద్య ఆర్భాటం. "పురుషుడికి ఎందు

లోనూ తీసిపోదు" అని సూచించే ఒక ధీమా, హుందాతనం"— లాంటివి జతపడవచ్చు. ముందు ముందు, ఈ తెగల నాధారంగా చరిత్ర వ్రాసేవారికి ఈ స్త్రీ, పురుష తారతమ్యమే కనబడక వ్యత్యాసాల ప్రశంస విడిచేసి అందరినీ ఒకలాగే పరామర్శించే పరిస్థితి ఏర్పడుతుందేమో !

ఈయనేదో కథ చెబుతున్నాడు. చదువుదామనీ ప్రారంభిస్తే వ్యత్యాసాలు, పోలికలు అంటూ ఒక వ్యాసముతో విసిగిస్తున్నా డేమిటని పాఠకుడు చీకాకు బడతాడని నే నెరుగక పోలేదు. కథ వ్రాసేవాడు సూటిగా కథ చెప్పుకుపోవాలి. అప్రస్తుతమయిన వస్తువులో— అ దెంతటి వైజ్ఞానిక విలువగలదయినా— శక్తి సామర్థ్యాల ప్రకర్షలో విసిగించడం కథానికపట్ల అపచారమని ఎరుగుదును. కానీ, ఈ కథకి— పోలికలు, వ్యత్యాసాలు— వీటి ప్రశంస చాలా అవసరం. కథ ప్రారంభించి నే నిందాక చెప్పినదంతా కథ మధ్యలో అక్కడక్క పాటకుడు చటుక్కున గమనించే అవకాశం ఇవ్వకుండా పొందుపరచి కథ ముగించి వెయ్యొచ్చు. అలా చేయటం పాఠకుడిని దగా చేయ్యడంలా తోచే, ముందు చెప్పేశాను.

సృష్టిలో ఏ ఇద్దరూ నొకలాగుండరన్న వాక్యంతో ఈ కథ ప్రారంభించాను ఈ వాక్యంలో యదార్థాన్ని పాఠకుడు ఎంతవరకు అంగీకరిస్తాడో నాకు తెలీదు. వెనక్కి వెళ్ళి వ్రాసింది చదువుకుంటే సందేహాలు నాలోనే రేకెత్తుతున్నాయి. కవల పిల్లలు ఒకేలా వుండే వారు— ప్రవర్తనలో, రూపంలో కూడా— లేకపోలేదు. "వాడు అచ్చంగా వాళ్ళనాన్నే" అంటే పోలికల మాటటుంచి బుద్ధి, మనస్తత్వం, ఎంత సమంగా వున్నవో ఉదహరించడమే అవుతుంది. ఇలాంటి పోలికలన్నీ ఒకే కుటుంబంలో వ్యక్తులకు అన్వయిస్తాయి కాని వేర్వేరు కుటుంబాలలో వ్యక్తులకు అన్వయించవు అలా అన్వయించే ఇద్దరి వ్యక్తులను గురించే ఇప్పుడు నే చెప్పబోయేది.

"అచ్చంగా మీ ఆవిడలాంటావిడ్ని చూశాను మొన్న రైల్లో, ప్రసాదు" అంది రంగనాయకమ్మ, హరిప్రసాదుతో.

"వెడుదురూ, మీ రెప్పుడూ ఇట్లాంటివే అంటూంటారు" అన్నాడు ప్రసాదు.

"అయితే వెళ్ళిపోతున్నాను" అని లేచింది రంగనాయకమ్మ. ప్రసాదు లేచాడు కంగారు పడ్డాడు. ఏం అనాలో తెలిసింది కాదు.

"మరో క్షణం ఆగితే కామాక్షి వస్తూంది. ఆలయానికి వెళ్ళుండాలి. ఆలస్యమయిందంటే లక్ష్మణరావు ఇంటికి బయలుదేరిందిలెండి.

"మరొకసా రొస్తాలే" అంటూ గుమ్మందాటి మెట్ల గదిలోకి వచ్చింది.

"కాస్త టీ యేనా పుచ్చుకోకుండా వెడతారా ? కుర్రాడ్ని పంపుతాను. కాసేపు కూర్చోండి."

రంగనాయకమ్మ మళ్ళా లోపలికొచ్చింది. కూర్చుంది గోడని తగిల్చిన ఫోటో కేసి చూస్తూ.

ఏదో వెడుదురూ అన్నాడన్న మాటేగాని ప్రసాదుకి తనభార్యలా వుండే వ్యక్తిని గురించి వినాలనివుంది. తనూ ఆమె చూస్తున్న గోడమీద ఫోటోలకేసి చూస్తున్నాడు. రెండు ఫోటోలున్నాయి. ఒకటి ప్రసాదు పెళ్ళినాటిది. రెండోది ఆరేళ్ళ తరువాత ఇటీవల భార్య కామాక్షి బస్తు ఇటలీ నుంచీ దూరపు చుట్టం తెచ్చిన కెమెరాతో తీసింది.

"ఈ మధ్యన తీసిందే... కామాక్షిది... నాదీ తీశాడు. బాగా రాలేదు. అందుకని ప్రదర్శించలేదు ఇంతకీ మన మొహం బాగ లేకపోతే కెమోరా ఏం చేస్తుంది.... ఏమంటారు ?" అన్నాడు ప్రసాదు. రంగనాయకమ్మ నవ్వింది.

"ఎవరి మొహం వారికి బాగుండ కేం ? బాగానే వుంటుంది. కావాల్సిన వాళ్ళ ఆక్షేపణకి భయపడి బయట పెట్టం మీ మొహానికేం, నిక్షేపంలాంటి మొహం.

"అమ్మయ్య, ఆ ఫోటోకూడా ఫ్రేంలో పెట్టించి గోడని తగిలిస్తాను. మా ఆవిడ అభ్యంతరం పెట్టినాసరే." అన్నాడు.

"అదేవన్నమాట. ఆవిడ అభ్యంతరం ఎందుకుంటుంది. ప్రసాదు నవ్వటం చూసి, "పరిహాసమా ? అవుతే నేనూ నవ్వుతాలే" అని నవ్వడం సాగించింది.

"మరి మీరు చూసినామె ఇట్లాగే ఉందాండి ?

"చెప్పొద్దు పొమ్మంటివిగా ?"

"వొద్దంటే చెప్పమనే– మీ రామాత్రం గ్రహించలేరా ఏం?"

రంగనాయకమ్మ వయస్సు యాభై – లావు, తగ్గ ఎత్తు, మెడనిండా నగలు, గుండ్రని మొహం, మెలితిప్పి బిగించికట్టిన జడకొప్పు– అందులో చామంతిపూలు. జీవితంలో పేచీలు, సమస్యలు అడక్కపోయినా సలహా ఇచ్చే హుందాతనం వ్యక్తపరిచే మనిషి.

"కామాక్షి లేదుగనకనే తెగించి అడిగావు. ఆ మాత్రం గ్రహించలేనా ప్రసాద్ ?"

"మీ రెరుగరు కామాక్షి మునుపటికి మల్లెకాదు. చాలా మారిపోయింది. మీరు చూసి మూడేళ్ళయిందేమో!"

"నాకు చెప్తావెందుకోయ్. ఆ మాత్రం అసూయ లేకపోతే ఆడదే కాదు. దానికి సిద్ధపడి, దిగమింగుకొని, మొగవాడే మారతాడు. మా ఆయన్ని చూశాగా. నువ్వూ అంతే. అచ్చంగా కామాక్షి కళ్ళు, ఛాయ, జుట్టు వొంకులు, ఎత్తు, పొడుగు– ఆఖరికి నడకకూడా–అంతా కామాక్షే. కామాక్షి అనుకుని పలకరించా, 'అత నెక్కడ' అని అడిగాను తెల్లబోయింది. సమాధానం లేదు. ఏమిటి చెప్మా అని తెల్లబోయాను–నేనూ అక్కడికే అన్నాను ఉలకదు పలకదు. రైలుదిగుతూ చెప్పింది వాళ్ళది కాకినాడట. మెడికల్ కాలేజీలో చదువుతూందిట. పొరబాటయింది– మా ప్రసాదు భార్య కామాక్షి వనుకున్నాను– ఫలానా ప్రసాదు అని నిన్ను గురించి అదే నువ్వు గాయకుడవని చెప్పాను. ఆమె నవ్వింది. ఇల్లాగే ఆమెని

కామాక్షి అనుకుని, ఇదివరలో ఇద్దరు ముగ్గురు పలకరించి, పొరబాటు సర్దుకున్న వృత్తాంతం చెపితే ఆశ్చర్యపోయి, కామాక్షితో చెప్పెయ్యాలని వచ్చా" ప్రసాదు ఆ వ్యక్తిని ఊహిస్తూ యేమీ సమాధానం యివ్వలేదు.

కుర్రాడు తెచ్చిన టీ త్రాగి, లేచింది రంగనాయకమ్మ.

"మరి వెళ్ళొస్తా. అచ్చంగా కామాక్షి కళ్ళే— ధగ ధగ మెరిసి పోతూ, నిలబెట్టే చూపులు..."

"ఇంతకీ ఆమె పేరు చెప్పారు కారు" అన్నాడు ప్రసాదు.

"చూశావా ఎంత తెలివితక్కువదాన్నో. పేరు అడగనేలేదు" అని వెళ్ళింది.

ఆనాటి సంభాషణతో కథ ప్రారంభమైందనవచ్చు. జీవితంలో సంఘటనకి తుది మొదళ్ళు స్ఫుటంగా ఉండవు. కథానికలో కూడా ఉండక్కరలేదన్న నినాదం రష్యన్ రచయిత చెకోవ్‌తో ప్రారంభమై ఆధునిక రీతుల్లో తుదిమొదళ్ళ విషయం అట్లావుంచి అసలు వస్తువే లోపించే స్థితి యేర్పడింది. సరే, ఇదంతా ఈ కథకి అప్రస్తుతం గనుక, ప్రారంభం వున్నదని మాత్రం చెప్పి విడిచివేస్తాను.

కామాక్షిలాగా వున్నామెను చూసిన మరో ఇద్దరు స్నేహితులు ఆ వ్యక్తిని వర్ణించడంతో ప్రసాదులో వింత ఊహలు రేగుతున్నాయి. ఆమెను చూడాలని ఉంది. తన భార్య భార్యగాకాక మరో వ్యక్తిగా తటస్థ పడటం ఊహలో వింత అనుభవం. అది యదార్థమైనప్పుడు తానెట్లా తట్టుకుంటాడు.

ఓ వేళ ఇదంతా అతిశయోక్తేమో—అచ్చంగా అల్లా ఉండేవారు సృష్టిలో ఉండరు. కాని రంగనాయకమ్మ పొరబడేఘటంకాదు. ప్రసాదులో కొత్తరకం వేదన బయలుదేరింది. అందుకు కారణం లేకపోలేదు.

ప్రసాదులో కళాతృష్ణ చాలా ఉంది. సంగీతం అభ్యసించాడు. కాలేజీలో కచ్చేరీలు చేసి గాయకుడుగా గొప్ప భవిష్యత్తుగల వ్యక్తిగా పేరు తెచ్చుకున్నాడు. తరువాత లా చదువు పూర్తిచేసి, ప్రాక్టీసు

పెట్టాడు. కామాక్షిని చేసుకున్నప్పుడు అతని వయస్సు ఇరవైనాలుగు– ఇప్పుడు ముప్పై ఒకటి. ఈ యేడు సంవత్సరాలలోనూ, గాయకుడిగా పైకిరాలేదు. అతను లలిత సంగీతం బాగా సాధనచేసిన రోజుల్లో శాస్త్రీయ సంగీతం లోపించిందన్నారు జనం, శాస్త్రీయ సంగీత సాధన చేసిన రోజుల్లో, లలితసంగీతం కావాలన్నారు; కంఠం శ్రావ్యంగావున్నా, టెక్నిక్ చాలదని కొందరు టెక్నిక్ ఎంత బాగుంటేనేం, గాత్రం బాగుం డాలయ్యా అని మరికొందరు చేసిన విమర్శనలతో అభిరుచి సన్నగిల్లి వెనుకవున్న ఆ కాస్తపేరుకూడా వినబడటం అరుదైపోతోంది.

దానికి బదులు మరో రకం పేరు ప్రచారంలో కొస్తూంది– కామాక్షి భర్తగా చెప్పుకుంటున్నారు ప్రసాదుని– కామాక్షిలో వొక్కటే విశేషం ఉంది– అది ఆమె సౌందర్యం.

పెండ్లినాడు ఆమె వయస్సు పందొమ్మిది బంగారంలాంటి శరీర చ్ఛాయ, తీగలాంటి మనిషి; కత్తిలాంటి నడుం – చరిత్రలో చీకటిగుహలు, వాటిల్లో ఆరిన కాగడాలు, పగటిని చీకటిచేసే వెన్నెల– లాంటివి స్మరణ కొస్తాయంటారు కొందరు– ఆమె జుట్టుని చూచి, రేకులు విప్పని మందారం మొగ్గ ఆమె నోరు, గులాభీరంగుతో మెరిసే పల్చటి చిగుళ్ళ కింద తళుక్కుమనే పళ్ళవరుస, చిరునవ్వుతో వింతగా మెలికలు తిరిగే బుగ్గల కింద గీట్లు, పెదవుల కొనలో పడే లేత వొంపులు చూసినవారు కలకాలం స్మరించుకుంటారుట. వీటన్నిటికంటె చెప్పుకోదగింది ఆమె కళ్ళలో తళుకు, రెప్పల కింద యేదో వెలుగు–వెన్నెల పిలుపుకి పొంగిపోయ్యే సముద్ర కెరటముపై నురుగులో వెలుగు–సంధ్యకి– సిగ్గుపడి కళ్ళుమూసు కుంటే, చందమామ చక్కిలిగింతకి ఉలిక్కిపడి ఒక్కసారి కండ్లు తెరిచిన ప్రకృతికన్య చూపులో వెలుగు– యేవేవో చెపుతారు, కామాక్షి కళ్ళల్లో సౌందర్యం గూర్చి.

ప్రసాద్ సంగీతం అభ్యాసం చేసి కీర్తి కాంతని అన్వేషించిన మొదటి రోజుల్లో ఆమె చక్కదనం గూర్చి పట్టించుకోలేదు. యేడేళ్ళు గడిచినా సంతానం కలుగలేదు. సంగీతం మరుగున పడింది. ఏదో అసం

తృప్తి, ఖర్చు కాని కొన్ని శక్తులు అతన్ని నలువైపులా నెట్టుతున్నాయి— కాని తలుపులు మూసి వున్నాయి. అవి బయటపడే మార్గం కనబడదు.

ప్లీడరు వృత్తి మీద మనస్సు లగ్నం కావడం లేదు. అతనికి ఆ నల్లకోటంటేనే తలనొప్పి. ఆ కాలరు, ఆ గబ్బిలం కోటు విప్పి దూరంగా పడేసేవరకూ అతనికి తోచదు. సాయంత్రం క్లబ్బు—చీట్లాట, క్లబ్బులో ఎన్నో సమావేశాలు వుత్సవాలు జరిగినా, అతని సంగీత కచ్చేరి ఏర్పాటు చెయ్యాలని ఉబలాటపడిన వారు కనబడరు. కొత్తలో ఒకటి రెండు సంవత్సరాలు అతని కచ్చేరికి కామాక్షి కూడా వచ్చి ప్రేక్షకులలో కూర్చునేది. ఇప్పుడామె రావడం లేదు. అందుకని కచ్చేరీలు ఏర్పాటు చెయ్యడం మానుకున్నారా ? ఏమో — ఎవరు చెప్పగలరు. ప్రజల అభిరుచుల మీద తీర్పు చేసేటంత తీవ్రమైన అసంతృప్తి ఇంకా రాలేదేమో అతనిలో ?

ఆ రోజున కోర్టు నుంచి ఇంటికి వెళ్ళకుండా, తిన్నగా క్లబ్బుకెళ్ళి, రాత్రి ఎనిమిదింటికి ఇంటికి చేరుకున్నాడు హరి ప్రసాద్. ఆ కోటు, కాలరు తీసేసి స్నానం చేసి వరండాలో ఈజీచైర్‌లో కూర్చున్నాడు. కామాక్షి మందహాసం చేసి, పలకరించి కోర్టు విశేషాలేమిటని అడిగింది.

"ఏముంటాయి— ఏమీ లేవు. ప్లీడర్లు గబ్బిలాలయితే జడ్జి ఎలుగుబంటి, క్లయింట్లందరూ కాకుల రెట్టలూ, పబ్లిక్ ప్రోసిక్యూటర్ గుడ్లగూబా..."

"సరే ఇవన్నీ ఎప్పుడూ విన్నవేగా——" అతనిలో విసుగు గమనించి——

"నేను చెప్పనా, విశేషం ? ఇందాక మనింటికి శోభాసుందరొచ్చింది. ఇప్పుడిప్పుడే వెళ్ళారు. ఆవిడ, రంగనాయకమ్మగారూను" అని, అతనేమంటాడో విందామని ఆగింది. కామాక్షి.

"ఆవిడెవరు ?

"అదే— అచ్చంగా నాలాగుండే ఆవిడ."

"ఉందా ?"

"ఏమీలేదు. రంగనాయకమ్మ కల్పన. ఆవిడ లావు— నాకంటె—

కా స్తంత హొట్టేమో కూడా. పీసం అంత మెల్ల... మెడిసన్ పూర్తయి, ఇక్కడ హాస్పిటలులో నాలుగు నెలలపాటు ట్రైనింగ్ కొచ్చిందట. ఆవిడకి ముప్పై పైమాటే, నా కింకా పాతికేళ్లు నిండందే..."

"అవునవును, అందరికీ ఏళ్ళు కలుస్తూ వుంటే, మనకి తగ్గిపోతూం టాయి. నా కప్పుడే ముప్పై రెండు వస్తోంది– అందులోంచి ఏడు తీసెయ్యి నీ వయస్సుకి...ఇంతకీ పాతిక దాటాక, అసలు వయస్సెంతో చెప్పిన స్త్రీ సృష్టిలోనే లేదులే... మెల్లకన్నా...?"

"ఏమోనండి బాగా కనపడింది, తల పక్కకి వంచి నవ్వాడు... ఆవిడ విషయం, రంగనాయకమ్మ మీతో చెప్పిందటగా నాతో మీరు చెప్పనేలేదు" అంది కామాక్షి.

అవును, ఆ మధ్య అన్నట్లుంది– ఏముంది పెద్ద చెప్పేటందుకు. చెప్పకపోతే, ఒక్క మెల్లకన్నుతో విడిచేశావు. చెపితే, గుడ్డిదవునేమో కూడా..."

"మీరే చూసి మెచ్చుకొని గానం చెయ్యండి."

కామాక్షి చివాలున లేచి లోపలికెళ్ళింది. ఆ రకం అలక నిత్యమూ అతనెరుగున్నదే. మొదట్లో బుజ్జగించి, బతిమిలాడేవాడు. అలవాటు పడి పోయి, అది కూడా మానుకున్నాడు. రంగనాయకమ్మ తనతో చెప్పినట్లు తను ఆమెతో ఎందుకు చెప్పలేదో ఆలోచిస్తూ పత్రిక చూస్తున్నాడు.

ఆదివారం సాయంత్రం క్లబ్బులో ప్రసాదు పాటకచ్చేరి. జనంలో వందమంది పోగైనారు మెంబర్లు మినహా. వాద్యాల మధ్య ప్రసాదు గానం సాగుతూంది. వారు కూర్చున్నచోట ఫాన్ లేదు. అతను మధ్య మధ్య చెమట తుడుచుకుంటున్నాడు. ఎగదువ్విన క్రాపింగ్ నుదిటి మీదికి కాద లుగా విడివడుతూంది. లాల్చీ, పంచికట్టు, సిల్కు కండువా వేసు కున్నాడు. ఆరింటికి దీపాలు వచ్చాయి. కళయిన మొహం ప్రసాదుది. కళ్ళు మూసుకుని ఆలపిస్తూంటే, తన్మయుడైన కళాజీవిగా సభకి ఒక శోభని కూరుస్తాడు.

కల్యాణి రాగ ప్రస్తారంలో, పల్లవి జోరుగా సాగుతోంది. ముందు కూర్చున్న వారిలో ఒకరిద్దరు చేసిన కరతాళ ధ్వనులు అందుకునే ధాదు

కనబడలేదు. జనం పల్చబడ్డారు. మరొక్క అంశంతో ముగించ నిశ్చయించి, సరస్వతి రాగంలో "అనురాగమువె" ప్రారంభించాడు. కళ్ళు మూసుకుని తన్మయుడై చాలాసేపు గానం చేసి కళ్లు తెరిచి చూశాడు. హాలులో సగం పైగా జనం వున్నారు. కరతాళ ధ్వనులు చేస్తున్నారు. చివర వరసలో బెంచీ మీద ఆరంభంలో తను చూడని స్త్రీ ప్రేక్షకులు కొందరు కనిపించారు.

జనం లేచి వెడుతున్నారు. వాద్యాల వ్యక్తులు వాద్యాలను సర్దుకుంటున్నారు. క్లబ్బు నిర్వాహకులలో ఒకరు, కృతజ్ఞతా వాక్యాలు చెబుతున్నారు. మొహం తుడుచుకుని, క్రాప్ సవరించుకుని, ప్రసాదు లోపల గదిలో ఫాన్ క్రింద కుర్చీలో కూర్చున్నాడు. అతని మొహం ఎర్రబడినది— ఆవిరి పట్టినట్టు చర్మం అదొక లాగైంది. బెంచీమీద స్త్రీలు లేచి వెడుతున్నారు. ఒకామె గదివైపు వస్తూంది. అవును, కామాక్షనుకుని క్షణం బెదిరి, కామాక్షికి కచేరి విషయం తెలియపరచ లేదన్న సంగతి జ్ఞప్తికి తెచ్చుకుని, తమాయించుకుని ఆ వచ్చినామెను ఆహ్వానించాడు

"చాలా బాగుందండి— క్షమించాలి— టైముకి రాలేకపోయ్యాను— హాస్పిటల్ లైఫ్ ఎట్లాంటిదో తెలుసుగా— నే వచ్చిన నాలుగైదు నిమిషాల్లోనే; మీరు ముగించివేశారు ప్రసాదుగారు"

ఏదో సిగ్గు ఆవరించి, అతను మాట్లాడలేక పోతున్నాడు.

"థాంక్స్ ఇన్విటేషన్ మీకు చేరిందో లేదో... అని..."

మమ్మల్ని గురించి వినడమేగాని, నేనెప్పుడూ మీ పాట వినలేదు. ఎల్లుండి సాయంత్రం టీకి రావాలి—" రంగనాయకమ్మ ఊళ్ళో లేదట. మీ... వారిని— ఆమె కూడా— వస్తారు కదూ ?"

ఆమెలోకి చూశాడు. అంతా కామాక్షిలాగే వుంది. కామాక్షికంటె కాస్త లావు— కొంచెం పొట్టేమో. ఆమె తల వంచింది. తీక్షణమైన చూపు— అందులో ఇంద్రజాలం వుంది. ఆ చూపు ప్రసరించిన చోటంతా లోహాన్ని అయస్కాంతం లాగినట్లు చలనంలేక లొంగివుంటుంది. కంటిపాపలో దట్టమైన నలుపులేదు— తేనెలా తేలిపోయి, ఊదారంగులోంచి వచ్చిన నలుపు. అందుకే కాబోలు కామాక్షి మెల్లని వ్యాఖ్యానించింది అమాయకురాలు,

"థాంక్స్—అలాగే...శోభా...'

"సుందరిని.

ఇంటివయనం చెప్పి, వెళ్ళింది ఎర్రటి పట్టుచీరమీద తెల్లటి మల్లె మొగ్గ డిజైన్ చీర ఒంపులు తిరిగి నుదిటి మీదికి జారే చిరువెంట్రుకల కూర్పుగల జుట్టుముడి. ఒంటి రంగుతో కలిసిన పసిడిరంగు జాకెట్టు — వెడుతూంటే వెనక భాగం వొంపులు, లయతో కదిలే దృశ్యం చూస్తూ కుర్చీలో వుండిపొయ్యాడు ప్రసాదు. మర్నాడు కచేరి ప్రసంశ తెచ్చింది కామాక్షి.

"నాకు చెప్పలేదుగా—"

"నువ్వు రావని తెలుసు— అందుకే చెప్పలేదు."

"ఆవిడొచ్చిందటగా— అందుకేగా నాకు చెప్పకపోవటం."

ప్రసాదు ఏమీ మాట్లాడలేదు. తల వంచుకొని కూర్చున్నాడు.

"అచ్చంగా నాలా వుందా ?"

"అవును— మొదట చూడగానే నువ్వే అనుకున్నాను"

"అందంగా వుందా?"

లేచి దగ్గరగా వెళ్ళి జడని స్పర్శిస్తూ మొహం తన వేపుకి తిప్పుకున్నాడు.

"నీ అంత అందమైంది."

"నాది మెల్లకన్నంటూరా ఏం కర్మ."

కామాక్షి మూతి ముడుచుకుంది. అప్పుడే ప్రసాదుకి మరింత ఆకర్షణీయంగా వుంటుంది. కాని ఆ నోట్లోంచి వెలువడే పలుకులికి అదిరి, ఆ చక్కదనం నిదానంగా తిలకించే అవకాశం అతనికి కలగదు.

"మెల్లకాదు — ఊదారంగులో కంటిపాప నలుపు. ఓరగా చూచి నప్పుడు ఆ యాంగిల్‌లో అలా కనిపించొచ్చు. అయినా అందమయిన కళ్ళే."

"మాట్లాడారా ?"

"ఆమే పలకరించింది."

"నేను నమ్మాలనే మీరు చెప్పేమాట ? ఇన్విటేషన్ రహస్యంగా నాకు చెప్పకుండా పంపించుకున్నారుగా."

"ఇందులో రహస్య మేముంది ? క్లబ్బువారు హాస్పిటల్ డాక్టర్ల నందర్నీ ఆహ్వానించారు."

"యేమంది, సంగీతం మెచ్చుకుందా?"

"ఆహా...చివర్లో వచ్చింది, వినలేదుట"

"ఇంకా? "

"ఇంకేం లేదు"

భుజంమీద చెయ్యి తొలగించి లోపలికెళ్ళి మంచం మీద పరుంది కామాక్షి—వెనకాలే వెళ్ళాడు.

"ఎందుకు కోపం ?"

"నాకేం కోపం లేదు"

అని లేచి, వచ్చే కన్నీటిని కొంగుతో నిలుపుకుంటూ వంటింటివేపు వెళ్ళింది కామాక్షి.

ప్రసాదుకి ఏమీ అర్థంకాలేదు. ఆడది ఎందుకేడుస్తుంది ? ఏదైనా అవాంతరం జరిగి, ఆపదొస్తే, ఎవరికయినా జబ్బుచేస్తే, అపచారం జరి జరిగితే— ఏడవడం అతనికి తెలుసు. ఎన్నో అర్థంకావతనికి. వాటిల్లో

మర్నాడు దోవ కనుక్కొని శోభాసుందరింటికి వెళ్ళేసరికి ఆరు దాటింది. గుమ్మందాటి లోనికి ఆహ్వానించింది ప్రసాదుని.

"ఆమె రాలేదా ?"

తల పకించాడు.

"మీకోసం ఐదింటినుంచి వెయిట్ చేస్తున్నాం—కొందరు ఫ్రెండ్స్‌ని కూడా పిలిచాను. ఇప్పుడిప్పుడే వెళ్ళారు— యింక మీరు రారనే నిశ్చయం చేసుకున్నాన్నాండి"

"క్షమించాలి. ఆ వీధినీ, ఈ వీధినీ చెప్పడం అలా వెళ్ళడం తీరా మీ ఇల్లు కాకపోవడం— చటుక్కున పట్టుకోలేకపోయ్యాను. అదే ఆలస్యం."

వరండా ముందు పూలమొక్కలున్నాయి. క్రింద సమంగా కోసిన

గడ్డి, నాలుగయిదు కుర్చీలున్నాయి — బల్లమీద టీ సరంజాం, ఇద్దరూ కూర్చున్నారు.

"ఉండండి— క్షణంలో వసాను— టీయా? కాఫీయా ?"

"ఏదైనా సరే"

"ఆమె లోనికెళ్ళింది— నల్లరంగు పల్చటి చీర, సన్నని గులాబి బోర్డర్ తెల్లటి జాకెటు— చేతికి వాచ్, రెండు జడలు— మెళ్ళో నగలే లేవు—ం— ముత్యాలదండ పమిట క్రింద కదలడం చూశాడు.

వరండా ముందు దీపం వెలిగింది. శోభాసుందరి కొన్ని కప్పులు ప్లేట్లు టీపాట్ తెచ్చి బల్ల మీద పెట్టింది.

"తీసుకోండి"

అతను తింటున్నాడు.

"మీరో..."

"అయిందిగా— కంపెనీకోసం సెకండ్ డోస్... ఆల్ రైట్" పాట్‌లో టీ కప్పులో పోసుకుంది— సంభాషణలు సాగటంలేదు.

"మీ రొచ్చి ఎంతకాలమైంది?"

"నెలేగా"

"అవునవును— రంగనాయకమ్మ చెప్పింది" అన్నాడు ప్రసాదు.

"కామాక్షిగార్ని చూడాలని పట్టుపట్టిందామె. విట్టీ లేడీ— భలే కబుర్లు చెబుతుంది. నన్ను కామాక్షనుకుని రైల్లో పలకరించిన ఇన్సిడెంట్ చెప్పే వుంటుంది కదూ—"

శోభాసుందరి నవ్వు, తెల్లటి నీడలో ఉదయించడానికి బద్ధకిస్తున్న లేత సూర్యబింబంలా మెరిసింది. ఆ రోజ్ కలర్ చిగుళ్ళు కాస్త కనబడటం, ఆ నవ్వులో ప్రత్యేకమైన అందం జుట్టు నీడ నుదుటిమీదా, ముక్కునీడ గడ్డంపైన, నవ్వుకి వంగిన బుగ్గలు నీడ పెదవులపైన, స్థనాలనీడ ఒళ్ళోనూ పడి,దేనికేసి పరీక్షగా చూడలేకపోతున్నాడు. అంతా కామాక్షే— కాస్తంత ఎదిగిన కామాక్షి— ఒక నిండుతనం ఆమెలో లేనిది గుండ్రని భుజాలు.

పదునైన చేతి వేళ్లు, సన్నగా పొడిగి ఒంపు తిరిగిన నడుంపై,

బింకంగా స్థూలంగా ఏమీటీ మదతలో మరుగుపడటం తెలిని వక్షం— మెడ కిందికి నునుపుగా జారిపోయిన—

అతని కాలు తగిలి బల్ల కదిలి— దానిమీద టీ పాట్ ఆమె వొళ్ళో పడింది. చివాలున లేచి టీ పాట్‌ని పట్టుకున్నాడు. టీకి తడిసి వేడెక్కిన తొడపై అతని చెయ్యిపడింది. దాన్ని తొలగిస్తూ దానిమీద ఆమె చెయ్యి పడింది. దీపం ఆరింది. ఇద్దరూ లేచారు.

"ఎవరది?— పిన్నీ— నువ్వేనా, దీపం తీసేస్తా!"

"అవును వెన్నెట్లో దీపం గిట్టదుగా నీకు" అన్నది దూరంగా పిన్ని కంఠం కాబోలు.

"వారున్నారని చెప్పానుగా."

"అవునే, మరిచా సుమా. వేస్తున్నా." దీపం వెలిగింది.

"సారీ—నే చూళ్ళేదు"

"ఫరవాలేదు, డ్రెస్ చేంజ్ చేసి వొస్తాను."

ఆమె లోపలి కెళ్ళింది.

అతను చందమామకేసి చూశాడు. మేఘాల వలలోంచి బైట పడింది. అస్పష్టమైన నీడలు పడుతున్నాయి చుట్టూ. వెన్నెలవలె అతని మనస్సు చల్లగావుంది— కాని ప్రశాంతంగాలేదు కామాక్షిని, ఈమెనీ ఒక్కసారి పోల్చిచూడాలి. కాని వారిద్దరూ కలియడం ఎట్లా? ఎప్పుడైనా శోభాసుందరిని తనింటికి పిలవాలి.

"ఈ చీర కట్టుకోవడం అంటె ఎట్లాగో వుంటుందండి" అందామె.

"ఏం?"

"మొన్న మీ ఇంటికొచ్చినప్పుడు, ఆమె ఈ రంగు చీరె వేసుకున్నారు. అప్పటినుంచీ భయంగానే ఉంది"

"భయమెందుకు?"

'అంటే' అని వాక్యం చివ్వర చేర్చలేకపోతున్నాడు ప్రసాదు. అలా అనాలని అనిపించడంలేదు.

"మీ ముందు మరీ అదోలా వుంటుంది. ఐదారు పర్యాయాలు జరిగింది— కామాక్షి అనుకొని నన్ను పలకరించడం— కాదని నేను చెప్పడమూ. మిమ్మల్ని గురించి విన్నాను. మీరు గాయకులట, అప్పటి

నుండి మిమ్మల్ని ఆమెనీ చూడాలని ఉండేది. ఈ ఊరొచ్చాక అది వీలైంది."

"డిసప్పాయింట్ అయ్యారా?"

"ఏమో— నేనా విషయం ఆలోచించలా. ఆమెలా నే వున్నానీ అనుకోవడంలేదు— వారూ వీరూ అంటే తప్ప. ఆవిడవి చాలా అందమైన కళ్ళు మంచిఛాయ— పెద్ద జడ— ఆ మధ్య జబ్బుచేసి నా జడ వూడి పొయిందనుకోండి. మీ కేమనిపిస్తోంది! అడగొచ్చా?"

"నాకూ ఎల్లాగోవుంది. కాస్తంత పోలిక వున్నమాట నిజమే. కాని— మీ దగ్గర, ఇప్పుడున్నట్లు చూస్తే— ఆమె జ్ఞాపకం— అంటే ఆమెని చూస్తోన్నట్లు అనిపించడంలేదు"

ఆమె తలకాస్త పక్కకివొంచి నవ్వింది. అల్లావొంచి నవ్వటం అలవాటు కాబోలు. అల్లా నవ్వినప్పుడే ఆ పళ్ళ చక్కదనం, అతన్ని కలవరపెడుతోంది. ఏ వస్తువుకేసి కేంద్రీకరించి చూడకుండా, పరధ్యానంగా చూచినపుడు— రెండుపాపలు, మధ్యకిరాక కదలడంవల్ల కాబోలు, కామాక్షి మెల్లని విమర్శించింది. ఆ విమర్శకి కళ్లులేవు— మళ్ళా ఆమె కళ్ళల్లోకి చూచాడు ఆమె తల వంచుకుంది. కామాక్షి కళ్ళే అందమైనవి— ఈమె కళ్ళల్లోలేని ఒక వెలుగు, ఆమె కళ్ళల్లోవుంది ఒప్పుకోవాలి. కళ్ళు బాగుండగానే సరికాదు. వాటిని విని యోగించడంలో వుంటుంది అందం. ఆ నేర్పు; ఆ మెళుకువ, శోభాసుందరిలో వున్నాయి. ఆలయంలో స్తంభంమీద చెక్కిన ప్రాచీన శిల్పంలా, స్థబ్దుగావుంటే, శిల్పికి నచ్చొచ్చు. కామాక్షి అట్లాంటిది. కదలిక, సజీవమైన ఒక ఒయ్యారం, లాలన, అవున్నాయి శోభలో.

"కారణం చెప్పమంటారా?"

ఉలిక్కి పడ్డాడు ప్రసాదు.

"మీరు రోజూ చూస్తూ, ఎరుగున్న భార్య కావడమే— నేను దూరపుకొండను... అవునా?"

"మీ రెట్లా గ్రహించారు?"

"నా మొహం గ్రహింపు ఊహ. కొన్ని సందర్భాలలో అవతల

వారి మనస్సులో ఏముందో ఇట్టె తెలిసిపోయి నట్లనిపిస్తుంది. కామాక్షి చాలా చక్కనిది..."

"ఊరికే అందంగా వుండడం చాలదనుకుంటా. ఆ అందాన్ని— ఎల్లా చెప్పాలో తెలియదు— సరిగ్గా వినియోగించడంలో పోనీ, ప్రయోగించ డంలోనూ వుంది-కవి మామూలు పదాలనే అందంగా ప్రయోగిస్తాడు... ఏమో గంద్రగోళంగావుంది...మరి నే వెళ్ళనా..."

లేచాడు.

"అప్పుడే మీ సంగీతం వినాలను కున్నాను, సాయంత్రం స్నేహితులనుకూడా అందుకే ఆహ్వానించాను..."

"మరో అవకాశం వుందంటారా!"

"అది మీరు చెప్పాలి. నాకేం నేను ఎప్పుడుపడితే అప్పుడు సిద్ధమే...ఉండండి, అక్కడిదాకా వస్తాను."

ఇద్దరూ లేచారు. ఆమె లోపలి కెళ్ళింది. ప్రసాదు మండువాలో కొచ్చి, గదులు, ఇల్లుపరకాయిస్తున్నాడు. ముందుగది తలుపుమీద చెయ్యి ఆనించి నిలబడ్డాడు. ఎవరో చటుక్కున తలుపు మూసారు లోపలినుండి. ఆ రెండు తలుపుల మధ్య వేలునలిగి, నెప్పి సూచిస్తూ కేకవేశాడు హరిప్రసాదు. శోభాసుందరి బైటకొచ్చింది, ఏమిటంటూ.

"ఏంలేదు— తలుపుసందులో వేలు నలిగింది..."

"మా పిన్ని వేసిందేమో తలుపు. ఆమెకి మా చెడ్డ భయం. దీపాలు తీసెయ్యడం, తలుపులు ముయ్యడం అంటే మహాఇష్టం. ఉండండి డాక్టర్నిగా... చిన్న బాండేజ్ వేస్తాను...."

లోపల్నించి సీసాలు, కత్తెర, బాండేజ్ క్లాత్ ఇచ్చి, ఆతని వేలుకి కట్టుకట్టింది. ఇద్దరూ బయటికి నడిచారు.

ఆమె ముందుగా నడుస్తున్నప్పుడు, అతను ఒకడుగు వెనకపడి నడుస్తున్నాడు. అతను ముందుగా నడుస్తున్నప్పుడు ఆమె ఒకడుగు వెనక పడి నడుస్తోంది. సంభాషణలేదు. రోడ్డ పక్క చెట్ల ఆకుల గుసగుసలు తప్ప చెట్ల నీడలమధ్య దాగిలి మూత లాడుతున్న వెన్నెలకాంతుల మీద కాలుపడాలన్న వారినడక వంకరటింకరగా సాగి రోడ్డువిడిచేసి, కాలిబాట గుండా రాళ్ళ గుట్టల కాపలా మధ్య పచ్చదనం కాపాడుకున్న పచ్చిక

బయలికి చేరుకున్నారు. రాతిగుట్టల నీడలు గుండ్రంగా వారి కాళ్ళమీద పడుతున్నాయి.

"ఎందుకంత వగరుస్తున్నారు? ఆయాసమా అమ్మ—నాకూ ఆయాసంగానే వుంది" అని శోభాసుందరి పైన కప్పుకున్న మప్లర్‌తో మొహం తుడుచుకుంటోంది.

"ఆయాసంకాదు. మీతో నడుస్తుంటే ఏదో ఎక్సైట్‌మెంట్".

"ఓయబ్బ, ఎందుకో."

"చెప్పలేను. ఇదొక కొత్త అనుభవం. మీలో ఏదో వుంది. అది నన్నిల్లా చేస్తుందేమో. ఆరోజు కచ్చేరిలో కళ్ళు తెరిచి మిమ్మల్ని చూడగానే, ఇంక పాడలేక, ముగించి వేశాను. సిగ్గా? కాదు. పాడేటప్పుడు, నా ముఖం ఎట్లాగో అవుతుంది—అదిచూసి మీ రేమనుకుంటారో అనీ? ఏమో!" ప్రసాదు రాతి బండమీద కూర్చుని ఆమె మొహం నీడగా సాగారి మరో రాతిబండ మీద కదలడం చూస్తూ కూర్చున్నాడు.

"నాలో ఏమీ లేదు— చాలా సామాన్యురాల్ని. కామాక్షిగారు ఎంతో అందంగా వుంటారు. ఈ మెడిసిన్ చదువులో ఏముందో తెలీదు. మనిషి శరీరంపట్ల కుతూహలంగాని, అభిమానంగాని వుండదు. అందచందాల ప్రస్తావన వచ్చినప్పుడు నవ్వొస్తుంది. అద్దంలో చూసుకుంటే అస్థిపంజరమే కనిపిస్తుంది" అన్నదామె.

"నా కట్లా కాదు. మూలపడి, బూజుకట్టి పాతదయిన మనస్సు మిమ్మల్ని చూశాక, ఎక్కడికో ఎగిరిపడుతోందంటె నమ్ముతారా?"— ఆమె నవ్వుతోంది.

"నాకు మనస్సుతో పరిచయంలేదు. ఎన్నోసార్లు శరీరాలని కోశాం— మనస్సు కనబలేదు."

"అట్లాంటి అభిప్రాయాలు మీలో కలిగాయంటే అందుకు కారణం మనస్సు కాదంటారా? రోత పుట్టించినట్లే, మనస్సు ప్రేమను కూడా పుట్టించడం అసహజం అంటారా?

"ఆమాటకొస్తే వాదేశారా?"

ఆమె కళ్ళల్లోబాధ, అలకా కూడా కనిపించాయతనికి. తల వంచి, మేఘం వెనక మరుగుపడ్డ చందమామని చూస్తూంది.

"ఏదేనా తప్పుగా అన్నానా ?

ఆమె చెయ్యి పట్టుకున్నాడు ప్రసాదు. చేతినిలిసి తన రెండు అర చేతులమధ్యా వుంచి చటుక్కున తోసేసింది. మఫ్లర్ జుట్టుమీదకి లాగి మడిచి కట్టింది. అతని చెయ్యి ఆమె గడ్డంమీద పడింది. మెత్తగా తగిలింది. చల్లగా కింద పెదవి కిందికి లాగినప్పుడు— లేతచిగుళ్ళు మనిషి కంట బడని గులాబీలో లేత ఎరుపుతో మెరిసాయి. తల అటు తిప్పేసింది.

"మీరేమీ తప్పుగా అనలేదు. నాకు తెలీదు ప్రేమంటే— నా జీవితంలో అదిలేదు" తన వెంపు తిప్పుకున్నాడు ఆమె మొహాన్ని. ఆమె కళ్ళల్లో కన్నీరు ఒక తెరలా, చందమామ మీద నల్లమేఘం పొరలా కదులుతోంది.

"అడగొచ్చా — ఎందుకో ?"

"నేను చెప్పలేను"

"సరే, వెళదాం లేవండి"

తనచేతిని లేవడానికి ఊతగా ఇచ్చాడు. ఆమె లేచింది— మెల్లగా నడుస్తున్నారు.

"పోనీ ఇప్పుడుందంటే, స్వీకరించేటందుకు సిద్ధంగా వున్నారా ?"

"మీరా ప్రశ్న అడగనే కూడదు. నేను చెప్పే స్థితిలో లేను ? ఇంటి దగ్గర కామాక్షి..." ఆమె వాక్యం పూర్తికాకుండానే— అందు కున్నాడు ప్రసాదు.

"అవును మనిద్దరిమధ్యన కామాక్షి నీడ పడుతోంది"

"అదొక్క నీడేకాదు."

"అంటే ? నే నడక్కూడదు కాబోలు"

"మెయిన్ రోడ్ మీద కొచ్చేశారు. చెట్లనీడల మీద పాదాలుపడేటట్లు నడుస్తున్నారు.

"రంగనాయకమ్మగారు మీ కన్నీ చెప్పే ఉంటారు."

"నాకేమీ చెప్పలేదు. ఏముందని చెప్పడానికి ?"

ఆమె నవ్వుతోంది.

"చూశారా, ఇద్దరికీ మతుల్లేవు. అటు వెళ్ళడంబదులు ఇటొచ్చాం— తిన్నగా తిరిగి మా ఇంటికి..."

ప్రసాదు నవ్వుతున్నాడు ఆలోచనలో, ఎక్సైట్‌మెంటులో ఎటు నడుస్తున్నారో తెలిసిందికాదు.

"ఫరవాలేదు లెండి— మిమ్మల్ని మీ ఇంటి దగ్గర భద్రంగా విడిచేసి వెడతాను.

"అవును, నేను మిమ్మల్ని మీ యింటిదాకా సాగనంపుతాను. అక్కడనుండి నన్ను సాగనంపడానికి మీరు నాతో మా యింటిదాకా వస్తారు. ఇల్లా తెల్లవార్లు తిరుగుతూందాం..."

ఆమె లోపలికెళ్ళింది. పిన్ని కాబోలు గట్టిగా గడియ వేసిన చప్పుడైంది. ప్రసాద్ ఇంటికి చేరుకునేటప్పటికి రాత్రి పదైంది.

ఆనాటినుండి ప్రసాదుకి భార్య కొత్తగా కనబడసాగింది. ఏడేళ్లుగా, రోజూ ఎరుగున్న భార్యే తలవంచి చూచినప్పుడు, బాహాటంగా నవ్వినప్పుడు చిగుళ్ళ ఎఱుపు, బుగ్గ వంపు—ఇవన్నీ కొత్తగా వున్నాయి. ఆలయంలో శిలాప్రతిమ కదలినట్లు అయింది శిలాప్రతిమ సంతానం కనదు. కామాక్షి అంతే; వైద్యం అయింది; తీర్థయాత్రలయ్యాయి; మొక్కుబడులు చెల్లించడం అయింది. జాతకంలో నలుగురు సంతానం వున్నా, ఇంతవరకూ ఆ చిహ్నాలేలేవు. తన మాటేమిటి? పరీక్షలు చేయించుకున్నాడా? తోటివారు ఆ లోటుకి బాధ్యత భార్యమీదే వేస్తారు. మొగజన్మకి యీ సమాజంలో ఆమాత్రం పలుకుబడుంది.

తొమ్మిదింటికి చంద్రుడుదయించాడు — క్రాఫింగ్ చేసుకున్నవాడిలా పౌర్ణమివెళ్ళిన నాలుగోనాడు డాబా మీద పూలదండ కడుతోంది కామాక్షి. ఉదయం తలంటుపోసుకున్న వెంట్రుకలు జారి మెడంతా కమ్మేశాయి. గాలికి చీరపమిటి వక్షంమీద ఎగిరిపడుతోంది. వెనకాల నిలబడి, ఆమెతల తనవైపు తిప్పుకున్నాడు హరిప్రసాద్. కళ్ళల్లోకి చూశాడు.

"కాటికి కరిగిపోయిన నలుపు కాదుస్మా—"

"ఉండండి —" తోసేసి దూరంగా జరిగింది కామాక్షి.

"వెయ్యిరెట్లు అందమయిన కళ్లు నీవి."

"అంటే ?"

"అదే, ఆమెకంటె ఎంతో అందమయినదానవు"

"ఇప్పుడు తెలుసుకున్నారా ?"

"సత్యాలన్నీ పాతవేనట. వాటిని సుళ్ళా స్మరించుకునే పరిస్థితి ఏర్పడి, అవకాశం రావాలంటారు ..." ఆమె మొహాన్ని దగ్గరగా తీసుకొంటున్నాడు.

"ఏమిటిదంతా—ఇవాళ—మరోపార్టీలో ఏమన్నా పుచ్చుకున్నారా — అదే—ఆ లోకైకసుందరి—శోభాసుందరి పార్టీలో."

"అదేమిటి, శోభాసుందరి పార్టీ ఏమిటి ?"

"దాస్తేమాత్రం దాగుతుందా. ఆ మధ్య పార్టీకని వాళ్ళింటికి వెళ్ళారుటగా, ఇందిర చెల్లెల్నికూడా పిల్చిందట— వాళ్ళంతా వెళ్ళిపోయింతర్వాత మీరు వెళ్ళి—ఏకాంతంగా కష్టంసుఖం చెప్పుకున్నారట"

"ఏకాంతంగా వుంటే ఏం చెప్పుకున్నది వాళ్ళకేం తెలుసు ? అసలు విషయం చెప్పనా ? మనిద్దర్నీ ఆహ్వానించింది, నా పాట వినాలని. ఇల్లువయసం తెలుసుకుని, నిన్ను తెసుకెడదామని వెళ్ళాను. కనుక్కుని అక్కడకు చేరేసరికి పొద్దుపోయింది వాళ్ళంతా వెళ్ళిపోయారు. ప్రసాద్‌కి ఆమెపై కోపం వచ్చింది—తనీ అబద్ధాలు చెప్పడానికి ఆమె అల్లాంటి తిక మక ప్రశ్న వేసినందుకు, అసూయ — ప్రకటన వొక నటనగా అప్పుడప్పుడు ముద్దుగా వుంటుందతనికి. కాని నిజంగా అసూయ, వేళ్ళేసుకుని భూమిలో పాతుకుపోతే ఆ చెట్టుకింద నిలబడలేడతను"

"అవును, ఆ రాత్రి ఇంటికి అర్ధరాత్రొచ్చారుగా..."

"అర్ధరాత్రా-పదికూడా అవందే—"

"ఏ మేం చెప్పుకున్నారో"

"తెలుసుకున్నావుగా—కష్టం సుఖం..."

లేచి అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు.

"ఇటుచూడు" చేతులమధ్య ఆమె మొహం తీసుకుని "ఏం చెప్పిందో చెప్పనా? ఆమెకంటె నువ్వెంతో చక్కని దానివట. తను జీవితంతో... నువ్వు వినడం లేదుగా—చెప్పను..."

పూలదండ జడలోంచి జారింది. గాలికి పమిట లేచింది. అతని మొహం ఆమె వక్షంలో దాచుకున్నాడు.

"ఇంక నే నెందుకు — మా ఊరు వెళ్ళిపోతాను." అంటూంది.

"ఈ క్షణం నిన్నెంతగా ప్రేమిస్తున్నానో నువ్వెరగవు. ఆమెతో మాట్లాడినంతసేపు ఆమెలో నిన్ను చూసి నే నెరగని నిన్ను చూసి—"

ఆమె అతని తల నిమురుతోంది. కన్నీటిబిందువు నుదిటిమీద పడింది.

"ఏదో జరిగింది—మీ ధోరణే వేరుగావుంది. నేను ఊహించలేనా..."

"ఏమీ జరగలేదు—ఆమెద్వారా నిన్ను తెలుసుకొన్నాను. నీ కది అర్థంకాదు—నీ కన్నీరు నా కర్థం కానట్లు..."

చంద్రుణ్ణిమేఘం కప్పివేసింది, ఆమెచీరకొంగు అతని మొహాన్ని కప్పివేసినట్లు.

o o o

భర్తలో మార్పుకి కామాక్షి తట్టుకుంది. హర్షించింది. అసూయగా ప్రకటించినా...అతనిమీద కొత్త అధికారం సంపాదించుకుంది. అతని ద్వారా ఆమెనుకూడా లోబరచుకున్నట్లుంది. అది ఆమెకు కొత్త అనుభవం...భర్త వుండగా ఆమెతో కలసి మాటాడాలనుకొంది. విజయం తనదయినట్లు ఆమెకి తెలుస్తే చాలు. ఒకమారు స్నేహితుల ఇంట్లో పార్టీకి ప్రసాద్ తనూ వెళ్ళినప్పుడు, శోభాసుందరి కూడా వొచ్చింది.

కాని వారు ముగ్గురూ విడిగా మాట్లాడుకునే అవకాశం రాలేదు. వారిద్దరిమధ్య చూపుల పరామర్శ తను గమనించి బాధపడింది. మొగాళ్ళను నమ్మకూడదు. పురుషుడు తన అవసరంకోసం ఎంత ప్రేమయినా ప్రకటించగలడు, తనని నిజంగా ప్రేమిస్తున్నాడా, లేక తను అనుమానపడకుండా, ఇదంతా తెచ్చిపెట్టుకున్న ప్రకర్షా ? పైగా ప్రతివాడూ ఆడదాన్ని నమ్మకూడదంటాడు. ఇంకెప్పుడూ తను ఇట్లా రాకూడదని నిశ్చయించుకొంది,

ఆ నెలంతా కొత్త కేస్ హడావిడిలో గడిపాడు ప్రసాద్. విద్యాసాగర్ ఆస్థిదావా పెద్దవ్యవహారం. పెద్దప్లీడరు మాణిక్యాలరావు చేతిలో పడింది ఆ వ్యవహారం. మాణిక్యాలరావు దగ్గర ప్రసాదు జూనియర్‌గా పనిచేస్తున్నాడు. పార్టీలు ఆ సాయంత్రం ఊరెడుతుంటే సాగనంపడానికి తానూ స్టేషన్ కెళ్ళాడు.

సంధ్య కాటుకెట్టుకున్నట్టు చీకటి కమ్మింది. భూతద్దంలో చూసి నట్లు ప్లాట్‌ఫారం లైట్లు ఎబ్బెట్టుగా ఉన్నాయి. ఏదో బండి రావాలిట— మరో గంటకుగాని రైలు కదలదట. అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు ప్రసాదు. రిస్టువాచి చూశాడు. ఏడు దాటింది. ఇంకా నలభై నిమిషాలుంది. విద్యాసాగర్ తాలూకు జనం గార్డు పెట్టెముందు మూగారు. వారితో ప్రసంగిస్తున్నాడు. మరో పది నిమిషాలు గడిచింది. పేలిన తారాజువ్వలా ప్లాట్‌ఫారం జనం రేగారు ఎందుకో— ఏమీలేదు— వొకడు కదిలితే అంతాకదలడమే. దాహంగావుంది. కూల్‌డ్రింక్స్ కోసం ఇంజన్‌వైపు నడుస్తున్నాడు.

ఇంజన్ ఇవతల పెట్టెకో లేడీస్ కంపార్టుమెంటుంది. దీపం వెలుగులో శోభాసుందరి కళ్ళు మెరుస్తున్నాయి.

"మీరా... మీరు?"

"ఆ, నేనే— మీరు?"

ఇద్దరూ నవ్వుతున్నారు.

"ఫ్రెండ్సు వెడుతుంటే... వచ్చాను. మీరు?"

"ఇంటి కెడుతున్నా— రెండు నెలలపాటు" అన్నదామె.

"రెండు నెలలే. నాతో చెప్పకూడదూ?"

"ముందుగా అనుకోలేదు వెళ్ళాల్సినపరిస్థితి వచ్చింది. మా బాబయ్య వంట్లో బాగాలేదు..."

అతని మొహంలో దిగులు చూసింది.

"దగ్గరలో ఒక ఊళ్ళో ఉన్నామంటే ధైర్యంగా నిబ్బరంగా ఉండేది— చప్పున రండేం..."

కంపార్టుమెంటులో ఫాన్ తిరగడంలేదు. లోపల ఉక్కగా ఉందని బైటకి దిగింది శోభాసుందరి. ఇంజన్‌వైపు నడుస్తున్నారిద్దరూ. డ్రైవర్ పచార్లు చేస్తూ సిగరెట్టు కాలుస్తున్నాడు. ఇంజన్ దాటి ముందుగా పట్టాలు పక్కగా వెడుతున్నారు. అక్కడంతా బొగ్గు, నుసి, రేగడి— గలీజుగా వుంది. ఇంకా దూరంగా పట్టాలు దాటి, గుట్టదగ్గర నిలబడ్డారు.

"ఫరవాలేదు. ఇంకా ఇరవైఅయిదు నిమిషాలుందిలెండి" అన్నాడు.

బండిలో పిన్ని ఒక్కత్తే వెళ్ళిపోతుంది. మీరేమో మీ ఇంటి కెడతారు. నేనొక్కదాన్నీ దిగడిపోతాను కదూ!" నవ్వుతూంది శోభాసుందరి.

చీరకొంగు జడచుట్టూ కప్పి, గాలికి జుట్టు రేగకుండా అదుముకుంటోంది. చీకటిగా ఉంది. చీకటి నీడలులేవు. రెక్కలు తెగిన పక్షికిమల్లె సిగ్నల్ కనబడుతోంది.

"నన్ను గురించి అంతే అభిప్రాయమా?" అన్నాడు.

"మీకు భార్య ఉంది."

"ఉన్నప్పుడు మరొకరిని ప్రేమించడం సాధ్యం కాదంటారా?"

"నాకు తెలియదు— చెప్పండి."

"ఏమిటో శోభా— ఒక్కొక్కసారి మాటలనవసరం. ఏమీ చెప్పకోకుండా అంతా తెలిసినట్లవుతుంది. ఇప్పుడు నా కల్లా ఉంది" అని ప్రసాదు లేచి, కాలువంచి దానిమీద చెయ్యి ఆనించాడు.

"నాకు తెలుసులెండి."

చెయ్యి తీసుకుంది.

"ఏం తెలుసు?"

"ఏమీ తెలియదని" నవ్వుతోంది.

చేతిని తన బుగ్గకి రాస్తోంది. రెండుచేతులూ ఆమె మెడచుట్టూ వేశాడు.

నన్ను ఆమెగా భావించికదా, మీకు నామీద ఇంతటి కారుణ్యం?"

"ఆమెని మిమ్మల్నిగా భావించి, ఆమెపై కారుణ్యం అంటే నమ్ముతారా?"

"అది మీకే తెలియాలి."

చేతులు తొలిగించి దూరంగా వెళ్ళి కూర్చుంది.

"నే నేమీ కోరడంలేదు సుందరి."

ఆమె మాట్లాడదు. తలవంచుకుంది. చీకట్లో కన్నీరా? అతనికి కనబడ్డంలేదు. తల పైకెత్తాడు. నుదిటిని అధరంతో తాకాడు.

'అమ్మయ్య' అని లేచి మొహం తుడుచుకుంది.

"ఏం జరిగింది?"

"ఒక భూకంపంనుండి తప్పించుకున్నాను- మీరామాట అన దంతో. మీరు కోరరు- కోరినా నే నివ్వలేను రంగనాయకమ్మ చెప్పలేదా? నాకు వివాహమైంది. ఎనిమిదేళ్ళయింది. అప్పుడు నా వయస్సు ఇరవై యొక్కటి. తల్లి, తండ్రి చిన్నప్పుడే పొయ్యారు. బాబయ్య చదువు చెప్పిస్తున్నాడు. ఇరవైవేలు కట్నం వొప్పుకుని, పదే ఇచ్చాడు. మిగతా డబ్బుతో నా మెడిసిన్ పూర్తి చెయ్యమంటాడు. తనకి జబ్బుచేస్తే చూసేం దుకుట. నా భర్త స్కూల్ ఫైనల్ ఫేలయ్యాడు. నే చదవడానికి వీల్లే దన్నాడు. ఏడాదిలో విడిచేశాడు. ఇంక పదినిమిషాలే ఉంది.

"వెడదామా?"

రైలువైపుకి నడుస్తున్నారు.

"మిమ్మల్ని విడిచేసిన మనిషున్నాడంటే, సృష్టి వైచిత్రికి ఆశ్చర్య పడాలి."

"ఎందరెందరో ప్రొఫెసర్లు నా స్నేహం కోరారు. వివాహం అయిందీ అని తెలియగానే దగ్గర స్నేహానికి సాహసించలేదు-మీలాగనే"

ఇంజన్ దగ్గర కొచ్చేశారు. డ్రైవర్ లోపలికెళ్ళి కూత వేయిం చాడు. చీదిన తూటాలా, ప్లాట్‌ఫారం జనం పెట్టెలముందు మూగారు. దీపంచుట్టూ కోటి కీటకాలు మూగాయి. ఆమె పెట్టెలో కెక్కింది... అతను కిటికీమీద చెయ్యి ఆనించాడు. చేతిని అభయమిస్తున్నట్లుగా వేళ్ళతో స్పర్శిస్తోంది.

ఎడబాటు శరీరాలకే- మనసులకి కాదు కదా" అన్నాడు ప్రసాదు మెల్లగా.

ఆమె కళ్ళలో నీరు, కరిగి ద్రవమైన గాజుని గొట్టంలోంచి ఊదగా

పడిన బొట్టువలె, వొక్కటై, సాంద్రత తెచ్చుకుని, అతని చేతిమీద పడింది.

"మనస్సులకే ఎడబాటు. అదే ట్రాజెడి."

మరోసారి కూసి, కదిలింది రైలు. ఓపికలేని ఆవులింతలా ప్రసాదు దిగడిపొయ్యాడు. ఏవేవో తలలు, చేతులు, కాళ్ళు, నీడలు, దీపాలు, రంగులు, నవ్వులు, ఏడ్పులు– మనస్సు దిగవిడిచి సాగిపోతున్న శరీరాలు అతనిముందు నుంచి కదిలాయి.

రెండు నెలలు గడిచినై. హరిప్రసాదు విద్యాసాగర్ కేసు కాగితాలు చదివి నోట్సు తయారుచేయడంలో నిమగ్నుడయ్యాడు. సంగీత సాధనకి వ్యవధి వుండడంలేదు. రెండు మూడు వాయిదాలకి, మాణిక్యాల రావుతో కలిసి కోర్టులో హాజరయ్యాడు. ఊరునుంచి రైలు దిగి ఇంటి కొచ్చేటప్పటికి సాయంత్రం ఏడయింది. క్లయింటు విద్యాసాగర్ ధనికుడు. ప్రయాణాలకి కారు ఏర్పాటు చేశాడు.

ప్రసాదు లోపలికి రాగానే రంగనాయకమ్మ ఎదురయింది.

"శుభవార్త, ఏం బహుమానం యిస్తారు" ఉచితంగా కచ్చేరి చెయ్యడం మట్టుకు కాకుండా ?"

"ప్రస్తుతం జడ్జిగారికి జబ్బుచేసి కేసు వాయిదా పడటమే మాకా వాల్సిన శుభవార్త. కచ్చేరి చెయ్యకపోవడమే నా బహుమానం" అని నవ్వుతున్నాడు.

"ఘటికుడవే– ఏమోననుకున్నాను. ఊహించలేవా ఉండు...కాఫీ తీసుకొస్తాను. అమ్మాయిని పిలవకు..."

"ఏం ? జ్వరమా! డ్రయివర్‌కి కూడా కాస్త టీ ఇవ్వాలి."

"ఆమాత్రం ఊహించలేవు – ఇంతేటయ్యా... ఎన్నాళ్ళనుండి, ఏది కావాలని తపస్సు చేస్తున్నారో అది జరిగింది. నా మాట నమ్మకం

లేదుగా. ఆవిడ నోటంటే విందురుగాని రా అమ్మా...రా, శోభాసుందరీ... నువ్వు చెబితేకాని నమ్మడుట..."

"నిజం ?"

ప్రసాదు మొహం ఎర్రబడింది. శ్వాస వేగంగా వస్తూంది. శోభా సుందరి బయటకొచ్చింది. తెల్ల ఖద్దరు చీర, ఊదారంగు జాకెట్టు వేసుకుంది— జడ మెలితిప్పి కట్టింది. చేతులలో బాగ్ బల్లమీద పెట్టింది.

"ఎగ్జామిన్ చేశాను. రంగనాయకమ్మ చెప్పారుగా, నిజమే. మరి వెడతాను" బాగ్ తీసుకుని సర్దుకుంటోంది.

"నే చెప్పానా? వంటకి ఎవర్నైనా కుదుర్చు— అమ్మాయిని చెయ్యి నివ్వకు నేనూ వెళ్ళనా?" అని లేచింది రంగనాయకమ్మ.

"కారులో దింపనా, మీరూ రండి" అన్నాడు శోభాసుందరినుద్దేశించి. ముగ్గురూ కాఫీలు తీసుకున్నారు. డ్రయివర్‌కి టీ తెచ్చింది రంగనాయకమ్మ. ప్రసాదు వెనకాల గదిలోకొచ్చి మంచంమీద పరున్న కామాక్షిని క్షణం చూచి నవ్వుతూ వచ్చి కారులో ఎక్కాడు. ముగ్గురూ బయలుదేరారు. "ముందు మా ఇంటికే" అన్నది రంగనాయకమ్మ. "ఆలస్యానికి వీల్లేదు— రేపే ఇవ్వాలి వాకపార్టీ— ఏమండీ శోభాసుందరిగారూ, అవునంటారా?" ఆమె నవ్వుతోంది. ఏమీ మాట్లాడదు. రంగనాయకమ్మ ఇంటివద్ద కారు నిలిచింది— ఆమె దిగింది.

"మా ఇంట్లో కాసేపు కూర్చోరు?"

"మరో మారొస్తాను. కేసు గొడవ, ప్రయాణం బడలిక..."

"శుభవార్తకి పట్టరాని సంతోషం— ఆందోళన... సరె."

ఆమె లోనికి వెళ్ళింది. కారు శోభాసుందరి యింటికి వెళ్ళింది. నిలిచింది— ఇద్దరూ దిగారు.

"థాంక్స్" అని శోభాసుందరి లోపలికి వెళ్ళబోతూంది.

"ఉండగనీ, నేనలా చెప్పుకోవాలి థాంక్స్. వారు వెయిట్ చేస్తూ వుంటారేమో- నువ్వెళ్ళిపో. నేను తరువాత ఇంటికెడతాలె" అన్నాడు ప్రసాదు డ్రయివర్‌తో. కారు కదిలింది.

ఇద్దరూ లోనికి వెళ్ళారు. బయట కుర్చీలు లేవు. మండువా గదిలో కుర్చీ అమర్చి కూర్చోమంది.

ఎవ్వరూ యేమీ మాట్లాడటం లేదు.

"ఈ పత్రిక చూస్తూ వుండండి' అని లోపలికెళ్ళి, మరో చీర ధరించి వచ్చింది శోభాసుందరి.

"మీ బాబయ్య కెట్లా వుంది?"

"చాలా నయం"

"మీ పిన్ని..."

"అక్కడే వుంది..."

"ఉత్తరం వ్రాస్తారనుకున్నాను"

"మీరు వ్రాస్తారేమోనని నేనూ అనుకున్నాను..."

"అనుకోడం చాలు"

"ఓ యబ్బ! మహామృదువుగా అబద్దాలాడగలరులెండి."

"అబద్ధమా?"

ఆమె చేతిని తీసుకున్నాడు.

"చేతిని గుండెలమీద పెట్టుకోడం చిన్నప్పుడు ఆటగా ఎరుగుదును."

"మీరు చెప్పనక్కరలేదు. మాటలతో నిమిత్తం లేకుండానే బుజావు చేశారుగా..."

చెయ్యి తొలిగించి బైట కొచ్చింది. మెట్లమీద కూర్చుంది. చూడు నీడ నుదుటిమీద పడుతోంది.

"అంటే ? చూరు నా జీవితంలో ప్రవేశించకపోతే అది జరిగేదే కాదంటే నమ్మతారా ? నేను మరిచిపోలేదు మీ తన్నమాట. శరీరాలు విడిపోవడం కాదు— మనస్సులు విడిపోవడం, ట్రాజెడీ—అని..."

"మన సిక్కడా, శరీరం అక్కడా అనుకోమంటారా"

"ఇంత చొరవగా అనగలిగేరంటే, నాలో ఏదో లోటుండాలి."

"కోపమా? నేననకూడదు నాకే అధికారమూలేదు. నాకేమీ తెలీదు— అనుభవం లేదు క్షమించండి"."

ఆమె కళ్ళంట నీళ్ళు తిరుగుతున్నాయి. అతను దగ్గరగా వచ్చి ఆమె గడ్డం పట్టుకున్నాడు. తలని తన గుండెలమీద ఆనించాడు.

"మీకు నేనంటే నమ్మకం లేదా ? యేం కావాలి ?"

"జీవితంలో యేదైనా ఉన్నవారికి, ఇంకేమన్నా కావాలనిపిస్తుంది. మీకన్నీ ఉన్నాయి- మీరు సంగీత విద్వాంసులు; కామాక్షి భర్త, బోలెడు ప్రాక్టీసు, తండ్రి కాబోతున్నారు..."

"మీరిల్లా ఉంటే నే చూడలేను— వెళ్ళిపోతాను" అని లేచాడు ప్రసాదు.

"ఆలస్యమైంది— వెళ్ళండి. కామాక్షి కనిపెట్టుకొని ఉంటుంది." తనూ లేచింది బయటకి నడిచారు ఇదివరకు వెళ్ళిన తోవనే వెడుతున్నారు.

"నేను మీరనుకున్నంత ప్రముఖ వ్యక్తినిగాను. నేనో గొప్ప సంగీత విద్వాంసుడుగా పేరుపడలేదు. నాకేమీ ప్రాక్టీసులేదు—కాస్తోకూస్తో పెద్దలిచ్చిన ఆస్తి ఉందిగావున బండి నడుస్తోంది— ఇంక తండ్రి నంటారా సృష్టిచక్రం. దాన్ని కదిల్పింది మీరు. అది నిలిచిపోకుండా ఉండే భారం మీ మీదనే ఉంది..."

"అమ్మో— అంత భారమే. నాకు మీ జీవితంలో స్థానం లేదు. ఉండకూడని పరిస్థితి. చిన్నప్పుడు ఒక మేస్టరనేవాడు. కోర్టు, హాస్పిటల్

ఈ రెంటికి దూరంగావున్న వాళ్ళు ధన్యజీవులని. నా భర్తకి కోర్టుతప్పింది కాదు. నాకు హాస్పిటల్ తప్పింది కాదు. కదిలే చక్రంలో వేలు పెడితే, వేలు తెగడం, చక్రం విరగడం—రెండూ జరుగుతాయి. నేను రానన్నాను. రంగనాయకమ్మ చంపుకుతింటే కాదనలేక వొయ్యాను. వొచ్చి చూడమంది. పరీక్ష చేసాను కామాక్షిని. నిర్ధారణ అవగానే, ఎల్లాగో అయింది- నేనేదో అపచారం చేసినట్లు— పురుడు సమయంలో నేనిక్కడ ఉండను. ఉండకూడదు"

"ఎందుకు ?"

"ఉంటే నేను రాకతప్పదు. ఏదన్నా జరిగిందంటే నేనేదో చేశాననే జనం ఎందరో ఉంటారు సమాజంలో. ఇప్పటికే నేనే మొగుణ్ణి వదిలేశానని చెప్పుకొంటున్నారు. మా బాలయ్య అనేశాడు పెళ్ళి చెడిపోతే భార్యనీ: ప్రేమ చెడిపోతే భర్తనీ నిందిస్తుంది సంఘం—అని."

"మరి మీ జీవితం- ఎప్పుడూ ఇంతేనా—?"

"సమాజానికి చేతనయినంత సహాయం చెయ్యడమే నా ఆదర్శం— ఇంకేదీ కోరను. కోరితే, అది లభిస్తుంది— అది లభించిన మరుక్షణం, నా ఆదర్శనం నశిస్తుంది. ఈ క్షణం ఇక్కడతప్ప, వెనక్కి, ముందుకి చూడలేని, షెల్లీస్కైలార్క్‌లాగ" ఆమె కళ్ళంట నీళ్ళు కదుల్తున్నాయి. ప్రసాదు చీరకొంగుతో తుడుస్తున్నాడు. అప్రయత్నంగా ఆమె వక్షం మీద తల ఆనించాడు. అతని కళ్ళంట నీళ్ళు తిరుగుతున్నాయి.

"నేను— నేను మిమ్మల్ని విడిచి ఉండలేను..."

"ఉన్నారు ఉండాలి. మనిషి శరీరం పట్ల నాకు గౌరవము లేదు. మనస్సంటే నమ్మకంలేదు. ఈనాడు నాకో మనస్సంటూ కల్పించారు. అది ఏడుస్తోంది. బరువు తగ్గిపోయింది. దాన్ని మీరు తీసుకుపోండి. పుట్టబోయే సంతానానిక్కావాలి" లేచింది. ఆమె ఇంటివైపు నడుస్తున్నాడు.

గుమ్మం దగ్గరకి చేరుకున్నారు. నక్షత్రాలకిమల్లె మెరుస్తున్నాయి ఆమె కళ్ళు, సంధ్యలో కొంగలబారు పీకలకుమల్లె పళ్ళ తళతళలు, చందమామ కోసం మిడిసిపడి ఇసుకమీద త్రుళ్ళిపడిన పెద్ద సముద్ర కెరటంకిమల్లె వక్షం కదుల్తోంది. మనస్సు కనబడదు. ఆకాశం అంతటా ఆవరించి అంతర్ధానమైనట్లు.

రంగనాయకమ్మ పట్టుమీద పార్టీ ఇవ్వక తప్పిందికాదు ప్రసాదుకి. అతనికి మనస్ఫూర్తిగా ఇవ్వాలనుంది. నిజమే కాని శోభాసుందరిని, పిలవాలా, ఆమెని పిలిస్తే, పార్టీ ముగించిన తరువాత భార్యతో కొంత ఘర్షణ తప్పదు. ఆమెని పిలిస్తే మరికొందర్ని పిలవకూడదేమో. తీరా పిలిచాక శోభాసుందరి రానంటే, తనెంతో బాధపడతాడు. ఇదంతా గొడవగావుంది. ఈ పిలుపులన్నీ రంగనాయకమ్మకి విడిచేశాడు తుదకి

ఆనాడు శనివారం. ప్రసాదు ఇంట్లో పార్టీకి ఎక్కువగా స్త్రీలే వచ్చారు. కామాక్షి పెత్తల్లి, రంగనాయకమ్మ అతిథులను కనుక్కుంటున్నారు. ఆనాడు విద్యాసాగర్ కేసు తీర్పు జరిగింది. రాజీకుదిరి పెంచుకొన్న తల్లి ఆస్తిలో మూడొంతులు ఇతనికే దక్కింది నలభై వేలు రొఖ్ఖం, పరహారెకరాల భూమి, కోర్టుఖర్చులు, సగం మినహా విద్యాసాగర్‌కి వచ్చినట్లు తీర్పుజరగడంతో, మాణిక్యాలరావు, సహాయపడిన జూనియర్‌లు, లెక్కలతో, పంపకాలతో బిజీగా హుషారుగా ఉన్నారు. వారి నందర్నీ తనింట్లో పార్టీకి తీసుకొచ్చాడు ప్రసాదు. జనార్ధనం వీణా వాద్యం ఏర్పాటయింది మాణిక్యాలరావు, ఖ్యదం, పదినిముషాలు గడిపి ఆరింటికే వెళ్ళిపోయారు. వారిని సాగనంపడానికి రోడ్డుమలుపు దాకా వెళ్ళాడు ప్రసాదు. విద్యాసాగర్ బుష్‌కోట్, పాంటువేసుకుని తిన్నగా హాల్లోకి వచ్చాడు. ఆకుపచ్చరంగు పట్టుచీర, తెల్లసిల్కు జాకెట్టు, కొప్పులో గులాబీలు, కొవ్వొత్తి వెలుగు ఆకారంలో కుంకుమ, కాటుక

లోంచి ధగధగ మెరిసిపోయే కళ్ళు అందరూ ఆమెకేసి చూసేటట్లు చేసే ఒక ప్రత్యేకమైన ఠీవితో కదుల్తూన్న కామాక్షిని చూసి, విభ్రాంతుడై, వొకడుగు వెనక్కి వేశాడు విద్యాసాగర్.

హరిప్రసాదు హాల్లోకొచ్చాడు.

"మన పార్టీకూడా రేపే – మీరు పాడాలి. నే నెప్పుడూ వినలేదు – మీ రెవర్ని చెబితే వారిని పిలుస్తా. వయలిన్‌కి, మృదంగానికి – మాణిక్యాలరావుగారు ఏవో్వ మార్లన్నారు గొప్పగా పాడతారని..." అన్నాడు విద్యా సాగర్.

"మరోసారి వినిపిస్తాను. ఈ దఫాకి వదిలెయ్యండి. టైర్డుగా వున్నాను. మా అందరికీ నిజంగా ఓ నెలపాటు రెస్టు కావాలి."

"దానికేముంది. అందరం ఊటీకివెళ్ళి వో నెలపాటు కులాసాగా గడుపుదాం. అన్ని ఏర్పాట్లు నే చేస్తానన్నాను మాణిక్యాలరావుతో – వారు, ఎక్కడ తీరుతుందండీ – అనేశారు – నే నేం చెయ్యను. మీరు ఏ దడిగితే, అదివ్వడానికి సిద్ధం..." అన్నాడు నవ్వుతూ విద్యాసాగర్. బల్ల మీద సామగ్రి రుచిచూస్తున్నాడు. "నే నెప్పుడూ చూడలేదు మీ వార్ని...వారేగా..." అన్నాడు కామాక్షిని చూపుతూ. అవునన్నట్లు తలపంకించాడు ప్రసాదు. ఆరుబైట జరుగుతున్న వీణ కచ్చేరి మధ్యలో కొందరు స్త్రీలు బయటకొచ్చి, సెలవు తీసుకొని వెడుతున్నారు. గోడగడియారం ఏడు కొట్టింది.

"చాలా థాంక్స్ మరి వెడతాను" అన్నది శోభా సుందరి. బోర్డరు లేని ఊదారంగు కాటన్ చీర, అదేరంగు బ్లౌజ్ వేసుకుంది. మెడలో వొక్క గొలుసు, చేతికి నల్లస్ట్రాప్ రిస్టువాచి వున్నాయి. హాండ్ బాగ్‌ని వేళ్ళతో కదుపుతూ, దీనంగా చూసింది ప్రసాదుకేసి.

"రాగలిగినందుకు, మిమ్మల్ని థ్యాంక్ చెయ్యాలి. హాస్పిటల్ పనులు..."

వాక్యం పూర్తికాకుండనే, చరచరా నడుచుకుంటూ వెళ్ళింది శోభా సుందరి.

విద్యాసాగర్, గొంతులో ఏదో అడ్డుకున్నట్లై, గ్లాస్‌లో నీళ్ళు త్రాగి తెప్పరిల్లి.

"ఆమె...మీ...?"

"ఆమె వొక డాక్టర్. సంగీతం అంటే చాలా ఇష్టం. కామాక్షి ఫ్రెండ్. ఫామిలీ డాక్టర్—కామాక్షి అక్క అనుకున్నారా—చాలామంది అల్లా అనుకుంటారులెండి. బాగా పోలికవుంది. ఆమె గ్రేట్ బ్యూటీ—కాని మొగుడొదిలేశాడు. వాడో దౌర్భాగ్యుడు. చదువు అబ్బలేదుట. బోలెడాస్థిట. వ్యవసాయమట. ఇంకా బోలెడాస్థి కలుపుకోవాలని కోర్టులు, దావాలూట. పెళ్ళాం చదువుకోకూడదుట. కట్నంలో పదివేలు ఎగేశారన్న మిషమీద వదిలేశాట్ట. ఏమిటో జీవితం. డబ్బువుంటే సంస్కారంవుండదు, సంస్కారంవుంటే డబ్బువుండదు రెండూ వుండికూడా అదృష్టం అంటూ వుండాలిలెండి..."

విద్యాసాగర్ లేచాడు. మొహానికి చెమట్లు పోసేస్తున్నాయి. తుడుచుకుంటున్నాడు.

"మరివెడతా—రేపుదయం కారుపంపుతా..."

"ఏం అలావున్నారు. యు ఆర్ ఆల్ రైట్."

"కాస్త టైర్డ్‌గా ఫీలవుతున్నాను"

విద్యాసాగర్ వెళ్ళాడు. తొందరగా వస్తున్న రంగనాయకమ్మను ఢీ కొనకుండా తప్పుకుని వెడుతున్న ఆయనకేసి ఎగాదిగా చూసింది రంగనాయకమ్మ.

"ఇట్లా రా ప్రసాదు..."

"అజ్ఞ చెప్పండి..."

"చెవులో వూదాలి తెలుసా ?"

"సర్వజ్ఞుణ్ని కాను. వింటె తెలుసుకోలేనంత శుంఠనీ కాను..."

"వెడుదూ—నీ వెటకారం నువ్వూను"

"ఆ వెళ్ళిరాయనే, శోభమ్మ ముద్దుల మొగడు వొదిలేసిందిట."

"వ్వాట్ !"

"కేస్ గెల్చాడుగా— బాగా గుంజిండి. ఏ ముహూర్తంలో పెట్టారో పేరు, విద్యాసాగర్ట. చదువు లేదుటగా ధనసాగరం— బాగా తోడండి."

అని తొందరగా వెళ్ళింది రంగనాయకమ్మ. మరింక ఎవరితో చెప్పాలన్న ఆతృతతోనో.

నే చెప్పదల్చుకున్న వృత్తాంతం యింతటితో ముగిసినట్లె. ఇల్లా విడిచెస్తే పాఠకుడిలో కాస్తంత అసంతృప్తి వుండిపోతుందని తెలుసు. జీవితంలో సంఘటనలకి ఆద్యంతాలు స్ఫుటంగా వుండవు! కళలో స్ఫుటంగా వుండితీరాలని శాసిస్తాడు పాఠకుడు. అతన్ని తృప్తిపరచటంకోసం కళాకారుడు, ఊహని ప్రయోగించి "ఫరవాలేదు. ఇట్లాంటి ముగింపు అసహజం కాదు" అని తనకు సబబని తోచిన ముగింపుచేసి అంగీకరింపజేసేటందుకు, కొంత వ్యాఖ్యానంచేసి సమాప్తి చేస్తాడు. చమత్కారం గల కొందరు రచయితలు, ఆ ఊహాగానం పాఠకుడికే విడిచేస్తారు. పాఠకుడు తన సంస్కారాన్నీ, వైజ్ఞానిక సంపదనూ అనుసరించి, ముగింపు సూచించుకొన్నా అసంతృప్తి మాత్రం తొలగిపోదు.

ఇల్లా పాఠకుణ్ని గాలితో వదిలెయ్యడం నా కిష్టంలేదు. పైగా కథలో పాత్రలకి ఓ విధంగా అన్యాయం చెయ్యడమే అవుతుంది గాన, ఆరు నెలల తర్వాత వ్యక్తమైన ఈ కథ ముగింపు చెప్తాను. పుట్టడం,

చావటం ఆద్యంతాలు కావాలనే ప్రశ్న రావచ్చు. నిజానికి ఆ రకం ఆద్యం తాలు సృష్టికి సంబంధించినవి. కాని, జీవితానికి సంబంధించినవి కావేమో. ఈకథముగింపులో ఈ రెండూలేవు. కామాక్షి మరో ఆరు మాసాలకి కాని ప్రసవించదు. మగ శిశువో, ఆడ శిశువో మనకి తెలియదు. సుఖప్రసవ మైందా! తల్లి, పిల్లా క్షేమమా ఇవన్నీ సృష్టికి సంబంధించిన ప్రశ్నలు. ఆరు నెలల తరువాత ఒక శుభలేఖ అందుకున్నాడు హరిప్రసాదు. అది తననూతన గృహప్రవేశానికి శోభాసుందరి, విద్యాసాగర్ పంపిన ఆహ్వాన పత్రం. అతన్ని వచ్చి కచ్చేరీ చెయ్యవల్సిందిగా, భార్యా భర్తలు ఇరువురి సంతకాలతోనూ ఒక ఉత్తరంకూడా వుంది. "అనురాగము లేని— రాగ ప్రస్తార — ప్రథమ అంశంగా — ప్రోగ్రాములో వేయిస్తున్నాం మరువ కండేం ! !"